






ముఖచిత్రం : శ్రావణ పూర్ణిమ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

తప్పక చూడండి!

చలం సమర్పించు శ్రీరమణ చిత్ర ఆర్ట్స్

# డూడూ బసవన్న

దర్శకత్వం
బి.వి. ప్రసాద్

నిర్మాత
శ్రీమతి డి. సీతా పద్మరాజు



# జూలై నెల క్విజ్

## సమాధానాలు

1 — ఎ    2 — ఎ    3 — సి

4 — బి    5 — డి

6. 64    7. నైహూసేతు    8 డెహ్రాడూన్

9. ఎఱ్ఱాప్రెగడ    10. అక్టోబరు 24

1. కాశిన జగన్మోహన్‌రావు, కాకినాడ 2. ఎస్. శ్రీరామం, తిరుపతి 3. మంజూర్ రహమాన్, కాకినాడ 4. టి. హెచ్. పతంజలి, తెనాలి 5. టి. రామబాబు, తెనాలి 6 డి. కృష్ణారావు, వాత్తేరు 7. కె. ఎమ్. నటరాజన్, సికింద్రాబాద్ 8 బి. రత్నమోహనరావు, కాకినాడ.

ఆల్ కరెక్టు సమాధానాలు పంపిన పైతొమ్మిదిమందికి రూ. 33.66 చొప్పున పంచటమైంది.

—సంపాదకుడు

తప్పక చూడండి




సుదర్శన్ 35 ఎమ్ ఎమ్ — కమల్

ఎ.సి. హైదరాబాద్ — హైదరాబాద్

శ్రీదేవి

చిలకలగూడ

వెంకటేశ 35 ఎమ్ ఎమ్ — వెంకటలక్ష్మి

వరంగల్ — ఖమ్మం

నటరాజ్

మిర్యాలగూడ

# INDIAN COUNCIL FOR INTERNATIONAL AMITY

(Registered Under Rajasthan Societies Registration Act 1958)
Adm Sectt ; BHAVANA, C-127 Dayanand Marg, Tilaknagar, Jaipur 302 004

## Eighth All Inda Schools General Knowledge Competition 1978

## OPEN TO ALL

## Upper Primary, Middle, Secondary & Higher Secondary Schools of India

The Educational Institutions under the Directors of Education/Public Instruction of Andhra Pradesh, Assam, Bihar, Haryana, Himachal, J & K, Karnataka, Kerala, Maharashtra, Manipur, Meghalaya, Nagaland, Orissa, Punjab, Rajasthan, Sikkim, Tamilnadu, Tripura, U. P, West Bengal, Chandigarh, Delhi, Goa, Daman and Diu and Kendriya Vidyalaya Sangathan have already been permitted by the respective Govts. to take active part in this competition.

| FIRST | SECOND | THIRD | THIRTY ONE | All Others |
|---|---|---|---|---|
| Scholarship of Rupees two hundred fifty in each category | Scholarship of Rs. One hundred fifty one in each category | Scholarship Rs One hundred one in each category | Merit Certificates and Silver Medals in each category | Securing 36% Marks or above to get certificates |

**DATE & TIME OF THE CONTEST :**
Monday, the 25th Sept., 1978 from 9-30 a. m. to 11-30 a m.

**Cotegories :**

**Seniors :** Indian School Students of Classes IX, X, XI & XII

**Juniors :** Indian School Students of Classes VI, VII and VIII

**CENTRE :** May be opened at any Govt./Recognised educational institution sending at least 30 candidates. **BOOKS : Seniors** Rs. 5 50 **Juniors** Rs. 2.50 Hindi/English, available from the publications wing of the Council. No postal expenses to be charged for orders of 5 or more books. 20% discount on ten or more books. **FEE :** Rupees FOUR per candidate. No individual entry accepted. **Evaluators:** To be appointed from schools sending 100 or more candidates. To be paid by the ICFIA. **Invigilators :** To be paid separately by the Council. **How to apply :** Send a category wise alphabetical list (In Duplicate) along with fees (after deducting 50 P. per candidate for centre and postal expenses) through account payee Bank Drafts/Postal orders/Money orders payable to Indian Council for International Amity, 1587, Maheshwari Vidyalaya Marg, S. M. S Highway, Jaipur 302 003 (or BHAVANA, C—127, Dayanand Marg, Tilaknagar, Jaipur 302 004 by the 25th August, 1978). An amount of Rupees three also is to be sent to the Council (out of the leftover money) towards the annual subscription of the monthly "Amity International."

**Seventh Competition**

**Total Candidates :** 35,000 **Centres** 683 **Previous Question Papers :** Can be obtained by sending 40 P stamped self addressed envelope of 9"×4" size.

N. S. TANWAR
President

ASHOK GUPTA
Secretary-General

## శ్యామ్‌బెనిగళ్ అపూర్వ సృష్టి

"ఈ తీర్థం ఎందుకు"
"కొన్ని ప్రశ్నలు వెయ్యకూడదు. కొన్ని ప్రశ్నలకు సమాధానాలు చెప్పకూడదు..



రవిరాజ్ ఇంటర్నేషనల్ శ్యామ్ బెనగల్ చిత్రం

# అనుగ్రహం

ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత: కొటంరెడ్డి వెంకటరామరెడ్డి

శ్రీ తారకరామ రిలీజ్

**సంగం**
ఎ.సి. హైదరాబాద్

**అంజలి**
సికింద్రాబాద్
(ఉదయం 11 గం॥లకు మాత్రమే)

# యువ
## దీపావళి ప్రత్యేక సంచిక

ఎప్పటివలె ఈ కాళయుక్తినామ దీపావళికి వెలువడే ప్రత్యేక సంచికలో ప్రచురణార్థం — రచయితలు, రచయిత్రులు, కార్టూనిస్టులు తమ తమ రచనలను, కార్టూన్లను మా కార్యాలయానికి జూలై నెలాఖరు లోగా పంపగోర్తాము. క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

1. రచన ఫుల్‌స్కేప్ సైజులో 10 పేజీలకు మించరాదు.

2. కాగితానికి ఒక ప్రక్కనే వ్రాయాలి.

3. కవరుమీద 'దీపావళి సంచిక కోసం' అని వ్రాయాలి

4 ప్రచురణకు అంగీకరించబడనివాటిని త్రిప్పి పంపగోరేవారు తగు పోస్టేజీగల స్వంత చిరునామా వున్న కవరును జతపర్చి పంపాలి. రచనతోపాటు స్టాంపులు జతపరచనియెడల రచనలను త్రిప్పి పంపటం సాధ్యంకాదు.

5. రచన తమ సొంతమేననీ, దేనికీ అనుకరణ, అనువాదం కాదనీ హామీ పత్రం వ్రాయాలి.

6. దీపావళి సంచికకోసం పంపినా, స్థలాభావంవల్ల అందులో ప్రచురించకపోతే, తరువాతి సంచికలలో ప్రచురించే హక్కు మాకుంది.

— సంపాదకుడు, యువ

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 38 ఆగస్టు, 1978 సంచిక 2


మన రాష్ట్రంలో కొత్త మంత్రిమండలి ఏర్పడి నాలుగు మాసాలు గడిచిపోయాయి. మంత్రులు తమ, తమ స్థానాలలో కుదురుపాటు ఏర్పరచుకొని తమ పరిపాలనా శాఖల వ్యవహారాలను అవగతం చేసుకున్నారు. పరిపాలన సాగిస్తున్నారు. చాలామంది మంత్రులు తమ శాఖలలో కొన్ని కొత్త పంథాలను, పథకాలను రూపొందిస్తున్నారు. ఇదంతా సంతోషించవలసిన విషయమే.

ఏడాదిపాటయినా పరిపాలన సాగిస్తేగాని, ఏ మంత్రిమండలి అయినా ఎంత సాధించిందనేది చెప్పడం కష్టం. కొత్త పథకాలను రూపొందించి అమలులోనికి తేవడానికి ఏడాది పట్టవచ్చును. కాని, పరిపాలనలో ప్రజలకు కొంత ఇబ్బందిని కలిగించే పద్ధతులకు స్వస్తి చెప్పడానికి ఏడాది అక్కరలేదు; నెల కూడా అక్కరలేదు.

అలా ప్రజలకు ఇబ్బంది కలిగిస్తూవున్న ఒక పద్ధతి, నగరాలలోని నివేశన స్థలాల విషయం. నివేశన స్థలాలకు గరిష్ఠ పరిమితి నిర్ణయించబడింది. పరిమితికి మించిన స్థలాలు కలవారు వివరాలను ప్రభుత్వానికి తెలియచెయ్యాలి. పరిమితికి మించి ఏ కొద్దిగానో స్థలంగలవారు అర్జిస్తే, వారికి మినహాయింపు ఇవ్వబడుతుంది. పరిమితికిలోపు స్థలాలు గలవారుగాని, మినహాయింపును పొందిన

వారుగాని, తమ స్థలాలను అమ్ముకోవాలంటే ప్రభుత్వపు అనుమతిని పొందాలి. ఇది కేవలం అనవసరమైన నిబంధన. పొలాల విషయంలో లేని యిలాటి అనవసరపు నిబంధన నివేశన స్థలాలకు మాత్రం ఎందుకు వుండాలి ? దీనివల్ల ప్రయోజనం ఏమిటి ?

పరిమితికి లోబడిన నివేశన స్థలం కలవారు దానిని అమ్ముకోవలసి వచ్చిందంటే, వారి కుటుంబానికి ఏదో అత్యవసరంగా డబ్బు కావలసివచ్చి, ఆ అవసరాన్ని గడుపుకోవడానికి ఆ స్థలాన్ని గతిలేక అమ్ముకుంటున్నారన్న మాట. అలాటి అవసర పరిస్థితులలో, ఆ స్థలాన్ని అమ్ముకోవడానికి ప్రభుత్వపు అనుమతి కోసం, ప్రభుత్వపు కార్యాలయాల చుట్టూ తిరగడమూ, ఆ అనుమతి లభించడానికి కొన్ని మాసాలు, లేదా కొన్ని వారాలు గడవడమూ, ప్రజలకు చాలా బాధకరమైన విషయము. అంతేకాదు; ప్రభుత్వోద్యోగులకు అనవసరమైన పని; ప్రభుత్వ కార్యాలయాలలో అక్కరలేని రద్దీ. అంచేత, పరిమితికిలోపు నివేశన స్థలాలు గలవారూ, పరిమితికి ఏ కొద్దిగానో ఎక్కువగా వున్నా ప్రభుత్వంనుంచి మినహాయింపు ఉత్తరువును పొందినవారూ, తమ నివేశన స్థలాలను ప్రభుత్వపు అనుమతి లేకుండానే స్వేచ్ఛగా అమ్మకో వచ్చునని ప్రభుత్వం ఎంత త్వరగా ఉత్తరువులు జారీ చేస్తే, ప్రజలకు అంత ఎక్కువగా మేలు జరుగుతుంది.

ప్రభుత్వపు జోక్యం ప్రజాజీవితంలో ఎంత తక్కువగా వుంటే, ప్రభుత్వ పరిపాలన అంత త్వరితంగా సాగుతుంది. ప్రభుత్వానికి ప్రయోజనం లేకపోయినా ప్రజలకు బాధాకరములైన నిబంధనలను శీఘ్రంగా తొలగించడంలో, డాక్టరు చెన్నారెడ్డిగారి మంత్రిమండలి శ్రద్ధ చూపుతారని ఆశిస్తున్నాము.

* * *

మన రాష్ట్ర ప్రభుత్వంఅత్యంత శ్రద్ధ చూపవలసిన ముఖ్య విషయం, మరొకటి వున్నది. అది చక్కెర ధర. మన రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్న చక్కెరకు కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన లెవీ ధర చాలా తక్కువగా వున్న కారణంచేత, చక్కెర ఫాక్టరీలవారు రైతులకు చెరకు ధరను ఎక్కువ ఇవ్వలేక పోగా చాలా నష్టపడుతున్నారు. చెరకుకు ధర బాగా రావడంలేదని, కొంత మంది రైతులు యీ సంవత్సరం చెరకు నాటడం మానేశారని తెలుస్తోంది. ఈ విధంగా చెరకు సాగు తగ్గిందంటే, ఫాక్టరీలు విపరీతమైన నష్టం పొందడమే కాక, కొన్ని మూతపడవచ్చును కూడా. కాబట్టి, ఈ విషయంలో మన రాష్ట్రి

ప్రభుత్వం శీఘ్రంగా తగిన చర్య తీసుకోవాలి. తగిన చర్య అంటే లెవీ ధరను పెంచవలసిందని కేంద్ర ప్రభుత్వాన్ని ఎలాగయినా ఒప్పించాలి. అలా ఒప్పించి, ఎక్కువ ధరను యిప్పించడంతో పాటు, చెరకు పండించే రైతులు చెరకు నాటడం మానివెయ్యకుండా, వారికి ప్రోత్సాహం యివ్వాలి. లేకపోతే కోట్ల రూపాయలను పెట్టుబడి పెట్టిన అనేక వేల మంది వాటాదార్లూ, చక్కెర ఫాక్టరీలలో పనిచేస్తున్న అసంఖ్యాక ప్రజలూ విపరీతమైన కష్టాలకు గురి అవుతారు. ఏ మాత్రం జాప్యం చెయ్యకుండా మన రాష్ట్ర ప్రభుత్వం చర్య తీసుకొనవలసిన విషయమిది

## సెప్టెంబరు నెల యువ

# భావపరిచయ పోటీ

### బహుమానం రూ. 25

**ఈ కార్టూనుకు హాస్యయుత వాఖ్య (Caption) కావాలి**



గమనిక : వ్యాఖ్యలు పోస్టుకార్డు మీదనే వ్రాయాలి.
జూలై 29 వ తేదీ లోపు మాకు చేరాలి.

---

## ఆగస్టు నెల యువ భావపరిచయ పోటీ

### బహుమతి పొందిన వ్యాఖ్య



నాటి యశోదకు కలిగిన భాగ్యం ! కలిగించెను నేటి వైద్యునకు చోద్యం !!

— ఆదిరెడ్డి మావుళ్ళు, చోడవరం

## తాళ్లూరు నాగేశ్వరరావు



సాయంత్రం అయిదు గంటలు.

ఆఖరి పిరియడ్ బెల్ మోగింది.

షేక్స్‌పియర్ డ్రామా 'ఏజ్ యు లైక్ ఇట్' లో ఒక దృశ్యాన్ని గురించి చెబుతూ మధ్యలో ఠక్కున ఆపివేసింది స్వరూప. పిరియడ్ అయిపోయినట్టు గంట మోగింతర్వాత స్టూడెంట్స్ ఒక్క క్షణంసేపు కూడా నిలకడగా బెంచీల

మీద కూర్చోలేరు. అందులో ఆఖరి పిరియడ్. స్టూడెంట్స్ ప్రాణాలన్నీ ఇళ్ళవైపే పూగులాడుతూ వుంటాయి. పాఠ్యాంశాన్ని లెక్చెరర్ ఒక్క నిముషం పొడిగించినా వాళ్ల మొహాల్లో అశాంతి పొగలు ఆవురావురుమంటూ లేస్తాయి. అది కనిపెట్టిన వాళ్ళు వెంటనే తమ లెక్చెర్‌ను ఆపుచేస్తారు. బాదస్తంగల లెక్చెరర్లు మరో మూడు నిముషాలపాటు గొంతు చించుకొని స్టూడెంట్స్ అశాంతికి, విసుగుదలకూ, అయిష్టతకూ గురవుతారు. స్వరూప ఆ తరగతికి చెందింది కాదు. అందుచేతనే వెంటనే పుస్తకం మూసేసి క్లాసునుంచి బయటకొచ్చేసింది. బి. ఏ. మొదటి సంవత్సరపు విద్యార్థినులంతా బిలబిలమంటూ లేచి, ఆమె వెంటే బయటికొచ్చారు— బందిఖానానుంచి బయటపడ్డంత రిలీఫ్‌తో.

స్వరూప నేరుగా స్టాఫ్‌రూమ్‌లోకి వచ్చింది. అప్పటికే కెమిస్ట్రీ లెక్చరర్ సుజాతా, బోటనీ లెక్చరర్ సుభాషితా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆ జనరల్ స్టాఫ్‌రూమ్‌లో ఓ మూలగా తెలుగు హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ జానికమ్మ, హిందీ లెక్చరర్ వెంకటలక్ష్మి కూర్చుని చెస్ ఆటలో తీవ్రంగా నిమగ్నులై వున్నారు. వారికి ఆఖరి బెల్ కూడా వినబడినట్టులేదు.

"ఏమిటోయ్! లాస్ట్ పిరియడ్ కూడా లాస్ట్ మినిట్‌దాకా స్టూడెంట్స్ పేషన్సును టెస్ట్ చేసినట్టుంది," అంది సుజాత ఇంగ్లీషు లెక్చెరర్ స్వరూపను ఉద్దేశించి.

"నాకు ఫస్టుపిరియడైనా ఒకటే, లాస్ట్‌పిరియడైనా ఒకటే! ఆ తేడా స్టూడెంట్స్‌లో వుండాల్సిందే గానీ, నాలో వుండదు," అంది స్వరూప వాళ్ల ఎదురుగ్గా కూర్చుంటూ. చేతిలో పుస్తకాల్ని, చాక్‌పీస్, డస్టర్ను టేబుల్‌మీద పెట్టింది.

"అదేమిటోయ్! కుర్చీలో చతికిలబడ్డావు. అయిదయింది. ఇంటికెళదాం, పద. నీకోసమే వెయిట్‌చేస్తున్నాం," అంది సుభాషిత.

"మీ రెళ్లండి. నేనో అరగంటసేపు టెస్ట్‌పేపర్లు దిద్ది వస్తాను. రేపు ఫస్టు పిరియడ్‌లో ఇవ్వాలి," అంది స్వరూప.

"చంపావు పో. నీకోసం నిరీక్షిస్తూంటే, కొసకు నిరాశపరుస్తావా?" అంది సుభాషిత.

"ఇందులో నిరాశా, నిస్పృహా ఏముందే సుభా! ఓ అరగంటలో వస్తానుగా. ఈ లోపల ఇంటికెళ్ళి నాగరత్తమ్మచేత వంటపని మొదలెట్టించండి," అంది స్వరూప.

"ఆ పేపర్లేవో ఇంటిదగ్గర దిద్దుకోకూడదూ !" అంది సుజాత.

"మళ్ళీ యీ దుకాణం ఇంటిదగ్గర దేనికి ?" అంది స్వరూప.

"సరే ! నీ ఇష్టమే స్వరూ ! చెబితే వినే ఘటానివి కాదుగా ! నీ మతమే నీది. ఉద్యోగం పురుషలక్షణం అనేవాళ్ళు పూర్వం. ఇప్పుడు నీలాంటిదాన్ని చూసి ఉద్యోగం ఆడలక్షణం అనవల్సివస్తోంది," అంటూ లేచింది సుభాషిత.

సుభాషితా, సుజాతలు రూమ్‌నుంచి బయటకు వెళ్ళగానే, బీరువాలోంచి టెస్ట్ పేపర్లకట్ట తీసింది స్వరూప.

సాయంత్రపు ఎండ పల్చబడిపోయింది.

మెయిన్ రోడ్డుమీద జనం హడావుడి, వాహనాల రాకపోకలు జాస్తి అయి నాయి. సుభాషితా, సుజాతలు రోడ్డుపక్కన నిలబడ్డారు. ఒక రిషా వచ్చి ఆగింది.

"అరండేల్ పేట వస్తావా ?''

రిక్షావాడు తల ఆడించాడు.

"ఎంత ?"

"ఎక్కడ ?"

ఫలానా చోట అని చెప్పింది సుజాత.

"ఇద్దరా ! ఒక్కరా ?'' అలవాటుగా అడిగాడు రిషావాడు.

"ఇద్దరూ."

"రూపాయిన్నర ఇప్పించండి."

"రోజూ వెళుతూనే వున్నాం. రూపాయిపావలా" అంది సుభాషిత.

"పావలాదేముంది అమ్మగారూ - పేదోణ్ణి పూర్తిగా రూపాయిన్నర ఇవ్వండి," అన్నాడు రిక్షావాడు ప్రబతిమాలింపు స్వరంతో.

"అదేంలేదు. రూపాయిపావలా మామూలే !" అంది సుజాత.

అంతలో మరో రిషావాడు గంట మోగించుకుంటూ వచ్చాడు. ఆ పోటీని గ్రహించి,— "ఎక్కండమ్మగారూ !" అన్నాడు మొదటి రిక్షావాడు.

ఇద్దరూ రిషా ఎక్కి కూర్చున్నారు.

ఎండ తీవ్రత తగ్గినా, గాలి అనుకూలంగా లేకపోవటాన వాతావరణం చిటపటగా ఉంది. ఉక్కపోస్తుంటే రిక్షా టాప్ తీయించారు.

"రోజూ రెండుపూటలా రిక్షావాళ్ళతో బేరాలాడడం చికాగ్గా ఉందే! నెల కింతని ఓ రిక్షాను కాంట్రాక్టుకు మాట్లాడుకుంటే బావుంటుంది" అంది సుజాత.

"మనం ముగ్గురం కదా! రెండు రిక్షాలు మాట్లాడుకోవాలి'' అంది సుభాషిత.

"పోనీ అలానే మాట్లాడుకుందాం."

"కాని వాళ్ళతో ఓ ఇబ్బంది ఉందే!''

"ఏమిటది?"

"వాళ్ళు టైంకు రారు. మనం ఇచ్చిన టైంలో ఏదైనా మంచి బాడుగ తగిల్తే, మనల్ని మర్చిపోయి, అటే పోతారు. మన పని ఖాళీ. అటు కాలేజీకి టైం అయిపోతుంది; ఇటు కాంట్రాక్టు రిక్షా వున్నతర్వాత డబ్బులిచ్చి మళ్ళీ రిక్షా ఎక్కలేం. ఎక్కక తప్పదు. లేనిపోని వర్రీ. ట్రబుల్ కొని తెచ్చుకోవడమే!"

వాళ్ళు అట్లా మాట్లాడుకొంటూ వుండగా రిక్షా రైల్వేబ్రిడ్జి దగ్గర కొచ్చింది. పైకి తొక్కలేక రిక్షా దిగి నడిపించసాగాడు రిక్షావాడు. బ్రిడ్జి పేవ్‌మెంట్లమీద అటూ ఇటూ జనం నిర్విరామంగా పోతున్నారు కార్ల హారన్‌లు, సైకిల్ బెల్‌లు, స్కూటర్ల కిర్‌కిర్‌లు, రిక్షావాళ్ళ కేకలతో బ్రిడ్జిమీద సందడి జోరుగా వుంది.

రిక్షా బ్రిడ్జి ఎక్కింది.

పడమట అస్తమిస్తోన్న సూర్యుడు నెత్తురుగడ్డలా వున్నాడు.

రిక్షా బ్రిడ్జి ఎక్కగానే, పట్టిన చెమటనంతా ఒక్కసారి కుడిదితో తుడుచు కొని, ఊపిరి పీల్చుకొని, ఇంక మిగిలిందంతా 'డౌన్' అనే హుషారుతో గబుక్కున రిక్షా ఎక్కాడతను.

వివిధ రకాల చప్పుళ్లమధ్య మాటలు వినబడక మాట్లాడుకోవడం మానేశారు సుజాత, సుభాషితలు. పల్లం కావటాన రిక్షా తొక్కకుండానే జోరుగా పోతోంది.

రిక్షాలో ఎడంపక్కన కూర్చున్న సుజాత ఎడంవైపునున్న దుకాణాలనూ, కుడిపక్కన కూర్చున్న సుభాషిత కుడివైపునున్న దుకాణాలనూ అప్రయత్నంగా చూడసాగారు.

వెనకనుంచి ఏదో స్కూటర్ వేగాతివేగంగా వొచ్చి ఆ రిక్షాను 'ఢీ' కొంది.

రిక్షాలో వున్న సుజాతా, సుభాషితలు రోడ్డుమీద అటూ ఇటూ రబ్బరు బంతుల్లా పడ్డారు.

అంతా క్షణంలో సగం సేపు. యాక్సిడెంట్.

రోడ్డు స్తంభించింది. రోడ్డుమీది జనం ఆగిపోయారు; వాహనాలు ఆగి పోయాయి.




రిక్షాను కొట్టిన స్కూటర్ మటుకు ఆగలేదు.

రిక్షా బిళ్ళబీటుగా పడింది. రిక్షావాడు అంత దూరంలో రోడ్డుకు కర్చుకున్నాడు.

'అరెరెరే...' 'ఎంతదారుణం!' 'పాపం!... ఆడవాళ్ళు!' 'ఏదీ ఆ స్కూటర్?' మొదలైన మాటలతో రోడ్డుమీద జనం గుమిగూడారు.

అప్పుడే కాలేజీనుంచి సైకిల్‌మీద వస్తున్న శ్రీకాంత్ ఆ దృశ్యాన్ని చూశాడు. గబగబా సైకిలు దిగాడు. 'ఏం జరిగింది? ఏం జరిగింది?' అంటూండగానే, తెల్ల చీరమైన దుమ్మును దులుపుకుంటూ లేస్తూన్న సుజాత అతని కంటబడింది. "అక్కా!" అంటూ రెండు అంగల్లో ఆమె దగ్గర కెళ్ళాడు. ఇటు చూస్తే నల్ల చీరపైన దుమ్మును దులుపుకుంటూ సుభాషిత కనబడింది. "అక్కా!" అంటూ మరో అంగ ఇటు వేశాడు శ్రీకాంత్.

సుజాతకు మోచేలూ దోక్కుపోయింది. కొద్దిగా నెత్తురు కారసాగింది. ఆ నెత్తురు తెల్లచీర కంటుకొని మరకలుగా ఏర్పడింది. కుడిచేతి గాజులు పగిలిపోయాయి. కాలు చిటికెనవ్రేలు కొంచెంగా చిట్లింది. అయితే రక్తం ఎక్కువగా రావడంలేదు. ఆమెకు కొద్దిలో పెద్ద ప్రమాదం తప్పిపోయింది. తల పేవ్‌మెంట్‌కు కొట్టుకోవాల్సింది. మోచేయి అడ్డం పెట్టింది. సుభాషితకు కింది పెదవిపైన దెబ్బ తగిలింది. రక్తం కారుతుంటే, చేతిరుమాలుతో అదిమిపెట్టింది. ఆమె చేతిగాజులు పగిలిపోయి, రోడ్డుమీద చెల్లాచెదరయ్యాయి. రిక్షావాడికూడా అదృష్టవశాత్తూ పెద్ద దెబ్బలు తగలలేదు. రోడ్డును కావిలించుకున్నాడు గానీ, ఎదురుగ్గా వస్తోన్న కారును దాని డ్రైవర్ సడన్ బ్రేక్ వేసి అదుగు

దూరంలో ఆపుచేశాడు. లేకపోతే రిక్షావాని తల కారుకింద పడి పచ్చడిపచ్చడి అయ్యేదే.

రిక్షాలో ఎక్కినవాళ్ళకూ, రిక్షా తొక్కేవానికి ఎక్కువ దెబ్బలు తగల్లేదు గానీ– రిక్షాకు దెబ్బ తగిలింది. ముందు చక్రం వొంగిపోయింది. టైరు పగిలి పోయింది. టార్పాలిన్ గుడ్డ చిరిగిపోయింది. రిక్షా మొత్తం మూడు అంకెలా తయారై, నడపటానికి వీల్లేకుండా పోయింది.

"ఎట్లా జరిగింది అక్కా– యాక్సిడెంట్ ?" అని ఇద్దర్నీ అడిగాడు శ్రీకాంత్ ఆదుర్దాతో కూడుకున్న ఆవేశంతో.

కాని వాళ్ళు సమాధానం చెప్పే స్థితిలో లేరు. దెబ్బలు అట్టే తగలకపోయినా అంతమందిలో అవమానం భరించరానిదైంది. ఇద్దరూ ఉమెన్స్ కాలేజీలో లెక్చ రర్లు. బాగా చదువుకున్నవారు. సమాజంలో హోదాగలవారు. అవివాహితులు. అంతమంది జనం మధ్య రోడ్డుమీద పడడం, చీరలకు దుమ్ము కొట్టుకోవడం, అందరి కళ్ళూ వాళ్ళమీద వాలడం, ఆశించని సానుభూతికి అవకాశం కలగడం, చేయని తప్పుకు అవజ్ఞపాలు కావడం– అందుకే వాళ్ళు బిత్తరపోయి, మొహాలు వ్రేళ్ళాడవేసుకొని, దుర్భరమైన ఆ దృశ్యంనుంచి అదృశ్యం కావడానికి తహ తహ లాడజొచ్చారు. ఆ యాక్సిడెంట్ ఏ మారుమూల వీధిలోనో, జనంలేని ప్రదేశంలోనో జరిగితే అంత అవమానం పొందాల్సింది కాదు.

వాళ్ళ మొహాల్లోని ఆదుర్దానూ, అవమానాన్నీ, జంకునూ, భయోత్పాతాన్నీ అర్థం చేసుకోకుండా– యాక్సిడెంట్‌కు కారకులైన వాళ్ళను చెప్పమని కోపా వేశంతో అడగసాగాడు శ్రీకాంత్.

"ఎవరిదో స్కూటర్ వొచ్చి రిక్షాను కొట్టింది. స్కూటర్ ఆగకుండా పారి పోయింది," అన్నారు ఎవరో గుంపులోంచి.

అంతలో బీట్‌కానిస్టేబుల్ వచ్చాడు విజిల్‌వేస్తూ. ట్రాఫిక్ జామ్‌ను తొల గించడానికి ప్రయత్నిస్తున్నాడు.

రోడ్డుమీద పడ్డ పుస్తకాల్ని ఓ కుర్రాడు జాగ్రత్తగా ఏరి సుజాతకిచ్చాడు.

"ఒక్క నిముషంలో తప్పించుకున్నాడు ఆ దుర్మార్గుడు. నే నుంటే ఆ స్కూటర్‌మీద వాడ్ని కూర్చోబెట్టి పెట్రోల్‌పోసి మరీ తగలబెట్టేవాడ్ని..." అన్నాడు శ్రీకాంత్ చల్లారని కోపోద్రేకంతో.

అతని మాటల్ని ఎవ్వరూ పట్టించుకోలేదు

ఆ స్కూటర్ ఎట్లా వుంది ? ఏ రంగు ? దాని మీదున్నది యువకుడా! మధ్య వయస్కుడా ? ముసలివాడా ? తెల్లగా వున్నాడా ? నల్లగా వున్నాడా ? ఎటుకేసి

వెళ్ళాడు? మొదలైన ప్రశ్నల్ని అక్కడ వున్నవాళ్ళను శ్రీకాంత్ వేశాడు. అయితే ఎవ్వరూ సూటిగా, కళ్లతో చూసినట్లుగా సమాధానాలు చెప్పలేక పోయారు.

సుజాత కొద్దిగా ఆ షాక్‌నుంచి తేరుకొని, శ్రీకాంత్‌ను మరో రిక్షా మాట్లాడి పెట్టమన్నది.

ఇంకో రిక్షాను మాట్లాడి, అక్కలిద్దర్నీ అందులో ఎక్కించి, బాడీగార్డ్‌లా తాను ఆ రిక్షాపక్కనే సైకిలు తొక్కుకుంటూ ఇంటికెళ్ళాడు శ్రీకాంత్.

రిక్షా దిగి వంచిన తలలు ఎత్తకుండా ఇంట్లోకొచ్చి పడ్డారు సుజాత, సుభాషితలు. రిక్షాకు డబ్బులిచ్చి, తన సైకిల్ను వరండాలో పెట్టి, లోపల కొచ్చాడు శ్రీకాంత్.

లోపల గదిలో ఎదురుబదురు కేన్ కుర్చీల్లో కూలబడి, బరువెక్కిన మొహాలతో మాటా పలుకూ లేకుండా వుండిపోయిన అక్కల్ని చూసిన శ్రీకాంత్- "అసలేం జరిగింది?" అన్నాడు సీరియస్‌గా.

"మా నుదుట ఏం వ్రాసివుందో అదే జరిగింది" అంది సుభాషిత.

"అదికాదక్కా! ఆ యాక్సిడెంట్ దానంతట అది జరిగిందా? ఎవరైనా దుండగులు కావాలని చేశారా? అని" అన్నాడు శ్రీకాంత్.

"అది పోలీసు ఇన్వెస్టిగేషన్‌లో తేలే విషయం. మన కెట్లా తెలుస్తుంది?" అంది సుభాషిత.

"పోలీసు రిపోర్టు ఇచ్చారా?" అన్నాడు శ్రీకాంత్ కుతూహలంగా.

"జరిగిన అవమానానికే తలలు నేలకేసి కొట్టుకొంటూంటే, పైగా పోలీసు రిపోర్టా?" అంది సుజాత.

"ఇందులో అవమానమేముందక్కా. మనం వీధిన పోతూంటే, బజారుకుక్క వచ్చి మనవెంట పడిందనుకో. అది మనకు అవమానమా?" అన్నాడు శ్రీకాంత్.

"మరి కాదా? వీధిలో వందలకొద్దీ జనం నడుస్తూంటే అందరివెంటా పడకుండా, మన వెంటే పడితే మనలో ఏదో లోపం వున్నదన్న మాటేగా?" అంది సుజాత.

"అది వేరు, ఇది వేరు" అన్నాడు శ్రీకాంత్.

"ఏది ఏమైనా అవమానంతో బయటపడ్డాం గానీ, అవయవాలు సక్రమంగానే వున్నాయి. అందుకు లేచిన వేళావిశేషాన్ని మెచ్చుకోవాలి." అంది సుభాషిత.

"ఈ కర్మ సిద్ధాంతంతో నాకు నమ్మకం లేదక్కా! నొసటి వ్రాతల ప్రకారం, చేతిలోని రేఖల ప్రకారం జీవితంలో సంఘటనలు జరిగితే, మానవుని

మనుగడ దేనికి? ఇవాళ మీ ఇద్దరికీ రైల్వేబ్రిడ్జిపైన రిక్షా యాక్సెడెంట్ జరగాలని భగవంతుడు ముందే నిర్ణయించి వుంచాడంటావా! అంతా నాన్సెన్స్! ఇవాళ జరిగిన యాక్సెడెంట్ యాదృచ్ఛికమైంది కాదు" అన్నాడు శ్రీకాంత్.

"మరి" అంది సుజాత చివుక్కున తలెత్తి.

వంటమనిషి నాగరత్తమ్మ మూడు కప్పుల్లో వేడి వేడి కాఫీ తీసుకొచ్చింది.

సాయంత్రపు పొద్దు పూర్తిగా వాలిపోయింది. మునిచీకట్లు మెత్తగా ప్రవేశించాయి.

ఇరవయ్యేళ్ళ కోడెవయస్సులో వున్న శ్రీకాంత్ తన ఆర్గ్యుమెంట్ చెప్పబోతూండగా- బయట రిక్షావచ్చి ఆగిన శబ్దమైంది.

"స్వరూ వచ్చినట్టుంది" అంది సుభాషిత కుర్చీలో వుండే. లేచి, వాకిట్లోకి తొంగి చూడటానికి ఆమెకు బద్ధకమేసింది.

శ్రీకాంత్ వీధి వాకిట్లోకి తొంగి చూశాడు. నిర్ఘాంతపోయాడు.

నుదురు మీద నెత్తురు మరకల తెల్లని కట్టుతో, కుంటుకుంటూ స్వరూప మెల్లగా ఇంట్లోకి వస్తూంది.

"ఏమైంది అక్కా!" అంటూ వరండాలోకి ఒక్క గంతువేశాడు శ్రీకాంత్.

సుజాత, సుభాషితలు కూడా ఆదుర్దాగా బయటికొచ్చారు.

"ఏమైందే!" అన్నారిద్దరూ, ఒక్కసారిగా.

గంభీరమైన మొహంతో మౌనంగా లోపలకొచ్చి కూర్చుంది స్వరూప.

"ఏం జరిగిందక్కా?" అన్నాడు శ్రీకాంత్.

"రిక్షా యాక్సిడెంట్" అంది స్వరూప పేలవంగా.

"ఎక్కడ?"

"ఎట్లా జరిగింది?"

"రిక్షా దేనికైనా తగిలిందా? ఏదైనా వచ్చి రిక్షాను కొట్టిందా?"

"యాక్సెడెంట్‌కు కారణమైనవాడు దొరికాడా?"

"దెబ్బలు బాగా తగిలినట్లున్నాయ్!"

—మొదలైన ప్రశ్నల వడగళ్లతో ఉక్కిరిబిక్కిరి చేశారు స్వరూపను.

ఓ గ్లాసు మంచినీళ్ళు త్రాగాక యాక్సిడెండ్ వివరాలను మెల్లగా చెప్పింది స్వరూప. ఒక్కతే కాలేజ్‌నుంచి రిక్షాలో వస్తూన్నదట. రిక్షా రైల్వే ఓవర్ బ్రిడ్జి దాటుతూండగా వెనకనుంకి ఓ స్కూటర్ వేగంగా వచ్చి కొట్టిందట. ఆమె ఎగిరి రోడ్డుమీద పడిందట. జనం గుమిగూడటం, ట్రాఫిక్ బంద్, జనం సానుభూతి

వాక్యాలు; నుదురు మీద కొంచెంగా దెబ్బతగిలితే, ఎవరో గుడ్డతో కట్టుగట్టారట ఆ స్కూటర్ ఆగకుండా వెళ్ళిపోయిందట.

"ఆ స్కూటర్‌ను నువ్వు గుర్తుపట్టగలవా అక్కా ?" అన్నాడు శ్రీకాంత్.

"నేను అసలు దాన్ని చూడలేదు. రోడ్డుమీద పడగానే, ఎవరో పుణ్యాత్ముడు లేవదీశాడు," అంది స్వరూప

"నా అనుమానం నిజమైంది," అన్నాడు శ్రీకాంత్ ఆగ్రహంతో మిళితమైన గంభీరస్వరంతో.

అందరూ అతనికేసి అదోరకంగా చూశారు.

"ఏమిట్రా నీ అనుమానం ?" అంది స్వరూప.

"ఇందాక అలాంటి యాక్సిడెంటే సుజాత, సుభాషితల వాళ్ల రిక్షాక్కూడా జరిగింది. వాళ్ల రిక్షానుకూడా ఒక స్కూటర్ వెనగ్గా వచ్చి కొట్టింది." అన్నాడు శ్రీకాంత్.

'నిజమా ?' అన్నట్టు స్వరూప స్నేహితురాండ్రకేసి చూసింది. వాళ్ళు నిజమే నన్నట్టు తలలు ఆడించారు.

"దీన్ని బట్టి నేను గ్రహించిందేమిటంటే- ఈ యాక్సిడెంట్లు సహజమైనవి కావు; ముందుగా ప్లాన్‌వేసుకొని, జరిపించినవి ఈ యాక్సిడెంట్ల వెనుక బల మైన అదృశ్య హస్తమేదో వుంది. ఎవరో దుర్మార్గుడు ఏదో దురుద్దేశంతో ఈ యాక్సిడెంట్లు చేయించాడని నా అనుమానం. ఏమంటారు ?" అన్నాడు శ్రీకాంత్ ముగ్గురు అక్కలకేసి పరిశీలనగా చూస్తూ.

వంటగదిలోంచి వంకాయ వేపుడు వాసన వేస్తోంది.

శ్రీకాంత్ మాటలు వాళ్ళ మనసుల్లో ఓ రకమైన భయోత్పాతాన్ని కలిగిం చాయి. అయితే ఆ భావాన్ని వాళ్ళెవరూ మొహాలపై ప్రస్ఫుటంగా ప్రకటించ లేదు. పైపెచ్చు నిర్లక్ష్యం ముసుగులో దాచిపెట్టారు.

"నీ దొట్టి ఆధారంలేని అనుమానం శ్రీకాంత్," అంది సుభాషిత.

"కొండను తవ్వి ఎలకను పట్టినట్టుంది నీ అనుమానం" అంది సుజాత.

"నువ్వు మరీ 'సినిక్'వు అయిపోతున్నావురా శ్రీకాంత్. మా మీద దుర్మార్గం చేయాల్సిన అవసరం ఎవరికుంటుందిరా ? మాకు విరోధు లెవరున్నారు ? మా సంగతి ఎవరికి పట్టింది ?" అంది స్వరూప

"అట్లా కాదక్కా ! అంత తేలిగ్గా తోసిపారెయ్యకు. మీకు ఎవరి సంగతి పట్టకపోయినా, మీ సంగతి పట్టినవాళ్ళు ఎంతోమంది లేకపోలేదు. ఆ విషయం

మీరు గమనించకపోవచ్చు. కాలేజీలో మీ డ్యూటీని మీరు సక్రమంగా నిర్వ హిస్తూ, ఒకే ఇంట్లో అన్యోన్యంగా కలిసి మెలిసి వున్నంతమాత్రాన, ఎవరి జోలీ మీకు పట్టకపోయినా— మీ గురించి ఎవ్వరూ ఆలోచించటం లేదనుకోవటం శుద్ధ పొరపాటు. మిమ్మల్ని అల్లరిచేయడం, ఆటపట్టించటం కొందరికి సరదా కావచ్చు; మిమ్మల్ని భయపెట్టి, బెదిరించటం పైశాచిక ఆనందం కావచ్చు; మిమ్మల్ని బాధపెట్టి, వర్రీపాలు చేయటం వింత సంతృప్తిని కలిగించవచ్చు. సమాజంలో అట్లా సరదాపడేవాళ్ళు ఉండకపోరు. అట్లాంటివారిని కనిపెట్టి, మసులుకోవడం మన కర్తవ్యం! ఆడవాళ్ల అమాయకత్వాన్ని బలహీనతగా తీసుకొని రెచ్చిపోయే మగవాళ్ళుంటారు. అట్లాంటి వాళ్ళను 'కుక్క-కాటుకు చెప్పుదెబ్బ' లా ప్రతిఘటించకపోతే, ఈ సమాజంలో స్వేచ్ఛగా బ్రతకడం కష్టం," అన్నాడు శ్రీకాంత్ ఉపన్యాస ధోరణిలో.

శ్రీకాంత్ వయస్సులో తమకంటే చిన్నవాడైనా లోకం తీరుతెన్నుల పరంగా చాల దూరంగా ఆలోచిస్తున్నాడని ఆ ముగ్గురూ అనుకున్నారు. బి కాం. మొదటి సంవత్సరం చదివే విద్యార్థి అయినా, సమాజ స్వభావ స్వరూపాల్ని బాగా జీర్ణించుకొని ముందుచూపుతో జాగ్రత్తలు చెబుతున్నాడని వాళ్లు గ్రహించినా, ఆ సంఘటనలు 'ప్లాన్' ప్రకారం జరిగినాయనే దాంట్లో వాళ్ళకు విశ్వాసం కుదరటం లేదు.

"ఏమోరా శ్రీకాంత్! నువ్వు అనవసరంగా లేనిపోనివి ఊహించుకొని కొత్త ప్రాబ్లమ్స్ తెచ్చిపెడుతున్నావు. మమ్మల్ని గోలచేయాలని ఎవరికైనా, ఎందుకుంటుంది?" అంది స్వరూప.

"మనమీద శ్రీకాంత్‌కు ప్రేమాభిమానాలు ఎక్కువై మనల్ని ఎవరో ఏదో చేస్తారని భయపడుతున్నాడు. ప్రాబ్లమ్ అంత సీరియస్ కాదని నా అభి ప్రాయం" అంది సుజాత.

"రోజూ ఈ గుంటూరు పట్టణంలో ఎన్నో రిక్షాలకు ఎన్నో రకాలుగా యాక్సిడెంట్లు జరుగుతూవుంటాయి. మన ఖర్మ చాలక ఆ యాక్సిడెంట్లు అన్ యూజువల్‌గా మనం ఎక్కిన రిక్షాలకే జరిగాయి. దాని కింత ప్రాముఖ్యం మన మెందుకివ్వాలి?" అంది సుభాషిత.

వాళ్ళ అభిప్రాయాలకు చిరాకేసి ఎడంచేత్తో నుదురు పట్టుకున్నాడు శ్రీకాంత్.

ఆ సమయంలోనే నాగరత్నమ్మ వంటగదిలోంచి వచ్చింది.

"అమ్మగారూ! పప్పుచారులో ములక్కాడలు వేయమంటారా? వొద్దా?" అంది స్వరూప నుద్దేశించి.

వంటమనిషి మీద శ్రీకాంత్‌కు తాటిప్రమాణాన కోపం వచ్చింది_ మధ్యలో అడ్డుగా వచ్చినందుకు.

"ములక్కాడలు కాదు, నాలుగు మాసం ముక్కలు తెచ్చి వేయి. మేమేదో సీరియస్‌గా ఆలోచిస్తూంటే, మధ్యలో నువ్వొకదానివి," అన్నాడు శ్రీకాంత్ చిరాగ్గా.

సొరకాయలాంటి మొహాన్ని దోసకాయంత చేసుకొని వంటింట్లోకి వెళ్ళింది నాగరత్తమ్మ.

"చీటికీ మాటికీ నీకంత చిరాకు దేనికిరా? దానిక్కోపం వొచ్చిందంటే పప్పుచారులో మూడు దోరెళ్ల ఉప్పు వేస్తుంది," అంది స్వరూప.

సుజాత, సుభాషితలు ఫక్కున నవ్వారు.

శ్రీకాంత్ మొహం కోపంతో సడెన్‌గా కొండరాయిలా మారింది.

"మీకంతా ఎగతాళిగా వుంది. సీరియస్‌గా ఆలోచించడం లేదు. ఆ స్కూటర్ వాడెవడో కనుక్కోకపోను. వాడి ఎముకల్లో సున్నం రాలగొడతాను. మళ్ళీ ఇలాంటి పోకిరిపనికి పూనుకోకుండా ఏకీలుకాకీలు సపరేట్ చేసి చేతికిస్తాను." అన్నాడు శ్రీకాంత్ అంతలోనే క్రోపావేశంతో వూగిపోతూ.

"మా గురించి నువ్వెందుకు ఆవేశపడతావురా! నీ గురించి నువ్వు చూసుకోరా. వయస్సు ఆవేశంతో కాలు దువ్వినా, కర్తవ్యాన్ని గుర్తించి అదుపులో పెట్టుకోవాలి. పోకిరివాళ్లు ఏదో చేశారని, చదువు పాడుచేసుకొని వాళ్ళమీద ప్రతీకార వాంఛను పెంచుకుంటావా? ముందు శ్రద్ధగా చదువుకో. ఆ పైన జీవితంలో పైకి రావడం ముఖ్యం. ఈ చిన్న చిన్న ఇన్సిడెంట్లతో మనస్సును పాడుచేసుకొంటే, వచ్చేదేముంది? వెళ్ళి స్నానం చేసి, భోంచేసి - పుస్తకాలు ముందేసుకు కూర్చో. మా గురించి జాగ్రత్త పడటం మాకు తెలుసు. నీ రక్షణేమీ మా కక్కర్లేదు," అంది స్వరూప తమ్ముడ్ని కాస్త మందలింపు స్వరంతో.

శ్రీకాంత్ రోషంతో తల విదిల్చుకుని, చివుక్కున అక్కడ్నుంచి లేచి వెళ్ళాడు.

స్వరూప, సుజాత, సుభాషితలు ఒకళ్లమొహాలొకళ్లు నిశ్శబ్దంగా చూసుకున్నారు.

## 2

ఆ రోజు రాత్రి ఎనిమిదిన్నరకు భోజనాలు చేశారు నలుగురూ. భోజనాలు చేస్తూన్నంతసేపు ఎవరూ ఏం మాట్లాడలేదు. ట్రాన్సిస్టరు రేడియోనుంచి వివిధ

భారతి సినిమాపాటలు వింటూ నిశ్శబ్దంగా భోజనాలు ముగించారు. నిజంగానే ఆ పూట పప్పుచారులో ఉప్పు ఎక్కువైంది. నాగరత్తమ్మ వేయాల్సే ఓ చేరెడు ఎక్కువ ఉప్పు వేసింది. అయినా దాన్ని గురించి ఎవ్వరూ పట్టించుకోలేదు.

భోజనం చేసింతర్వాత శ్రీకాంత్ నేరుగా తన స్టడీటేబుల్ దగ్గరకు వెళ్ళి 'వ్యాపార వ్యవస్థ: నిర్వహణ' పుస్తకం తీసి అందులో మొహం దూర్చాడు.

స్వరూప వీక్లీ పుచ్చుకొని మంచమెక్కింది.

సుభాషిత బోటనీ పాఠ్యగ్రంథం తీసుకొని రేపు చెప్పవల్సిన పాఠంగురించి చూడసాగింది.

సుజాత రేడియోలో పాటలు వింటూ పడకకుర్చీలో మేనువాల్చింది.

ఆ నలుగురూ నాలుగు తరహాల వ్యాపకంలో నిమగ్నులై వున్నప్పటికీ— వాళ్ళ మనస్సులు మటుకు రిక్షాల యాక్సిడెంట్లను గురించే ఆలోచిస్తున్నాయి. యాదృచ్ఛికంగా జరిగిన దుర్ఘటనలైతే అంతగా పుర్వాపరాల్ని గురించి ఆలోచించనక్కర్లేదు. రెండు రిక్షాలనూ ఒకేచోట పావుగంట తేడాగా ఒకే స్కూటర్ వెనగ్గా వచ్చి కొట్టడం. ముందుగా దురాలోచనతో ప్లాన్ వేసుకోనిదే ఆ దుష్కృత్యానికి పాల్పడటం అసంభవం. అయితే ఆ పని చేసిందెవరు? తమపై ఎవరికి ఆ దురుద్దేశముంది? శ్రీకాంత్ వూహ సరైందే కావచ్చు. తమకు తెలీకుండానే తమపై ఎవరైనా కన్ను వేసి వుండొచ్చు తమని అల్లరి పెట్టడానికి ప్లాన్ వేసి వుండొచ్చు. ఈ దుర్ఘటనలు నాందికి సూచనలేమో! తాము ముగ్గురు ఆడవాళ్ళు ఇల్లు అద్దెకు తీసుకొని వుంటూన్నట్టు, కాలేజీలో ఉద్యోగాలు చేస్తూన్నట్టు ఈ పేటలో చాలమందికి తెలుసు. అయితే ప్రత్యక్షంగా తమతో ఏ మగవాడికీ పరిచయం లేదు. తమ వెంట ఏ మగవాడూ పడినట్టు దాఖలా లేదు. ఏమిటో! రోజులు బావుండలేదు. మగదిక్కు లేకుండా ఆడది ఉద్యోగం చేయడం; అద్దె కొంపలో వుండటం; రిక్షాలో తిరగడం— ఏ క్షణంలోనైనా ప్రమాదమే! ఎన్నో కళ్ళు ఎన్నో ఉద్దేలిక్నా నింపుకొని చూస్తూవుంటాయి. కొంతలో కొంత నయం. మగదిక్కుగా శ్రీకాంత్ ఇంట్లో వున్నాడు... ఆ విధంగా ముగ్గురి మనస్సులూ ఆలోచించసాగాయి.

"స్వరూ! మీ తమ్ముడ్ని అట్లా కసురుకున్నావు గానీ, వాడి మాటల్లో నిజం లేకపోలేదు," అంది సుజాత.

"నాకూ అలానే అనిపిస్తుందే" అంది సుభాషిత బోటనీ పుస్తకం మూసివేసి

"మరి ఎవరి పని అయివుంటుంది?" అంది స్వరూప.

ఆఁ! దీంతో ట్రై చేయండి
ఎంత వరకు చదూతారో చూదాం!




"అదే అర్థంకావడంలేదు. మనపైన ప్రత్యేకంగా ఎవరికీ పగ ఉన్నట్టు లేదు" అంది సుజాత.

"పగ కావాలేమిటి? జెలసీ వున్నా చాలు," అంది సుజాత.

"ఎందుకైనా మంచిది. పోలీసు రిపోర్టు ఇద్దామేమిటి?" అంది స్వరూప.

"బావుందే నీ ఐడియా. దొంగలుపడ్డ ఆర్నెల్లకు కుక్కలు మొరిగినట్టు, ఇప్పుడా రిపోర్టు ఇవ్వడం. అయినా ఎవరిమీద ఇచ్చేట్టు? ఆ స్కూటర్ వాడే ఎవ్వడో తెలీదు. వాడ్నిగురించి ఎవ్వరూ చెప్పలేదు బ్లూకలర్ స్కూటరన్నారు, అంతే! ఆ స్కూటర్ నంబర్ని కూడా ఎవ్వరూ నోట్ చేసుకోలేదు," అంది సుభాషిత.

మళ్ళీ ఆలోచనలో పడ్డారు ముగ్గురు.

పుస్తకం తెరిచినా శ్రీకాంత్ మనస్సు ఏ మాత్రం దానిమీదకు మళ్ళలేదు. రిక్షాలను కొట్టిన స్కూటర్ అతని మస్తిష్కంలో పురుగులా తొలుస్తూనే ఉంది. ఆ స్కూటర్‌వాడి ఉద్దేశ మేమిటి? వాడు గుంటూరులో ఎక్కడ ఉంటాడు? బహుశ ఈ పేటలోనే ఎక్కడో వుండి వుంటాడు తమ అమాకీ, ఇల్లూ, ఇంట్లో మనుషులూ అంతా తెలిసే వుంటుంది...అట్లా ఆలోచిస్తూనే అక్కడ అక్కలు మాట్లాడుకోవడం విన్నాడు. వాళ్లు పైకి గంభీరంగా వున్నా, లోలోపల భయపడుతున్నట్టుగానే గ్రహించాడు. పుస్తకం మూసేసి మళ్ళీ అక్కల దగ్గర కొచ్చాడు.

"మీరేం భయపడకండి! పదిమంది మగవాళ్ళపెట్టు నేనున్నాను. ఎంత రౌడీనైనా చిత్తుగా వోడించి, నల్లచెరువు నీళ్ల తాగిస్తాను," అన్నాడు శ్రీకాంత్.

"నువ్వూరుకోరా! అసల్ నీది వుడుకు రక్తం. చిన్నప్పుడ్నుంచీ కొట్లాటకు కాలుదువ్వే తత్వం నీది. ఇతర్లను కొట్టడం, ఇతర్లచేత కొట్టించుకోవటం నీకు హాబీ. హింసామార్గంతో సమస్యలు పరిష్కారమవుతాయా?" అంది స్వరూప.

"టిట్ ఫర్ టాట్! ఇట్లాంటి సమస్యలకు హింసా మార్గమే మంచిది అక్కా! రౌడీలకు రౌడీలే బుద్ధి చెప్పాలి. రౌడీల దౌర్జన్యానికి మనం దడిచామంటే, వెంటబడి తరిమితరిమి కొడతారు. ఎదురుబడి 'రారా' అంటే వెనుకంజ వేస్తారు," అన్నాడు శ్రీకాంత్.

"అంటే శ్రీకాంత్ నువ్వు రౌడీగా మారతావా?" అంది సుభాషిత.

"రౌడీగా మారనక్కరలేదు అక్కా! రౌడీగా కనబడితే చాలు," అన్నాడు శ్రీకాంత్.

"రౌడీ లంటే నాకు చచ్చే భయం. వాళ్ల జోలికి పోవొద్దు శ్రీకాంత్" అంది సుభాషిత.

నవ్వింది స్వరూప.

"ఎప్పుడేనా నీ వెంట రౌడీలు వెంట పడ్డారంటే!" అంది స్వరూప

నావెంట పడలేదనుకో! మనం యూనివర్సిటీలో చదివే రోజుల్లో డాబా గార్డెన్స్‌లో తల్లిని పెట్టుకొని జూఆలజీ ఎం.ఎస్సీ చదివే రాధారాణి వుండేది, జ్ఞాపకం లేదూ! సన్నగా, పొడుగ్గా, చెరకుగడలాగా వుండేది. నుదురుమీద చిన్నబిడ్డనొప్పి మచ్చ," అంది సుజాత.

"ఆఁ! ఆఁ!... ఎలుకతోక లాంటి పొట్టిజడ. నర్సులా ఎప్పుడూ తెల్లటి చీర, జాకట్టు ధరించేది. స్టూడెంట్సంతా 'నర్సమ' 'నర్సమ' అంటూ ఎగతాళి చేసేవారు," అంది సుభాషిత.

"అవును. అయితే ఆమెవెంట రౌడీలు పడ్డారా?" అంది స్వరూప.

"పడటమేమిటి! చెరచటానికి ప్రయత్నంకూడా చేస్తేనూ! ఒకరోజు రాత్రి ఆమె జగదాంబ థియేటర్‌కు సినిమాకెళ్లి ఒక్కతే రిక్షాలో ఇంటి కొస్తూన్నదట. ఆమె ఎక్కిన రిక్షాను ఇద్దరు రౌడీలు సైకిళ్ళమీద వెంబడించారట. ఒక వీధి చివర చీకట్లో ఆ రిక్షాను ముట్టడించారట. కత్తి చూపేసరికి రిక్షావాడు పారిపోయాడట. రౌడీ లిద్దరూ రాధారాణిని బలవంతాన ఎత్తుకొని

దగ్గర్లోవున్న ఓ పాడుపడ్డ పెంకుటింట్లోకి తీసుకెళ్ళారట. రాధారాణి అరవ టానికి ప్రయత్నించిందట. నోట్లో గుడ్డలు కుక్కారట. ఇంటి తలుపులు గడియ వేశారంట. ఇంట్లో కిరసనాయిలు దీపం తప్ప మరో వెలుగు లేదట. లైఫ్‌లో ఆ రాత్రి 'ఫినిష్' అయిపోయినట్టు అనుకొందిట రాధారాణి."

"మరి చివరి కేమైంది?" అన్నాడు శ్రీకాంత్.

"ఆ రౌడీల్లో పోటీ వచ్చిందట - ఎవరు ముందుగా ఆమెను అనుభవించాలని. ఆ పోటీతో వాళ్ళు ఘర్షణపడి, ఆ ఘర్షణ కొట్లాటగా మారి, బలబలాలు తేల్చు కోవటానికి తలపడ్డారట. ఆ సమయం కనిపెట్టి రాధారాణి తెలివిగా తలుపు తెరుచుకొని, చీకట్లో ఒంట్లో సత్తువకొద్దీ పారిపోయి, మానాన్ని కాపాడు కుందట. ఆ ఇన్సిడెంట్ విన్న దగ్గరనుంచీ రౌడీ లంచే నాలో భయం పాతుకు పోయింది," అంది సుజాత.

"ఒంటరిగా వున్న ఆడవాళ్ళమీదకు ఒంటికాలుమీద వస్తారు రౌడీలు అక్కయ్యా! మీరు ఒంటరిగా లేరు కాబట్టి రౌడీల బెడద మీ కేమీవుండదు. వాళ్ళగురించి మీరేమీ భయపడక్కర్లేదు. నేను రేపు ఎంక్వయిరీ చేస్తా - ఆ స్కూటర్‌వాళ్ళ గురించి," అన్నాడు శ్రీకాంత్.

"ఎంక్వయిరీ చేసి ఏం చేస్తావురా? వాడిమీదకు వెళతావా?" అంది స్వరూప కొంచెం భయాన్ని కనబరుస్తూ.

అక్క భయాన్ని గ్రహించాడు శ్రీకాంత్.

"వాడిమీద కెళ్ళక్కర్లేదు. ఇన్‌ఫర్‌మేషన్ తెల్సుకుని వుంటే మంచిదిగా. మన జాగ్రత్తల్లో మనం వుండొచ్చు," అన్నాడు శ్రీకాంత్ సౌమ్యంగా.

"ది గ్రేట్ శ్రీకాంత్ వుండగా మనకు భయమెందుకే! నిశ్చింతగా ఉండొచ్చు," అంది సుభాషిత.

ఓ రకమైన గర్వంతో శ్రీకాంత్ వాళ్ళ గగుర్పొడించిందే. కాలర్ సర్దుకున్నాడు. శ్రీకాంత్ మంచి స్పోర్ట్స్‌మాన్. హైస్కూల్లో చేరిన దగ్గర్నుంచీ రోజూ సాయంత్రాలు ప్రొద్దు గూకేవరకూ వాలీబాల్, కబాడీ, హైజంప్ ఆడేవాడు. అథెలిటిక్‌మీట్‌లో ఏటా ఎన్నో ప్రైజులు గెల్చుకునే వాడు. కాలేజీకి వచ్చేక క్రికెట్‌లో కూడా ప్రావీణ్యాన్ని సంపాదించాడు. బ్యాట్‌మింటన్ బాగా ఆడతాడు. కాలేజీ తరపున వాలీబాల్ టీమ్‌కు కేప్టెన్‌గా వెళ్ళి ఇంటర్ కాలేజియేట్ టోర్నమెంట్స్‌లో ట్రోఫీ గెల్చుకొచ్చాడు. అంతే కాకుండా కాలేజీ స్పోర్ట్స్‌మీట్‌లో జనరల్ ఛాంపియన్‌గా ఎన్నికయ్యాడు.

స్పోర్ట్స్ అనువుగా ఉండేట్లుగానే శ్రీకాంత్ చిన్నప్పట్నుంచే శరీర నిర్మాణాన్ని తయారుచేసుకున్నాడు. రోజూ క్రమం తప్పకుండా వ్యాయామం చేసేవాడు. ప్రొద్దున్నే హైస్కూల్ గ్రౌండ్‌కు వెళ్ళి ఓ గంటసేపు వొళ్ళు చెమట పట్టేదాకా రౌండ్స్ వేసేవాడు. కాలేజీలో చేరింతరువాత కూడా ప్రతి దినమూ ఉదయం కాలేజీ గ్రౌండ్స్‌కు వెళ్ళేవాడు. సాయంత్రాలు ఏదో గేమ్‌లో పాల్గొనేవాడు

శ్రీకాంత్ వయస్సు ఇరవై సంవత్సరాలు. మొదట్నుంచీ సుకుమారంగా, నీడపట్టున పెరిగినవాడు కాకపోడంచేత, వ్యాయామంచేసే శరీరం కాబట్టి అసలు వయస్సుకు కాస్త మించినట్టు కనబడతాడు అంత పొడగరి కాదు. పొడుగుకు తగిన లావు. కండలుతేలిన శరీరం. ప్రథమ వీక్షణంలోనే 'స్పోర్ట్స్ మాన్' అనే భావం ఎవరికైనా కలుగుతుంది. కించిత్ సోగమొహం. ఆ మొహానికి చివర్లు మెలితిరిగిన సన్నటి మీసాల కింద తీర్చిదిద్దినట్లుండే పెదవులు ఎంతో గాంభీర్యాన్ని తెచ్చిపెడతాయి.

సిగిరెట్లు, కిళ్ళీ మొదలైన అలవాటులేని ఆ పెదవులు చూడముచ్చటగావుండి 'ముద్దుపెట్టుకుంటే ఏంత బావుండు ?' అనే భావాన్ని అమ్మాయిల మనస్సుల్లో గిలిగింతలు పెడతాయనడంలో అబ్బురంలేదు. పదునుగా పెన్సిల్ చెక్కిన ట్టుండే ముక్కు, ఎముక పుష్టిగల చెక్కిళ్ళు, గుండ్రటి మెడ, ఎత్తు భుజాలు, వెడల్పాటి చెవులు, విశాలమైన నుదురు, మెరక కళ్ళు, నల్లటి వొంకుల జుత్తు, చెంపలకిందకు దిగిన పట్టీలు, చామన ఛాయకు మించిన రంగు - మొత్తంమీద ఏ ఏంగిల్‌నుంచి చూసినా శ్రీకాంత్ పర్సనాలిటీ ఆకర్షణీయంగా, కరుగ్గా, రఫ్‌గా వుంటుంది.

స్వరూప, సుజాత, సుభాషితలు ఆంధ్రా యూనివర్సిటీలో చదువుకొనే రోజుల్లో హాస్టల్ మేట్స్. ముగ్గురిదీ మూడు వూళ్ళు అయినప్పటికీ, కాలేజీ చదువుల్ని మూడు చోట్ల పూర్తిచేసినా - యూనివర్సిటీలో ప్రవేశించింతర్వాత మంచి స్నేహితురాండ్రు అయినారు. హాస్టల్లో ఒకే రూమ్‌లో ఉండేందుకు వాళ్ళు దరఖాస్తులు పెట్టుకోలేదు. "అయినా మా అదృష్టాలకొద్దీ వార్డెన్ మమ్మల్ని ఒకే రూమ్‌లో వేసింది. జన్మకంతటికీ జ్ఞాపకంవుండే స్నేహాన్ని సంపాయించు కున్నాం" అనుకుంటారు వాళ్లు. రెండు మూడు నెలల తేడాగా వాళ్ల వయస్సులు కూడా ఒకటే. స్వరూప ఇంగ్లీషు లిటరేచర్ ఎం.ఏ; సుజాత కెమిస్ట్రీ ఎం.ఎస్సీ; సుభాషిత బోటనీ ఎం. ఎస్సీ. ఆ రెండేళ్ళు వాళ్ళు ఎంతో అన్యోన్యంగా,

ఆప్యాయంగా, స్నేహితిస్నేహంగా, ప్రాణానికి ప్రాణంగా ఒకే రూమ్‌లో హాస్టల్లో ఉన్నారు. ముగ్గురి మధ్య స్వల్పమైన కలహాలు, మనస్పర్థలుకూడా వచ్చేవి కావు. ముగ్గురిలో పరస్పరమైన సర్దుబాటు తత్వం అలవడింది. ఏ కష్ట మొచ్చినా, ఏ సంతోషం కలిగినా, ఏ సమస్య తలెత్తినా ముగ్గురూ ఆదుకొనేవారు; పాలు పంచుకొనేవారు; పరిష్కారం చేసుకొనేవారు. షికారు కెళ్లినా, షాపింగ్ కెళ్ళినా, సినిమా కెళ్లినా ముగ్గురూ కలిసే వెళ్ళేవారు. తీరిక వేళల్లో ముగ్గురూ కలిసి కబుర్లు చెప్పుకొనేవారు. చదువుకొనేటప్పుడు ముగ్గురూ పుస్తకాలకు అంకితమైపోయి చదువుకొనేవారు. సెలవులకు తమ ఊళ్ళకు వెళ్ళేటప్పుడు ఒకేసారి వెళ్ళేవాళ్లు. విజయవాడ వరకూ కలిసే వెళ్ళేవాళ్ళు. మళ్ళీ యూనివర్సిటీకి వచ్చేటప్పుడు విజవాడ స్టేషన్లో కలిసే వాళ్ళు.

ముగ్గురికీ ఫస్టుక్లాసులు వచ్చాయి. జీవిత దశలో ఆ అధ్యాయం వేరు ముగ్గురికీ లెక్చరర్ ఉద్యోగాలు వచ్చాయి. అంతేకాకుండా మూడు నాలుగు మాసాల తేడాతో ముగ్గురూ ఒకే కాలేజీకి లెక్చరర్లుగా వచ్చారు "ఇది నిజంగా మన జీవితాల్లో అత్యద్భుతమైన సంఘటనా విశేషం. అనూహ్యమైంది. మన స్నేహమాధుర్యాన్ని భగవంతుడు గుర్తించి, ఒకేచోట ఉద్యోగాలు చేసే సదవకాశాన్ని కల్పించాడు," అనుకున్నారు వాళ్ళు. ముగ్గురూ ఆ అరండేల్‌పేటలో ఒక ఇల్లు తీసుకున్నారు. మొదట్లో స్వంతంగా వంట చేసుకుందామనుకున్నారు. కాని ఉద్యోగాలకూ, వంటకూ కుదరదని నిర్ణయించుకొని, ఓ వంటమనిషిని పెట్టుకున్నారు.

రెండు మూడు నెలలు గడిచింతర్వాత ఒకసారి స్వరూప పండుగ సెలవులకు ఇంటికి వెళ్ళి, తనతో తమ్ముడ్ని వెంటబెట్టుకొచ్చింది స్నేహితురాండ్రు ఇద్దరితో నిర్మొహమాటంగా చెప్పింది. "వీడ్ని ఇంటర్‌లో చేర్పిస్తున్నాను. మా ఫాదర్ వీడి చదువు బాధ్యత నా కప్పగించాడు, మనకు తోడుగా ఇక్కడే వుండి చదువుకుంటాడు. మీ కేమైనా అభ్యంతరమా?"

"మా కేం అభ్యంతరం! మహారాజాగా వుంచుకుందాం. పైపెచ్చు మనకు మగదిక్కుగా ఉంటాడు," అన్నారు సుజాత, సుభాషితలు.

అప్పట్నుంచీ శ్రీకాంత్ ఆ ఇంట్లోనే వుండసాగాడు. ఇంటర్మీడియట్ పాసయ్యాడు. బి.కాం. ఫస్టు ఇయ్యర్లో చేరాడు. ఈ మూడేళ్ళలో సుజాతకూ, సుభాషితకూ బాగా దగ్గరయ్యాడు సోదరుడిగా. వాళ్లకు నిజ జీవితంలో

తమ్ముళ్ళు లేరు. శ్రీకాంత్‌ను అసలు తమ్ముడిలాగానే పరిగణించేవారు. ముగ్గురిన్నీ 'అక్కా' అని ఆప్యాయంగా అతను పిలవడంతో, కొత్తవాళ్ళకు 'ఎవరు నిజమైన అక్కయ్యో' తెలిసేది కాదు. ఎవ రేపని చెప్పినా చేసేవాడు. ఏ వస్తువు కొనుక్కురమ్మని చెప్పినా కొనుక్కొచ్చేవాడు. సినిమాలకు వాళ్ళతో తోడుగా వేళ్లేవాడు. తీరిక వేళల్లో కులాసాగా కబుర్లు చెప్పేవాడు.

శ్రీకాంత్‌కు స్పోర్ట్స్‌మీద మోజు ఎక్కువ. ఫ్రెండ్స్ ఎక్కువ. రోజూ కాలేజీ వొదలగానే సరిగ్గా ఇంటికి వచ్చేవాడుకాదు. కాలేజీ గ్రౌండ్స్‌లో ఆటలు ఆడుతూ ఏడు, ఎనిమిది గంటలకు ఇంటికి వచ్చేవాడు. ఆటలు ఆడి వొచ్చిన అలసటలో పుస్తకం తెరవగానే కళ్ళు నిద్రాభారంతో మూసుకు పోయేవి. చదువుమీద అశ్రద్ధ కనబరుస్తున్నాడనీ, ఫ్రెండ్స్‌తో కాలం వేస్టు చేస్తున్నాడనీ అతడ్ని స్వరూపతోపాటు, సుజాత, సుభాషితలు కూడా మంద లించేవారు అప్పుడు రోషంతో నాలుగురోజులపాటు కాలేజీ వొదలగానే బుద్ధి మంతునిలా ఇంటికొచ్చి, శ్రద్ధగా చదువుకొనేవాడు. ఆ నాలుగురోజులు పోయాక మళ్ళీ పరిస్థితి మామూలే. అంచేత అప్పుడప్పుడూ మాటలద్వారా చురకలు తగిలిస్తూ శ్రీకాంత్‌ను సరైన మార్గంలో పెడుతూవుంటారు.

ఆ రోజు రాత్రి పడుకోబోయేముందు అక్కయ్యలతో అన్నాడు శ్రీకాంత్.

"రోజూ నేను కాలేజీకి వెళ్లేముందు మీ కాలేజీదాకా మీతో వస్తాను. వచ్చేటప్పుడు మీ కాలేజీ మీదుగా వస్తాను. నేనొచ్చేదాకా అక్కడే వుండండి."

"మరి గేమ్స్ ఎప్పుడు ఆడతావు?" అంది సుభాషిత.

"నా గేమ్స్ కంటే మీ సేఫ్టీయే ముఖ్యం నాకు" అన్నాడు శ్రీకాంత్.

సుజాత, సుభాషిత, స్వరూపలు ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు.

## 3

ఆ మరునాడు పదిగంటలకు భోజనాలైనతర్వాత ముగ్గురూ కాలేజీకి బయలుదేరారు వాళ్ళకు గార్డ్‌గా సైకిలుమీద శ్రీకాంత్ బయలుదేరాడు. ఉమెన్స్ కాలేజీకి రెండు రిక్షాలు వెళ్ళేంతవరకూ ఎవరెవరు ఆ రిక్షాలను ప్రత్యేకంగా చూస్తున్నదీ గమనించసాగాడు శ్రీకాంత్. అయితే అతని కంటికి అనుమానించదగినవాళ్ళెవ్వరూ కనిపించలేదు.

ఆ రోజు క్రితం జరిగిన రిక్షాల యాక్సిడెంట్లను సుజాత, సుభాషిత, స్వరూపలు సులభంగానే మర్చిపోసాగారు. స్వరూప నుదురుకు కట్టును కూడా తొలగించింది.

అయితే శ్రీకాంత్ ఆ రిక్షాల యాక్సిడెంట్‌ను గురించి మర్చిపోలేకపోయాడు. అక్కలను కాలేజీవద్ద దించి నేరుగా తన కాలేజీకి వెళ్ళాడు. అప్పటికే మొదటిగంట అయింది. నేరుగా క్లాసులోకి వెళ్ళాడు. మొదటి పీరియడ్ అకౌంటెన్సీ. రెండోగంట మోగిన వెంటనే లెక్చరర్ వచ్చాడు. క్లాసంతా నిశ్శబ్దం అటెండెన్స్ తీసుకున్నాక బ్యాంకు రికన్సిలియేషన్ స్టేట్‌మెంట్‌ను గురించీ, దాన్ని తయారుచేసే విధానాన్ని గురించీ, దానివల్ల ప్రయోజనాలను గురించీ లెక్చరర్ విపులంగా చెప్పాడు రెండు ఉదాహరణలను బోర్డుమీద వేసి, వివరించాడు.

కాని క్లాసులో మూడో బెంచీ చివర కూర్చున్న శ్రీకాంత్ మనస్సు ఆ పాఠంమీద లేదు. మొహం ఎత్తి రెండుకళ్లూ అప్పగించి లెక్చరర్‌కేసి చూస్తున్నాడు గానీ ఆలోచనలు వేరే ప్రపంచంలో ఉన్నాయి. నిన్నటి సాయంత్రపు రిక్షా యాక్సిడెంట్లను గురించే ఆలోచిస్తున్నాడు. ఆ స్కూటర్ వాడెవడు! ఒకసారి రిక్షాకు కొడితే పొరపాటనుకోవచ్చు. రెండుసార్లు కొట్టడంలో ఉద్దేశ మేమిటి? వాడెవడో అక్కయ్యలకు బాగా తెలిసినవాడయి వుంటాడు. వాడొక్కడా? వాడి కింద రౌడీముఠా ఏమైనా ఉందా? వాడి ఉద్దేశమేమిటి? - అల్లరి పెట్టాలనా? అవమానం చేయాలనా? ఆ రెండిటి వల్ల వాడి కేమొస్తుంది? అదొరకమైన ప్లెజరా? కాలేజీ గరల్స్‌ను అల్లరి చేయడం వేరు, ఉద్యోగాలు చేసుకొనే ఆడవాళ్లను అల్లరిచేయడ మేమిటి?

ఛి ఛీ. దేశంలో రౌడీయిజం పెరిగిపోతోంది లా అండ్ ఆర్డర్ ఏమైనట్టు? బీట్ కానిస్టేబుల్‌ను అడిగితే ఏమన్నాడు? "మేం మేంచేస్తాం సార్! ఆ స్కూటర్‌వాడు దొరికితే కేస్ బుక్‌చేసేవాడ్ని. కనీసం ఆ స్కూటర్ నంబర్ను కూడా ఎవ్వరూ చెప్పలేకపోతుంటిరి. ఎవరిమీద కేస్ బుక్‌చేయను?"

అదీ నిజమే! తాను ఒక్క మూడు నిముషాలు ముందు వచ్చి వుంటే, యాక్సిడెంట్‌ను ప్రత్యక్షంగా చూసివుండేవాడు ముందుగా ఆ స్కూటర్‌వాడి మెడ పట్టుకునేవాడు. ఆ యాక్సిడెంట్ చేయడంలో వాడి దురుద్దేశ మేమిటో బయటపడేది. ఇంకా వాడివెనక బలగమేమైనా వుంటే, వాళ్ళ పేర్లు బయటికొచ్చేవి. అప్పుడు డైరెక్ట్ ఎటాక్ చేసే పని......

శ్రీకాంత్ పరధ్యానాన్ని గమనించిన లెక్చరర్ ఓ ప్రశ్న వేశాడు.

"నేను చెబుతున్నదంతా అర్థమవుతున్నదా, మిస్టర్ శ్రీకాంత్?"

శ్రీకాంత్ చివుక్కున లేచి, "యస్సార్" అన్నాడు.

"బ్యాంకు రీకన్సిలియేషన్ స్టేట్‌మెంట్‌ను ఎందుకు తయారుచేస్తారు ? చెప్పు" అన్నాడు లెక్చరర్.

తెల్లమొహం వేశాడు శ్రీకాంత్.

కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దం. చెప్పలేకపోతున్నాడనేది లెక్చరర్ సులభంగా గ్రహించాడు.

"శాస్త్రీ ఇక్కడ, మనస్సు ఎక్కడో !" అన్నాడు లెక్చరర్.

క్లాసులోని విద్యార్థులంతా ఫక్కున నవ్వారు.

శ్రీకాంత్ మొహం కిందికి దించుకున్నాడు. అంతేగానీ అవమానాన్ని పొందలేదు; రోషంతో, కోపంతో మొహాన్ని కేరట్ దుంపలా చేసుకోలేదు. కారణం - తప్పు తనది కావటమే ! విద్యార్థి విద్యుక్త ధర్మాన్ని నిర్లక్ష్యంచేసి ప్రవర్తించాడు.

విద్యార్థుల సావధానతను గురించి ఓ అయిదు నిముషాలపాటు లెక్చర్ ఇచ్చాడు ఆ లెక్చరర్. విద్యార్థులు క్లాసులో నిశ్శబ్దంగా కూర్చున్నా, ఎక్కువ మంది పాఠాలు శ్రద్ధగా వింటున్నట్లు నటిస్తారేగానీ, వాళ్ళ మనసులన్నీ విడుదలకాబోయే సినిమా మీదనో, ఫేవరేట్ స్టార్ మీదనో, క్రికెట్ ఆట మీదనో, పాలిటిక్స్ మీదనో, వీధిలో తాము చూసిన అందమయిన అమ్మాయిల మీదనో వుంటాయనీ; ఆ పరధ్యానం వల్లనే లెక్చరర్ల కృషి వృధా అవుతున్న దనీ, విద్యార్థులు పాఠ్యగ్రహణ శక్తిని కోల్పోతున్నారనీ; తత్ఫలితంగా సదుద్దేశంతో రూపొందించిన విద్యా విధానం సత్ప్రయోజనాలను సాధించడం లేదనీ ఉపన్యాసం ఇచ్చాడు. ఆయన అట్లా ఉపన్యాస మివ్వడానికి తానే కారణమని గ్రహించిన శ్రీకాంత్ నొచ్చుకున్నాడు.

మధ్యాహ్నం ఇంటర్‌వెల్‌లో మిత్రుల్ని కలుసుకున్నాడు శ్రీకాంత్. కాలేజీ మొత్తానికి బి.ఎస్సీ. మొదటి సంవత్సరం చదువుతూన్న శ్రీధర్, బి.కాం. ఫైనల్ ఇయర్‌లో వున్న భావనారాయణ అతనికి ఆప్తమిత్రులు. స్పోర్ట్స్ ఆడే ఫ్రెండ్స్ ఇంకా చాలామంది ఉన్నారుగానీ ఏ సలహా కావల్సి వచ్చినా వాళ్ళిద్దర్నే అడుగుతూ వుంటాడు శ్రీకాంత్. ఒకరకంగా శ్రీకాంత్ దూకుడు తత్వానికీ, ప్రగతిపూర్వక భావాలకూ, ఆవేశకావేషాలకూ సరిపడిన మిత్రులు వాళ్ళిద్దరూ.

క్యాంటీన్‌లో వాళ్ళిద్దరకూ కాఫీ ఇప్పించి క్రితంరోజు జరిగిన రిక్షా యాక్సిడెంట్లు సంగతి చెప్పాడు శ్రీకాంత్. వాళ్ళిద్దరూ ఆసక్తిగా విన్నారు. చివరకు, "మీ రేమంటారు ?" అన్నాడు శ్రీకాంత్.




"అదేదో రౌడీమూక పనే! మీ అక్కయ్యలమీద ఎవరో దుర్మార్గులు కన్ను వేశారు" అన్నాడు శ్రీధర్. ఇట్లాంటి యాక్సిడెంట్లను చేయడంలో శ్రీధర్‌కు అనుభవం లేకపోలేదు. ఒకసారి మరో మిత్రునితో పందెం వేసి, ఉమెన్స్ కాలేజీ విద్యార్థిని వెళుతున్న రిక్షాను వెనగ్గా వెళ్ళి తన సైకిల్‌తో కొట్టాడు. ఆ రిక్షా ఎలక్ట్రిక్ స్తంభానికి కొట్టుకుంది. ఆనవాలు చిక్కకుండా సైకిల్‌మీద వేగంగా వెళ్ళాడు. శ్రీకాంత్ చెప్పింతర్వాత స్వానుభవం గుర్తుకొచ్చింది శ్రీధర్‌కు

"నాకూ అల్లానే అనిపిస్తుందిరా! ఒకే స్కూటర్ మీ అక్కలు ఎక్కిన రెండు రిక్షాలను వెనగ్గా కొట్టిందంటే, అంతా ప్రీ ప్లానింగ్ ప్రకారం చేసిందే. సందేహం లేదు" అన్నాడు భావనారాయణ.

"మరి ఆ స్కూటర్‌వాడు ఎవడై వుంటాడు?" అన్నాడు శ్రీకాంత్.

"అదే తెల్సుకోవాలి," అన్నాడు శ్రీధర్.

"తెల్సుకుంటే వాడ్ని మట్టి తినిపించడ మేముంది?" అన్నాడు భావనారాయణ.

భావనారాయణ విప్లవ భావాలను జీర్ణించుకున్న విద్యార్థి. సాయుధ విప్లవం ద్వారానే సమాజంలో మార్పు రావాలనీ, ఆర్థిక అసమానతలు తొలగిపోవాలనీ దేశం బాగుపడాలనీ అంటూ వుంటాడు క్లాసు పుస్తకాలను అవతలకు నెట్టి ఎప్పుడూ విప్లవ సాహిత్యాన్నే చదువుతూ వుంటాడు. అందుచేతనే ఇంటర్మీడియట్ ప్యాసు కావడానికి అయిదేళ్లు పట్టింది. బి.కాం. రెండు

సంవత్సరాల్లోనూ ఏ సబ్జక్టూ ప్యాసు కాలేదు. 'స్టూడెంట్ నక్సలైట్' అని కొంతమంది అతన్ని అంటూ వుంటారు. పోలీసుల ఎంక్వయిరీ లిస్టులో కూడా వున్నాడని మరికొంతమంది ఉవాచ. అయితే అతనెప్పుడూ తను నక్సలైట్ నని చెప్పుకోలేదు. స్టూడెంట్స్ ఎలక్షన్లో మూడుసార్లు పాల్గొన్నాడు కానీ ఎప్పుడూ గెలవలేదు. 'నక్సలైట్' అనే దుష్ప్రచారానికి గురై మూడుసార్లు ఘోరంగా ఓడిపోయాడు అయితే అతని ఆకారాన్ని చూసినవాళ్ళెవ్వరూ అతను నక్సలైట్ అంటే విశ్వసించడానికి సాహసించరు. సన్నగా, గాలికి పడిపోయేట్టు వుంటాడు. వాదనలోకి దిగితే ఉగ్రభైరవమూర్తి అవతారాన్ని ఎత్తుతాడు గానీ, సాధారణంగా ఎప్పుడూ ప్రశాంతంగా, జీవితం పట్ల నిరాశను పెంచుకున్న నిరాశావాదిలాగా ఆలోచిస్తూ వుంటాడు.

"ఆ తెల్సుకోవడమే ఎట్లాగా అని ?" అన్నాడు శ్రీకాంత్.

"నేను ట్రై చేస్తాలే !" అన్నాడు శ్రీధర్.

శ్రీకాంత్‌లో ఉత్సాహం వచ్చింది. "ఎట్లా ?"

"రైల్వే ఓవర్ బ్రిడ్జి ప్రక్కన ఇరానీ హోటల్ వుంది, చూశావా ! ఆ హోటల్ పక్కనున్న కిళ్ళీకొట్టువాడు నా ఫ్రెండ్. వాడ్ని అడుగుతాను. వాడికి చాలమంది పోకిరీవాళ్ళతో, రౌడీలతో, దగుల్బాజీలతో మంచి దోస్తీ వుంది. మనకు నలుగుర్ని రౌడీలను పంపించమన్నా పంపిస్తాడు ఫలానా వాడ్ని చూపెట్టి, సాయంత్రానికి సఫా చేయాలంటే, అడ్రసూ ఆనవాళ్లూ లేకుండా చేసేస్తారు. అలాంటి గ్యాంగు లున్నాయి, యిక్కడ. అయితే డబ్బు ఖర్చవుతుంది," అన్నాడు శ్రీధర్.

"మనకి అంతదూరం అక్కర్లేదు. ఆ దుర్మార్గు డెవరో తెల్సుకుంటే, మళ్ళీ అలాంటిది జరక్కుండా వార్నింగ్ ఇవ్వొచ్చు." అన్నాడు శ్రీకాంత్.

"ఈ రోజుల్లో వార్నింగ్‌లకు వంకాయలు కూడా బెదరవు. దెబ్బ పడితేనే దెయ్యం వొదిలేది" అన్నాడు భావనారాయణ.

"వాడ్ని గురించి రేపీపాటికి నేను కనుక్కుంటానుగా ! నువ్వేం దిగులు పడకు. వాడి మనస్సులో దుర్బుద్ధి వుంటే, వాడంతటితో వూరుకోడు మీ ఇంటిచుట్టూ తిరుగుతూనే వుంటాడు, ఏదో వేషంలో" అన్నాడు శ్రీధర్

"నా కంటికి కనబడ్డారా కత్తితో కంఠ చొప్పున తీస్తాను. మా అక్కయ్యలను కాపాడటం నా కర్తవ్యంరా. ఆ కర్తవ్యాన్ని నిర్వహించడంలో ఏ కొండనైనా 'ఢీ' కొంటాను" అన్నాడు శ్రీకాంత్ ఆవేశపూరితంగా.

బెల్ కొట్టడంతో వాళ్ళు క్లాసులకు వెళ్ళిపోయారు.

## 4

సాయంత్రం కాలేజీ విడిచిపెట్టగానే, కొంతమంది ఫ్రెండ్స్ వాలీబాల్ ఆడదామన్నా వినిపించుకోకుండా నేరుగా ఉమెన్స్ కాలేజీకి వచ్చాడు శ్రీకాంత్. అప్పుడే అక్కలు ముగ్గురూ కాలేజీనుంచి బయటి కొచ్చారు. రిక్షాలను తానే మాట్లాడి, వాళ్ళు ఎక్కింతరువాత వాటి వెంటనే బయలుదేరాడు.

ఇంటి కొచ్చేవరకు శ్రీకాంత్ పరిసరాల్ని పరిశీలిస్తూనే వున్నాడు. అయితే ఆ రిక్షాల కేసి ప్రత్యేకంగా ఎవ్వరూ చూడలేదు.

ఇంటికి మధ్య హాలులో పడకకుర్చీలో కూర్చున్న ఓ ముసలాయన్ని చూసి సుభాషిత ఆశ్చర్యపోయింది.

"ఎప్పుడొచ్చావు నాన్నా ?" అంది సుభాషిత చెప్పులు స్టాండ్ దగ్గర విడుస్తూ.

"ఓ గంటయింది" అన్నాడు ఆదినారాయణయ్య కుర్చీలోంచి లేస్తూ.

సుభాషిత తండ్రిని సుజాత, స్వరూపలు పలకరించి యోగక్షేమాలు అడిగారు. సైకిలు వరండాలో పెట్టి లోపల కొచ్చాడు శ్రీకాంత్. ఆదినారాయణయ్యకు నమస్కారం పెట్టి, "కులాసా" అని పలుకరించాడు.

పదినిముషాల్లో అందరికీ కాఫీలు తెచ్చి యిచ్చింది నాగరత్నమ్మ.

"అయ్యగారికి ఏదైనా టిఫిన్‌చేసి పెట్టకపోయావా ?" అన్నాడు శ్రీకాంత్ వంటమనిషి నుద్దేశించి.

"ఇంటిదగ్గర తినే వచ్చాన్రా అబ్బాయీ !" అంటూ లాల్చీజేబులోంచి సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె బయటకు తీశాడు ఆదినారాయణయ్య.

సుజాత స్వరూపలు డ్రస్సులు మార్చుకునేందుకు గదిలోకి వెళ్ళారు.

సుభాషిత తండ్రి ఎదురుగానే కూర్చుంది. ఆదినారాయణ అప్పుడప్పుడూ ఏదో పనిమీద గుంటూరు వస్తూ వుంటాడు. వాళ్ళ వూరు అక్కడికి పన్నెండు మైళ్లదూరంలో వున్న కొలకలూరు. బస్సులో ఒక గంట ప్రయాణం. గుంటూరు వచ్చినప్పుడల్లా కూతుర్ని చూడకుండాపోడు. పైపెచ్చు భర్త గుంటూరు వెళుతుంటే. సుభాషిత తల్లి కూతురికి అరిశెలో, చక్కిలాలో, సున్నివుండలో, వూరగాయ పచ్చళ్లో పంపుతూ వుంటుంది.

"టవున్లో ఏదైనా పనివుండి వచ్చావా నాన్నా ?" అంది సుభాషిత.

"ప్రత్యేకంగా పనేమీ లేదే !" అంటూ సిగరెట్టు వెలిగించాడు

ఆదినారాయణయ్య. అగ్గిపుల్ల అవతల పారేస్తూ, "అసలు వచ్చింది నీకోసమే !" అన్నాడు.

సుభాషిత గుండెలో భయం గుప్పుమంది. తండ్రి ఏదో పెళ్ళి సంబంధం తెచ్చాడనుకుంది. నిజం కూడా అంతే ! తాను వచ్చిన పనిని వెంటనే బయట పెట్టాడు ఆదినారాయణయ్య.

అప్పటికే సుజాత, స్వరూపలు చీరలు మార్చుకొని అక్కడ కొచ్చి కూర్చున్నారు.

"సుభా ! మన వూళ్లో సుబ్బరామయ్య లేడూ. తూర్పు వీధిన రావిచెట్టు దగ్గర ఇల్లు. ఆ సుబ్బరామయ్య నిన్నొక మంచి సంబంధం పట్టుకొచ్చాడు. దాని సంగతి మాట్లాడాలని వచ్చాను." అన్నాడు ఆదినారాయణయ్య ఉపోద్ఘాతంగా.

సుభాషిత ఎదురుగా గోడమీదున్న ఎల్.ఐ.సి. కాలెండర్‌కేసి చూడ సాగింది.

కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దం.

"ఏం సంబంధమండీ !" అన్నాడు శ్రీకాంత్ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

"మన ఊరికి పదిమైళ్ళ దూరంలో వున్న పాలెం అబ్బాయిది. ఒక మాదిరి స్థితిపరులే. అతని భాగానికి రెండెకరాల కొంద్ర వస్తుంది. ఎకరం ఎల్లా లేదన్నా పద్దెనిమిదివేలు వస్తుంది. మొత్తంమీద అతనికి యాభై వేల రూపాయల స్థిరాస్తి వుందని చెప్పవచ్చు. వూళ్లో భాశీస్థలాలు కూడా వున్నాయట. నలుగురు పిల్లలుగల కుటుంబం. పెద్దవాడికి పెళ్ళయిందట. మచిలీపట్నంలో ఎల్.ఐ.సి.లో అసిస్టెంటుగా వుంటున్నాడట. రెండో అబ్బాయి ఇతను. మిగతావాళ్ళు ఆడపిల్లలు. ఇంకా పెళ్ళిళ్ళ వయస్సుకు రాలేదు" అన్నాడు ఆదినారాయణయ్య కూతుర్ని ఉద్దేశించి చెబుతూ.

"అబ్బాయి ఏం చదువుకున్నాడు ?" అంది స్వరూప.

"ఉద్యోగ మేదైనా చేస్తున్నాడా ?" అన్నాడు శ్రీకాంత్.

"పర్సనాలిటీ ఎట్లా వుంటుంది ?'' అంది సుజాత.

ముగ్గురూ మూడు ప్రశ్నలు అడిగేసరికి కొంచెం మొహం చిట్లించుకున్నాడు ఆదినారాయణయ్య. అమ్మాయితో ఏకాంతంగా మాట్లాడి, సంబంధాన్ని నచ్చజెప్పి, ఔననిపించుకుందామని వచ్చాడాయన. అటువంటిది సంబంధం మీద చర్చ బయలుదేరింది.

"అబ్బాయి ఎం.కాం. ప్యాసయ్యాడు," అంటూ మొదలెట్టాడు ఆదినారాయణయ్య

"క్లాసు వచ్చిందా ?" అన్నాడు శ్రీకాంత్ అడ్డుతగులుతూ.

"క్లాసొచ్చిందో పీసొచ్చిందో నాకు తెలీదు. బ్యాంకులో ఉద్యోగం చేస్తున్నాడట."

"ఏం ఉద్యోగం! గుమాస్తా! ఆఫీసరా ?" మళ్ళీ అడ్డుతగిలాడు శ్రీకాంత్.

"యు.డి.సి. కామోసు! ఆర్నెల్లలో ఆఫీసరుగా ప్రమోషనొస్తుందని వాళ్ల నాన్న అన్నాడట ఆర్నెల్లు కాకపోతే మరో ఆర్నెల్లు పడుతుందనుకో. ఈ రోజుల్లో బ్యాంకులో ఉద్యోగమంటే మాటలా! పెట్టిపుట్టాలి. అంతకంటే సుఖమైన ఉద్యోగం మరోటి లేదు. ఇప్పుడు కాకినాడలో చేస్తున్నాడు. పెళ్లయ్యాక గుంటూరు ట్రాన్స్‌ఫర్ చేయించుకోవచ్చు. అదేమంత కష్టంకాదు. వాళ్ల నాన్నకు ఎం. ఎల్. ఏ. బాగా తెల్సట. కుర్రవాడి పర్సనాలిటీకూడా బాగానే వుంటుందట. సుబ్బరామయ్య చెప్పిందే కాకుండా నేను కూడా ఇద్దరు ముగ్గుర్ని ఎంక్వయిరీ చేశాను. వాళ్ళుకూడా ఆ సంబంధాన్ని గురించి బాగా చెప్పారు. నువ్వు సరేనంటే వాళ్లకు మాట యిస్తాను" అన్నాడు ఆదినారాయణయ్య కూతుర్ని ఉద్దేశించి.

సుభాషిత 'ఊఁ!' అనలేదు, 'ఆఁ!' అనలేదు. కిటికీలోంచి బయటకు చూడ సాగింది.

"కట్నం కానుకలు ఏమైనా వున్నాయా ?" అన్నాడు శ్రీకాంత్.

"కట్నం కానుకలు లేనిదే ఈ రోజుల్లో ఆడపిల్లల పెళ్ళిళ్లు అవుతాయా ? ఆడపిల్లల్ని చదివిస్తే కట్నం తగ్గుతుందని, త్వరగా పెళ్ళిళ్ళు అవుతాయనీ కొంతమంది అంటారు. అదంతా అబద్ధం. ఆడపిల్లల్ని చదివించడానికీ పెట్టుబడి పెట్టాలి. వాళ్ళకు పెళ్ళిళ్లు చేయడానికీ పెట్టుబడి పెట్టాలి. ఈ రెండు పెట్టుబళ్ళమీద వచ్చే రాబడి శూన్యం. అయినా తల్లిదండ్రుల బాధ్యత తప్పించుకొనేది కాదుగా! కట్నం యాభై వేలు అడుగుతున్నారు. అంతకుముందు వాళ్ళకు డెబ్భైఅయిదువేలు ఇస్తామని ఓ సంబంధం వచ్చిందట పిల్ల నల్లగా వుందనీ, అట్టే చదువుకోలేదనీ వొదిలివేశాడట. మన అమ్మాయి బావుంటుందనీ, బాగా చదువుకుందనీ, ఉద్యోగం చేస్తూందని పాతికవేలు కన్సెషన్ యిచ్చారు" అన్నాడు ఆదినారాయణయ్య ఆడపిల్ల పెళ్ళిని గురించిన ఆవేదనను వ్యక్తపరుస్తూ.

"యాభై వేలే!" అన్నాడు శ్రీకాంత్ ఆశ్చర్యంతో కనుబొమల్ని వెడల్పు చేస్తూ.

ఆదినారాయణయ్య మొహం చిట్లించుకున్నాడు.

"కట్నం లేకుండా పెళ్ళిళ్లు చేసుకోనే ఆదర్శవంతమైన యువకులు ఇంకా బయలుదేరలేదు. ఉపన్యాసాలు యిచ్చేవారేగానీ, ఆచరణలోకి వచ్చేసరికి 'మా నాన్న ఒప్పుకోవటంలేదనో, మా అమ్మ ఆత్మహత్య చేసుకుంటానన్నదనో, ఏదో ఒక వంకతో తప్పించుకొనేవాళ్ళేగానీ, సదుద్దేశంతో నిలబడే వాళ్ళెంత మంది? ఇప్పటికి మూడునాలుగు సంబంధాలు చూశాం ఒకటి అమ్మాయికి చదువు ఎక్కువైందనీ, రెండు ఉద్యోగం చేస్తూంటే చేసుకోమనీ, మూడు కట్నం లక్ష రూపాయలు కావాలనీ, నాలుగోది మరో కారణంచేత కుదరలేదు. ఎంత ఉద్యోగం చేస్తూంటేమటుకు, అమ్మాయి పెళ్ళికానిదే తల్లితండ్రులకు మెడమీద గుదిబండ వున్నట్లే వుంటుంది. ఆ బాధ ఆడపిల్లల్ని కన్నవారికి గానీ తెలియదు."

"మీరు ఎన్నయినా చెప్పండి. కట్నాలు ఇవ్వడం; తీసుకోవడం అనే పద్ధతి నాకు నచ్చదు. ఇది వస్తుమార్పిడి పద్ధతి కాదు. ఈ దురాచారానికి నేను పూర్తి వ్యతిరేకిని. ఈ పెళ్ళికి నువ్వు ఒప్పుకోవద్దు అక్కా!" అన్నాడు శ్రీకాంత్ నిశ్శబ్దంగా ఆలోచిస్తున్న సుభాషితను ఉద్దేశించి

ఆదినారాయణయ్య మొహం కోపోద్రేకాలతో ఎరుపెక్కింది. 'నువ్వెవడివోయ్' అన్నట్టు అతనికేసి తీవ్రంగా చూశాడు.

"నీ బోడి సలహా ఏమిట్రా! నువ్వేమైనా కట్నం ఇస్తున్నావా? నీకెందుకు మధ్యలో? అర్థంగాని విషయాల్లో నోరు జారొద్దని నీకెన్నిసార్లు చెప్పాను. బుద్ధి లేదూ!" కోప్పడింది స్వరూప తమ్ముడ్ని.

ఆదినారాయణయ్య కోపం కొద్దిగా జారిపోయింది.

అయినా శ్రీకాంత్ నోరుమూసుకు కూర్చోలేదు.

"మీరు పెద్ద పెద్ద చదువులు చదువుకున్నారు. చక్కగా ఉద్యోగాలు చేస్తున్నారు అయినా మీలో పాతసాంప్రదాయాలపట్ల, ఆచారాలపట్ల మోజు తగ్గ లేదు. ఇండిపెండెంటుగా బ్రతుకుతున్నా, వేలకువేలు డబ్బులు ధారబోసి డిపెండెంట్లు అవుదామనుకుంటున్నారు. నాకెంతో వింతగా వుంది. కట్నం ఇవ్వనంటే ఈ దేశంలో ఆడపిల్లకు పెళ్ళికాదా? కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకొనే యువకులు ఆంధ్రదేశంలో లేరా?"




"ఉండొచ్చు. కాని వాళ్ళు ఎక్కడున్నారో, వాళ్ళ కులమేమిటో, ఆర్థిక పరిస్థితులేమిటో విచారించవద్దూ. గాలికి తిరిగేవాడొచ్చి 'నేను కట్నంలేకుండా పెళ్ళిచేసుకుంటాను' అంటే వాడికి పిల్లనిస్తామా ?" అన్నాడు ఆదినారాయణయ్య ఆగ్రహావేశంతో.

శ్రీకాంత్ మళ్ళీ ఏదో అనబోయాడు.

"నువ్వూరుకోరా!" అని గట్టిగా మందలించింది స్వరూప.

అక్కణ్నుంచి లేచి గబగబా బయటికెళ్ళాడు శ్రీకాంత్.

ఓ నిముషం పాటు వాన కురిసి వెలిసిన నిశ్శబ్దం ఆవహించింది.

ఇంకో సిగరెట్టు వెలిగించి, "ఏమంటావమ్మా!" అన్నాడు ఆదినారాయణయ్య కూతుర్ని ఉద్దేశించి.

సుభాషిత మొహం ఇంకా సీరియస్‌గానే వుంది. ఆమెకేసి స్నేహితురాం డ్రిద్దరూ చూశారు. వాళ్ళందర్లోకి సుభాషిత కొన్ని మాసాల వయస్సు చిన్నది. అందంగా ఉంటుంది. గుండ్రటి మొహం. ఎత్తుకు సరిపడిన లావు. పండిన పైన్‌యాపుల్ రంగు. మగవాడిని ఇట్టే ఆకర్షించే శక్తిగల కళ్లు. కొనదేలిన ముక్కు. పొడుగాటి జడ. నున్నటి నొక్కులులేని వెంట్రుకలు. సగటును మించిన సౌందర్యం. అయితే స్వభావరీత్యా చాల మెతక మనిషి మాటలద్వారా గానీ, చేష్టలద్వారాగానీ ఎదుటివాళ్లను నొప్పించదు. తనని గురించిగానీ, ఇతర్లను గురించిగానీ, అత్యవసర సందర్భాలలోగానీ నిర్ణయాలు త్వరగా తీసుకొనే అలవాటులేదు. జీవితాన్నిగురించి పెద్దగా ఆలోచించదు. ప్రతి విషయాన్నీ తేలిగ్గా అమాయకంగా తీసుకుంటుంది. అందుచేతనే పెళ్ళివంటి ముఖ్యవిషయంపట్లకూడా త్వరగా ఓ నిర్ణయానికి రాలేకపోతూంది.

కూతుర్నుంచి వెంటనే సమాధానం రాకపోయేసరికి మళ్ళీ అడిగాడు ఆదినారాయణయ్య. అప్పటికీ సుభాషిత ఓ నిర్ణయానికి రానట్టు ఇబ్బందికరంగా మొహం పెట్టింది.

"మీరైనా చెప్పండమ్మా! మంచి సంబంధం. ఇది పోతే మళ్ళీ ఇంకో సంబంధం రావడం కష్టం. ఇంకా ఇద్దరు ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేయాలి" అన్నాడు ఆదినారాయణయ్య బ్రతిమాలే స్వరంతో.

"అది వ్యక్తిగత సమస్య. ఆమెకు ఆమే తేల్చుకోవాలి బాబాయిగారూ! పెళ్లి చేసుకోవొద్దని మే మెప్పుడూ చెప్పం." అంది సుజాత.

"ఆలోచించుకొని చెప్పవే సుభా! ఇట్లాంటి సమయమూ సందర్భమూ అందరికీ వస్తాయి. ఒకళ్ళ సలహా సంప్రదింపులకంటె ఎవరి ఆత్మప్రబోధం ప్రకారం వాళ్లు ఓ నిర్ణయానికి రావడం మంచిది. జీవితానికి వివాహం చుక్కాని లాంటిది," అంది స్వరూప.

"రేపు శనివారం రాత్రి మనవూరు వస్తాన్లే నాన్నా! అప్పుడు చూద్దాం,"

"చూద్దాం గీద్దాం అందే కాదు. అప్పటికైనా నువ్వు ఒక డెసిషన్‌కు రావాలి. ఇట్లా నాన్చుతూపోతే ఏళ్లు జరిగిపోతాయి. ఆ తర్వాత పెళ్లిచేసుకొనే వాడు దొరకటం మరీ కష్టమైపోతుంది. ఆడపిల్లకు పెళ్లి చేయలేకపోయాడనే అప్రదిష్ట నాపై పడుతుంది, ఏ అంటూ లేచాడు ఆదినారాయణయ్య

"భోంచేసి వెళుదురుగాని ఉండండి" అంది స్వరూప.

"అప్పుడే భోజనమేమిటమ్మా ! బస్సెక్కితే అరగంటలో మా వూరు చేరతాను" అంటూ వెళ్ళాడు ఆదినారాయణయ్య.

ఆయన వెళ్లిన అరగంటకుగానీ శ్రీకాంత్ ఇంటికి రాలేదు. వెంటనే భోజనం చేసి, పుస్తకం ముందువేసుక్కూర్చున్నాడు. సుభాషిత పెళ్ళి ప్రస్తావన ఆ రాత్రి మళ్ళీ రాలేదు. తొమ్మిదిన్నరగంటలకు స్నేహితురాండ్రు ముగ్గురూ పడుకున్నారు.

రాత్రి పదిన్నర ప్రాంతంలో బయట ఎవరో తలుపు తడితే స్వరూప ఉలిక్కిపడి లేచింది. భయంతో వెంటనే సుజాతను, సుభాషితనూ లేపింది. తలుపును ఎవరో సన్నగా కొడుతూనే ఉన్నారు. వాళ్ల ముగ్గురికీ అవ్యక్తమైన భయంవేసింది. అయితే పక్కగదిలో లైటు వెలుగుతుండటాన్నిబట్టి శ్రీకాంత్ మేల్కొనే వున్నాడనుకున్నారు. కాస్త ధైర్యం వచ్చింది.

శ్రీకాంత్ గబగబా బయటికొచ్చి తలుపుతీశాడు. ఎదురుగ్గా అతని ఫ్రెండ్ భావనారాయణ. ఆవేళలో అతను రావటం శ్రీకాంత్‌కూ ఆశ్చర్యాన్ని కలిగించింది

"ఏమిట్రా?" అన్నాడు శ్రీకాంత్.

"ఏంలేదు. పై క్రాస్ రోడ్‌లో ఓ ఫ్రెండ్ వుంటే అతని దగ్గర్నుంచి వస్తున్నాను. ఈ పుస్తకాలు ఇచ్చిపోదామని వచ్చాను. డిస్టర్బ్ చేశానా?" అంటూ భావనారాయణ క్రాఫ్ట్‌పేపరువేసిన రెండు పుస్తకాలను అందించాడు. ఆ రెండు పుస్తకాలు విప్లవ సాహిత్యానికి సంబంధించినవి.

లోపల కిటికీలోంచి చూసి ఆ వచ్చిన వ్యక్తి శ్రీకాంత్ మిత్రుడని గ్రహించారు స్వరూప, సుజాత, సుభాషితలు.

బయటనే శ్రీకాంత్, భావనారాయణలు కొంచెంసేపు మాట్లాడుకున్నారు. శ్రీకాంత్ ఎప్పుడు ఇంట్లోకొచ్చి పడుకుంది వాళ్ళకు తెలియదు. నిద్రపోయారు.

## 5

ఉదయం పదిగంటలు కావడంతోనే సుజాత, సుభాషిత, స్వరూపలు ముగ్గురూ రోడ్డుమీదకు వస్తారు రిక్షాకోసం. వాళ్ళ వెనుకే సైకిలుతో శ్రీకాంత్ వస్తాడు. వాళ్లకి రిక్షాలు మాట్లాడి, వాళ్ళవెంటే తానూ వెళతాడు. రోజూ ఆవేళప్పుడు జరిగే కార్యక్రమం అది. ఆ కార్యక్రమంలో అజ్ఞాతంగా మరో వ్యక్తి పాల్గొంటాడు. అతనిపేరు పూర్ణచంద్. వాళ్ళ ఇంటికి ఎదురుగ్గా ఉన్న డాబాలో వుంటాడు. ఆ డాబా అతని సొంత ఇల్లే.

ఆ రోజు పదిగంటలకు స్వరూప, సుభాషిత, సుజాతలు మామూలుగానే రోడ్డుమీద కొచ్చారు చేతుల్లో పుస్తకాలతో. వాళ్ళవెనుకనే సైకిల్‌తో శ్రీకాంత్

కూడా వచ్చాడు. సైకిలు క్యారియర్ మీద పుస్తకాలు పెట్టుకుని. సరిగ్గా అదే టైంలో ఎదురింటి పూర్ణచంద్ స్కూటర్ మీద షాపుకు బయలుదేరాడు. రోడ్డుకు ఇవతల వీళ్లు; అవతల పూర్ణచంద్. అతను నేరుగా షాపుకు వెళ్ళిపోవచ్చు. కాని అట్లా వెళ్ళడు ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్టు, ఎవరో వచ్చి స్కూటర్ ఎక్కుతారన్నట్లు–వాళ్ళ రిక్షాలు కదిలేవరకు రోడ్డుకు అవతలగానే వుంటాడు. రోజూ దాదాపు అదే టైంలో ఆ స్కూటర్ను, ఆ స్కూటర్ పైనున్న వ్యక్తినీ అతని తాత్సారాన్నీ చూస్తున్నా ఆ ముగ్గురు స్త్రీలుగానీ, శ్రీకాంత్‌గానీ ఎప్పుడూ పట్టించుకోలేదు; పరిశీలనగా చూడలేదు.

ఆరోజు స్వరూప సీ బ్లూకలర్ ప్లెయిన్ వూల్లీచీర, దానికి మేచింగ్ జాకెట్టు ధరించింది. మెడలో లాకెట్‌గల ఒంటిపేట గొలుసు. ఒకచేతికి గురడా రిస్ట్‌వాచ్. మరోచేతికి రెండు బంగారు గాజులు. చీర రంగుతో మేచ్ అయ్యే రింగ్స్, కాళ్లకు చెప్పులు. హ్యాండ్‌బ్యాగ్ కూడా బ్లూకలర్‌దే వాళ్ళల్లో కొంచెం వయసున్నట్టు కనబడేది స్వరూపే. సహజమైన, సాధారణమైన సౌందర్యం ఆమెది. ఆ సౌందర్యానికి పౌడర్, స్నో, సింపుల్‌గావుండే అలంకరణలతో మరికొంత మెరుగు తీసుకురావటానికి ఆమె ప్రయత్నిస్తూ వుంటుంది. చామన ఛాయ. కళ్లు, ముక్కు, పెదవులు తీర్చిదిద్దినట్లుగా వుంటాయి. కళ్ళకు ఆర్టిస్టిక్‌గా కాటుక దిద్దటంతో ఆమె మొహంలో వింత ఆకర్షణ కొట్టవచ్చి నట్టుగా కనబడుతుంది. సుభాషిత పింక్‌కలర్ నైలెక్స్‌మీద లైట్ నిటింగ్ ఎంబ్రాయిడరీ చీర ధరించింది. మెడలో ఒంటిపేట గొలుసు. కృత్రిమ అలంకరణలద్వారా ఆకర్షణయుతమైన సౌందర్యానికి ఆమె ప్రాధాన్యత ఇవ్వదు. సుజాత పేరట్‌కలర్‌తో, ఆరంజి బోర్డరుగల వెంకటగిరి నేతచీర ధరించి, టు బై టు ఆరంజి కలర్ జాకెట్ వేసుకుంది. ముగ్గురిలోకి ఆమె పొడగరి. సన్నగా, నాజూగ్గా ఉంటుంది. యూనివర్శిటిలో చదివే రోజుల్లో విద్యార్థులు ఆమెకు 'సర్వీచెట్టు' అనే పేరు పెట్టారు. కాని ఇప్పుడు కొంచెం లావుకావడంతో ఆపేరు ఆమెకు అంతగా వర్తించదని చెప్పవచ్చు. విశాల నయనాలు. అవే ముందుగా అందర్నీ ఆకర్షిస్తాయి. రెండోది, జఘనాల కిందికి వచ్చే పెద్దజడ. తెలియనివాళ్లు రెండు సవరాలు వేసుకుంది అనుకుంటారుగానీ, ఆమె వెంట్రుకలు సహజంగా అంత పొడగాటివి, మెత్తనివి, అసూయ కలిగించేవి. శరీరఛాయ కొంచెం తెలుపుకిందే లెక్క. ముక్కూ మొహమూ, నడకా, పర్సనాలిటీ సగటుకు మించినవి. ఒకచేతికి వాచీ, మరోచేతికి మట్టి

గాజులు, సింపుల్‌గా వుండటమే సౌందర్య రహస్యమని భావన ఆమెకుంది. స్నో, పౌడర్ అంటే ఆమె కిష్టముండదు. మొహం ఎప్పుడూ ఆయిలీగా వుంటుంది.

రోడ్డుకు ఇవతల ఎండలో నిలబడ్డ ఆ ముగ్గురికేసీ ఏదో పోగొట్టుకున్నట్టు, పోగొట్టుకున్నది వాళ్ళ మొహాల్లో లభించినట్లూ ఆశగా, ఆవేశంగా, ఆదుర్దాగా చూడసాగాడు పూర్ణచంద్ రోడ్డు అవతల స్కూటర్ మీద కూర్చుని. స్కూటర్ను స్టార్టు చేశాడు. కాని ఎవరికోసమో వెయిట్ చేస్తూన్నట్టు నటిస్తున్నాడు. ఆ ముగ్గురు స్త్రీలలో ఎవరు అందమైనవారు? ఎవరిలో లావణ్యం పాలు హెచ్చుగా వుంది? ఎవరిలో మగవాడ్ని ఆకర్షించే లక్షణాలు జాస్తిగా వున్నాయి? ఎవరు తనకు బాగా నచ్చారు? మొదలైన ప్రశ్నలు అతని బుర్రలో వేగంగా తిరుగుతూ, సమాధానాలకోసం సతమతమవుతున్నాడు.

ఒక రిక్షా వచ్చింది. బేరం కుదరలేదు

మరో రిక్షా వచ్చింది. దానికీ బేరం కుదరలేదు.

అయిదు నిముషాలు గడిచాయి.

రోడ్డుకు అవతల పూర్ణచంద్ స్కూటర్ మీద కూర్చుని వాళ్ళకేసి తదేక దీక్షగా చూస్తూనే ఉన్నాడు.

రిక్షాకోసం అంతసేపూ వెయిట్ చేయడం చిరాగ్గా వుంది సుజాతకు.

ఎండ కోడెవయసులో వుంది

"శ్రీకాంత్ బేరాలు చేయక, వెంటనే రిక్షా మాట్లాడు. రోడ్డుమీద నిలబడడం న్యూసెన్స్‌గా వుంది" అంది సుజాత.

అప్పుడు చూశాడు శ్రీకాంత్-స్కూటర్ మీదవున్న పూర్ణచంద్‌ను. అతనింకా అక్కయ్యలకేసే చూస్తున్నాడు-తాపీగా సిగరెట్టు వెలిగించి.

అతని చూపుల తీవ్రతనుంచి తప్పించుకోడానికి సుజాత తహతహలాడి పోతోంది.

ఇంకో రిక్షా వచ్చింది. పావలా ఎక్కువైనా గబుక్కున అందులో ఎక్కేశారు సుజాత, స్వరూపలు. మరో రిక్షాలో సుభాషిత ఎక్కడానికి మరో అయిదు నిముషాలు పట్టింది. ఈ లోపల పూర్ణచంద్‌ను గమనించసాగాడు శ్రీకాంత్.

రెండు రిక్షాలు బయల్దేరిం తర్వాత పూర్ణచంద్ స్కూటర్ మీద షాపుకు బయలుదేరాడు. యాభై మీటర్ల దూరంలో అతను ఆ రిక్షాలను దాటాడు. దాటుతూ వెనక్కి తిరిగి చూస్తూనే పోయాడు.

వీడు మామూలు మనిషి కాదు. వీడి ప్రవర్తన అనుమానాస్పదంగా వుంది. వీడ్ని ఓ కంట కనిపెట్టివుండాలి! అనుకున్నాడు శ్రీకాంత్ సుభాషిత రిక్షా వెనుకగా వెళుతూ

ఆరోజు సాయంకాలం కాలేజీనుంచి ఇంటికి వచ్చాక, డ్రస్ మార్చుకొని మొహం కడుక్కొని అట్లా వీధిలోకి వెళ్ళాడు శ్రీకాంత్. ఆ వీధిలో నాలుగు రోడ్ల కూడలిలో వేపచెట్టుంది ఆ వేపచెట్టుకింద కిళ్లీబడ్డీ వుంది. ఆ కిళ్లీబడ్డీ మస్తాన్ అతనికి మిత్రుడు. ఇంటర్ మొదటి సంవత్సరం చదివి, కుటుంబ పరిస్థితులవల్ల చదువు మానేసి అన్న కిళ్ళీబడ్డీని నడుపుతున్నాడు మస్తాన్. ఏమీ తోచనప్పుడు అప్పుడప్పుడూ ఆ కిళ్ళీబడ్డీ దగ్గరున్న బెంచీమీద కూర్చుని మస్తాన్‌తో బాతాఖానీ వేయడం శ్రీకాంత్‌కు అలవాటు. ఆ సాయంత్రంకూడా అలాగే వెళ్ళాడు శ్రీకాంత్.

కిళ్ళీబడ్డీ గ్గర దరద్దీ ఏమీలేదు. మస్తాన్ ఖాళీగా కూర్చుని తమలపాకుల మొదళ్లు తుంచుతున్నాడు. శ్రీకాంత్‌ను చూడగానే ఆప్యాయంగా ఆహ్వానించి, "కూర్చో భాయీ" అన్నాడు.

శ్రీకాంత్ అరటిపండ్లగెల ప్రక్కనే బెంచీమీద కూర్చున్నాడు.

"సోడా ఇచ్చేదా బ్రదర్" అన్నాడు మస్తాన్.

"వొద్దు. ఏం తోచక వచ్చాను" అన్నాడు శ్రీకాంత్.

అయినా మస్తాన్ వూరుకోలేదు. మంచి గ్యాస్‌గల చల్లని సోడాను కొట్టి యిచ్చాడు. డబ్బులు పుచ్చుకోలేదు.

సరిగ్గా అదేసమయంలోనే పూర్ణచంద్ స్కూటర్ మీద ఇంటికెళ్ళాడు. అతన్ని చూపెడుతూ, "ఎవరు భాయ్?" అన్నాడు శ్రీకాంత్.

"బడా ఆద్మీ! మీ ఇంటి ఎదురుగ్గానే వుంటాడు – పూర్ణచంద్. ఓల్డు బస్‌స్టాండ్ దగ్గర పెద్ద ఆటోమొబైల్‌షాపు వుంది. నాలుగు లారీలున్నాయి. ఒకచేత్తో సంపాయిస్తాడు, మరోచేత్తో ఖర్చుపెడతాడు. టవున్లో పలుకుబడి జాస్తిగావుంది. లోకల్ ఎం. ఎల్. ఏ.కు రైట్‌హ్యాండ్. నెలకోసారి హైద్రాబాద్ పోతుంటాడు-చిన్నచిన్న సిఫార్సుల్ని భుజానవేసుకుని పైకి ఎంతో పెద్ద మనిషి. కాని ఒట్టి దుర్మార్గుడు.

"ఏం!"

"చేతిలో పాతిక ముప్పైమంది రౌడీలు వుంటారు. ఏ పని చెయ్యమంటే ఆ పని చేస్తారు. ఫలానావాడ్ని కొట్టమంటే సైకిల్ ఛెయిన్‌తో బాది వస్తారు. పోలీసు




ఆఫీసర్లకు మేపుతూ వుంటారు. వాళ్ళ అండ వుంది. ఏ కేసు లేకుండా చేస్తుం టారు. పూర్ణచంద్‌తో నీకేంపని భాయీ?"

"అబ్బే! నాకేంపని! వూరికెనే అడుగుతున్నా."

"దుష్టులకు దూరంగా వుండడం మంచిది భాయీ. వాడితో ఏం పెట్టుకోకు. వాడికి అన్ని దుర్గుణాలూ వున్నాయి. తాగుతాడు. రౌడీలకు రౌడీ. జూదగాడు. మోసగాడు. వ్యభిచారి ఆడాళ్ళను గోలచేయటం, బలవంతంచేయటం, చెరచడం అంటే మహా సరదా. వాడి కంటబడిన ఆడది తప్పించుకోవడం ఇంపాజిబుల్ భాయీ. ఏదో రకంగా వలలో వేయటానికే ట్రై చేస్తాడు. వలలో పడకపోతే అపకారం చేయటానికి ప్రయత్నిస్తాడు. ఇన్ని దుర్మార్గాలు వాడిలో వున్నా సమాజంలో పెద్దమనిషిగా చెలామణి అవుతున్నాడు. మళ్ళీ ఎక్కడా డైరెక్టుగా చిక్కడు. అదే వాడిలోవున్న చాకచక్యం. ఎవడెళ్ళి అడిగినా చందా లిస్తాడు. లేదని అనడు. వాడిది మరీ కాంప్లికేటెడ్ క్యారెక్టరు భాయీ! మీ ఇంట్లో ముగ్గురు ఆడంగులుంటున్నట్టున్నారు. ఎవ్వరికీ పెళ్ళిళ్ళు కాలేదుగా. జాగ్రత్త. వాడికంటబడకుండా చూడు" అన్నాడు మస్తాన్.

అయినా శ్రీకాంత్ రవ్వంత భయపడలేదు.

"ఏడ్చాడు వీడు మమ్మల్నేం చేస్తాడు? మా జోలికి వస్తే మక్కెలిరగ తన్ని మట్టిలో పాతిపెట్టనూ! మా అక్కయ్యలు నిప్పురవ్వలు."

"ఎంత నిప్పురవ్వలైనా నీటిచుక్కకు లోకువేగదా!"

"నీటిచుక్కను తాకనిస్తానా? నా సంగతి తెలీదూ మస్తాన్. మా అక్కయ్యల్ని ఈగవాలితే ఆ ఈగను చెప్పుకింద నలిపి, నాశనంచేసేదాకా నిద్రపోను. కాని మొన్న ఏం జరిగిందంటే మస్తాన్..."

"ఏం జరిగింది భాయీ!" అన్నాడు మస్తాన్ కుతూహలంగా.

రిక్షా యాక్సిడెంట్లనుగురించి చెప్పాడు శ్రీకాంత్. "ఆ స్కూటర్ వెధవ ఆచూకీయే చిక్కలేదు. వాడికోసం గాలిస్తున్నాను."

మస్తాన్ ఓ నిముషంసేపు ఆలోచించాడు.

"ఏదో జరిగింది. వాటినిగురించి మర్చిపో భాయీ!"

"ఏం?"

"నా అనుమానం ఆ స్కూటర్‌వాడు పూర్ణచంద్ గ్యాంగ్‌లో వాడే! యాక్సిడెంటును యాక్సిడెంట్ అనుకొంటే పోలేదూ! దాన్ని గురించి బుర్ర పాడుచేసుకోవడం దేనికి? మనంతటకు మనంవెళ్ళి ముళ్ళకంపలో ఇరుక్కోవడం దేనికి?" అన్నాడు మస్తాన్ ముందు ఆలోచనతో సలహాయిస్తున్న ధోరణిలో.

"ముళ్ళ కంపలకూ, చిల్లకంపలకూ దడిచేవాడ్నికాదు నేను. ముళ్ళను తొలగించటం నాకు తెలుసు" అన్నాడు శ్రీకాంత్.

అతని గుండెధైర్యానికి మనోనిబ్బరానికి ఆశ్చర్యంవేసింది మస్తాన్‌కు. శ్రీకాంత్ ఆవేశపరుడు. తనకు అన్యాయమని తోచినదాన్ని ప్రతిఘటించ డానికి వెనుకంజవేయడు. ఎవ్వరు చెప్పినా వినడు. ముక్కుకు సూటిగాపోయి, ముక్కు బద్దలుకొట్టుకునే రకం అనుకున్నాడు మస్తాన్. అయినప్పటికీ మిత్రుని ధర్మంగా అన్నాడు.

"కొన్ని విషయాల్లో మూర్ఖత్వం పనికిరాదు భాయీ! కాలాన్నిబట్టీ, మనుషుల్నిబట్టీ పోతూండాలి. మీ సిస్టర్స్ మేలుకొరకైనా, దుష్టులకు దూరంగా వుండటం మంచిది. ఒక్కొక్కప్పుడు మనం ఎవర్ని ఎక్కువ అభిమానంగా చూసుకుంటామో, మనకు తెలియకుండానే వాళ్ళకు అపకారం తలపెడతాం. అట్లాంటి పరిస్థితి రాకుండా చూసుకో భాయి. పూర్ణచంద్ గురించి నాకు తెలిసిం దంతా చెప్పాను. పైగా వాళ్ళ నాన్న పెరాలిసిస్‌వచ్చి మంచంలో పడి వున్నాడు. తండ్రి మాటన్నా వాడికి లక్ష్యంలేదు. కాబట్టి వాడితో ఏదైనా ముందు ముందు వస్తే నా మాటల్ని గుర్తుంచుకో, మూర్ఖంగా తలపడకు."

అతి నిర్లక్ష్యంగా తల ఆడించాడు శ్రీకాంత్.

ఎవరో బీడీలకోసం వస్తే, బీడీలకట్ట యిచ్చి, చిల్లర ఇవ్వడంలో నిమగ్నుడైనాడు మస్తాన్.

సూర్యాస్తమయం కావడంతో మునిమాపు మెల్లగా అలుముకుంది. అయితే ఇంకా వీధి దీపాలు డ్యూటీలో ప్రవేశించలేదు.

"వస్తాను బ్రదర్" అంటూ అక్కణ్ణుంచి లేచి ఇంటికి వెళ్ళాడు శ్రీకాంత్.

## 6

మొదటి పిరియడ్ అయింది. రెండో పిరియడ్ ఖాళీ ఆ సమయంలో ఇంగ్లీషు కాంపోజిషన్ పుస్తకాలు ముందువేసుకొని కూర్చుంది స్వరూప మళ్ళీ మూడో పిరియడ్‌గానీ క్లాసు లేదు. ఆ క్లాసులో ప్రోజ్ వుంది. ప్రిపేర్ కావల్సిన పనిలేదు. ఆ విశ్రాంతి సమయంలో పదిపుస్తకాలైనా దిద్దుదామను కుంది. స్టాఫ్‌రూమ్‌లో ఎక్కువమంది లెక్చరర్లు లేరు. ఇద్దరు ట్యూటర్లు కాంపోజిషన్ పుస్తకాలతో కుస్తీలు పడుతున్నారు. ఇద్దరు లెక్చరర్లు తమకు ఈ లోకంతో నిమిత్తంలేనట్లుగా చెస్ ఆడుకుంటున్నారు.

"ప్రిన్సిపల్‌గారు రమ్మంటున్నారు" అన్నాడు ఓ ప్యూన్ వచ్చి స్వరూపతో.

స్వరూప చివుక్కున తలెత్తి, "ఎందుకు ?" అంది.

"నాకేం తెలుస్తుందండీ" అన్నాడు ఆ ముసలి ప్యూను.

రెడ్ బాల్‌పాయింట్ పెన్‌ను మూసి, వెంటనే ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్ళింది స్వరూప-తనని ప్రిన్సిపాల్ ఎందుకు పిలిచిందో వూహించలేకుండా.

ప్రిన్సిపాల్ ఏవో ఆఫీసు కాగితాలు చూస్తూన్నది. కొన్ని క్షణాలపాటు ఆవిడ ఎదుట నిలబడి, గమనించే స్థితిలో ఆవిడ లేకపోయేసరికి కూర్చుంది స్వరూప పక్క రూమ్‌లోంచి టైపుమోత వినిపిస్తోంది.

ఓ నిముషం తర్వాత స్వరూపను చూసింది ప్రిన్సిపాల్. అయినప్పటికీ మాట్లాడలేదు.

"పిల్చారట" అంది స్వరూప ముక్తసరిగా.

ప్రిన్సిపాల్ తల ఆడించింది. ఆ రోజు వచ్చిన ఉత్తరాలలో ఒక ఉత్తరాన్ని తీసి, నిశ్శబ్దంగా స్వరూపకు ఇచ్చింది. దాన్ని చదువుకున్న స్వరూప మొహం అంతలోనే రంగులు మారిపోయింది.

"గవర్నమెంటు సర్వీసు అంటే అంతే మిస్ స్వరూపా! ఏ క్షణంలో ఏం జరుగుతుందో చెప్పలేం. ఒక్కోసారి క్లాస్‌రూమ్‌లో పాఠం చెబుతూండగానే, అర్ధాంతరంగా వొదిలిపెట్టవల్సి వుంటుంది. అన్నిటికీ ప్రిపేరయ్యే ఈ సర్వీసులో చేరాలి" అంది ప్రిన్సిపాల్.

స్వరూప ఏం మాట్లాడలేకపోయింది. ఆమె మొహంలో హఠాత్తుగా మారిన రంగుల్నిబట్టి, ఎంతగా హతాశురాలైందో గమనించింది ప్రిన్సిపాల్.

స్వరూపకు కర్నూలు ఉమెన్స్ కాలేజీకి ట్రాన్స్ఫర్ వొచ్చింది. అంత త్వరగా ట్రాన్స్ఫర్ వస్తుందని ఆమె ఎప్పుడూ అనుకోలేదు.

"ఇవాళో రేపో మీకు ట్రాన్స్ఫర్ ఆర్డర్లు వస్తాయి" అంది ప్రిన్సిపాల్.

స్వరూప మెల్లగా తల ఆడించి అక్కణ్నుంచి లేచి వచ్చింది

ఆమెలో దుఃఖం పడదోసుకురాసాగింది. దాదాపు మూడేళ్ళపాటు ఆ కాలేజీకి అలవాటుపడి అంకితమైపోయింది స్వరూప. దాన్ని వొదిలి వెళ్ళాలంటే మహా బాధగావుంది. ఆమె మనసులో ముఖ్యంగా రెండు సమస్యలు మెదిలాయి. ఒకటి-అత్యంత సన్నిహితులైన స్నేహితురాండ్రను వొదిలిపోవడం; రెండోది శ్రీకాంత్-ఎక్కడుంటాడు అనేది

దిగులుగా ముద్రితమైన మొహంతో స్టాఫ్‌రూమ్‌కెళ్లింది స్వరూప. మనసు కాంపోజిషన్ పుస్తకాలమీదకు పోలేదు. రెండు నిముషాలపాటు ఆలోచిస్తూ కూర్చుంది. ఆలోచించినకొద్దీ అవ్యక్తమైన దుఃఖం మనసులో మెరమెరలాడ సాగింది. వెంటనే లేచి కెమిస్ట్రీ లేబరేటరీకి వెళ్ళింది. అక్కడ ప్రాక్టికల్స్ చేస్తున్న విద్యార్థినులకు ఏదో చెబుతూన్న సుజాతదగ్గర కెళ్ళింది. స్వరూప మొహంలోని బరువైన మేఘాల్ని గమనించిన సుజాత, "ఏమిటే అలా వున్నావు? ఒంట్లో బావుండలేదా?" అంది ఆదుర్దాగా.

తనకు ట్రాన్స్ఫర్ వచ్చిన సంగతి చెప్పింది స్వరూప.

"మై గాడ్ ! అప్పుడే ఎట్లా వచ్చిందే ట్రాన్స్ఫర్ ?" అంది సుజాత ఆశ్చర్యంతో కనుబొమలు ఎగురవేస్తూ

"మన చేతుల్లో ఏముంది ?" అంది స్వరూప.

"హైద్రాబాద్ వెళ్ళి డి పి ఐ. ఆఫీసులో ట్రై చేస్తే !"

"దేనికి ?"

"ట్రాన్స్ఫర్ ఆపడానికి."

"ట్రై చేయడానికి ఎవరున్నారు ! అది అయ్యే పని కాదు ట్రాన్స్ఫర్ చేయడం వాళ్ళ ధర్మం. ఎక్కడికి ట్రాన్ఫర్ చేస్తే అక్కడికి వెళ్ళడం మన ధర్మం" అంది సుజాత నిమ్మకు నీరెత్తినంత నిబ్బరంగా.

తర్వాత వాళ్ళిద్దరూ బోటనీ లేబరేటరీకి వెళ్ళారు. ఆ దుర్వార్తను స్వరూపే సుభాషిత చెవిలో వేసింది. సుభాషిత ఆశ్చర్యంతో స్తబ్ధురాలైంది. తేరుకోవ డానికి ఆమెకు ఒక నిముషం పట్టింది.

"ఏంచేయడమే ?" అంది సుభాషిత అమాయకంగా.

"అదే అర్థంకావడంలేదు" అంది సుజాత అయోమయంగా.

"చేసేదేముంది? తట్టా బుట్టా సర్దుకొని వారంరోజుల లోపల కర్నూలు కాలేజీలో జాయిన్ కావడమే కర్తవ్యం" అంది స్వరూప

"ట్రాన్స్‌ఫర్ ఆపడానికి ప్రయత్నం చేస్తే !" అంది సుభాషిత సలహాగా.

"ఎవరిద్వారా ?" అంది సుజాత.

సుభాషిత మాట్లాడలేకపోయింది. వాళ్ళకుగానీ, వాళ్ళ తల్లిదండ్రులకు గానీ, బంధువులకుగానీ మంత్రివర్గంలో, ఆఫీసర్లలో తెల్సినవాళ్లు ఎవ్వరూ లేరు. సిఫార్సు చేయించి ట్రాన్స్‌ఫర్ ఆపుచేయించే స్థితి ఎవరికీలేదు.

ఆ రోజు సాయంకాలం శ్రీకాంత్‌కు తెలిసింది అక్కయ్యకు వచ్చిన ట్రాన్స్‌ఫర్‌ను గురించి. ఏమీ వ్యాఖ్యానించలేదు అతను. పైపెచ్చు అక్కయ్య ఆవేదనకు అర్థంలేదన్నాడు.

"గవర్నమెంట్ ఉద్యోగం అన్న తర్వాత ట్రాన్స్‌ఫర్లు రాకుండా ఉంటాయా ? అవతల ఎవరో గుంటూరుకోసం ట్రై చేసుంటారు. ట్రాన్స్‌ఫర్ చేసుంటారు" అన్నాడు శ్రీకాంత్.

"నీ ఫ్రెండ్స్‌కు తెలిసినవాళ్ళెవ్వరూ లేరా – ట్రాన్స్‌ఫర్ ఆపించడానికి" అంది సుభాషిత.

"అది మంచిపద్ధతి కాదక్కయ్యా ! అలాంటి మార్గాలను నేను ప్రోత్సహించను. జీవితాంతం ఒకేచోట వుద్యోగం చేస్తే బోర్ కొడుతుంది. పదివూళ్లు తిరిగి, పదిచోట్ల వుద్యోగం చేస్తేగానీ జీవితంలో అనుభవాలు రావు" అన్నాడు శ్రీకాంత్.

"నాకు ఎక్కడికి వెళ్ళటానికైనా బాధలేదురా ! నీ గురించే వర్రీ !" అంది స్వరూప తమ్ముడ్ని ఉద్దేశించి.

"నా గురించా ? నీకు వర్రీ దేని కక్కయ్యా ! నే నేమైనా పాలుతాగే పిల్లాణ్ణా ! ఎక్కడైనా నిక్షేపంగా ఉండగలను. చదవుకోగలను" అన్నాడు శ్రీకాంత్ నిర్వికారంగా.

"ఎక్కడో ఉండడం దేనికి ? ఇక్కడే ఉంటే వుగాని" అంది సుజాత.

"శ్రీకాంత్ గురించి నువ్వేమీ దిగులు పెట్టుకోకు స్వరూ. ఈ ఇంట్లోనే, మా దగ్గరే వుంటాడు" అంది సుభాషిత

"మీకు బర్డన్ దేనికిలేవే ! ఎక్కడైనా రూమ్ తీసుకొని వుంటాడులే. నెల నెలా డబ్బు పంపిస్తాను" అంది స్వరూప.

"అదేమిటే కొత్తగా మాట్లాడుతున్నావు నీకు తమ్ముడు అయినవాడు మాకు మాత్రం కాడా? వాడ్ని గురించి నువ్వేమీ వర్రీ పెట్టుకోకు. మా అదుపు ఆజ్ఞల్లో వుంచుతాం. చక్కగా చదివిస్తాం. ఏం?" అంది సుజాత.

"వాడే మాకు మగదిక్కు. కాస్త అండగా వుంటాడు. బజారు కెళ్ళి సరుకులూ అవీ తెచ్చిపెడుతూంటాడు. వాడ్ని చదివించే బాధ్యత మాది. నువ్వేమీ దిగులుపడకు స్వరూ. ఇంతకాలమూ ఒక ఇంట్లో మనుషుల్లాగా కల్సిమెల్సి బ్రతికాం ఇప్పుడు నీకు ట్రాన్స్‌ఫర్ వస్తేమటుకు శ్రీకాంత్‌ను ఇక్కడ వుంచడానికేం?" అంది సుభాషిత.

"అది కాదే!..." అంటూ ఏదో సందేహాన్ని వెలిబుచ్చబోయింది స్వరూప.

"నువ్వేమీ అడ్డు చెప్పకే! శ్రీకాంత్‌ను జాగ్రత్తగా చూసుకుంటాం."

"నువ్వు ఇక్కడున్నట్లే వాడ్ని ట్రీట్ చేస్తాం." అన్నారు వాళ్ళిద్దరూ.

స్వరూప ఎదురు చెప్పలేకపోయింది. పైపెచ్చు స్నేహితురాండ్ర స్నేహపూరితమైన అప్యాయతకూ, ఆదరణకూ ఆమె మనస్సు కరిగిపోయింది. నేత్రాంచలాలు ఆర్ద్రమైనాయి. కొంతంత బరువు దిగిపోయినట్లయింది అంత అభిమానంతో, స్నేహవాత్సల్యంతో, మమతానుబంధంతో తమ్ముడ్ని వుంచుకుంటారని ఆమె అనుకోలేదు. బయట రూమ్ తీసుకొనివుంటే అల్లరచిల్లర స్నేహాలకు మరిగి, చదువుమీద శ్రద్ధపోయి, జులాయి వెధవలాగా తయారయ్యే ప్రమాదం కూడా లేకపోలేదు. అలాంటి ప్రమాదం రాకుండా వుండాలంటే వాడు ఆ ఇంట్లోనే వుంటే మంచిది. వాడు ఏంచేసినా ఉత్తరాలద్వారా తెలుస్తుంది. ఉడుకురక్తంతో ఏ ఆకతాయి కృత్యం చేసినా మందలించే చనువూ, హక్కు, అధికారమూ సుభాషిత, సుజాతల కున్నాయి అనుకుంది స్వరూప.

వాళ్లు మాట్లాడుకొనేటప్పుడు శ్రీకాంత్ అక్కడే ఉన్నాడు. కాని వాళ్ళ సంభాషణలో జోక్యం చేసుకోలేదు వాళ్లతో ఆ యింట్లో వుంటాననీ అనలేదు; విడిగా రూమ్‌తీసుకొని చదువుకుంటాననీ అనలేదు.

చివరకు స్వరూప అంది:

"వాడు ఈ ఇంట్లో వుండటం మీకు ఒక రకంగా సమస్యేనే! ఎందుకంటే వాడికి ఆవేశం ఆరుపాళ్లు, ఆలోచన మూడుపాళ్లు ప్రతిదానికీ మోటుగా 'ఢీ'కొనే తత్వం. స్పోర్ట్స్‌లో వుండే టెంపర్‌మెంట్ లౌకిక ప్రపంచంలో పనికిరాదు. లోకంలో ఎక్కడ, ఎవరికి అన్యాయం జరుగుతున్నా తనకే

జరిగినట్టు 'ఫీల్' అవుతాడు. దానితో లేనిపోని ఇబ్బందుల్ని కొనితెచ్చుకుంటూ వుంటాడు. అదే వాడ్ని గురించి నా భయం. ఏది ఏమైనా నాకు ట్రాన్స్‌ఫర్ రొచ్చింది. మంచికో, చెడుకో ! వాడ్ని ఇంట్లోనే పెట్టుకుంటామంటున్నారు గాబట్టి, వాడ్ని గురించిన వర్రీ కూడా నాకు లేదు – మీకు అనవసరంగా శ్రమ యిస్తున్నాననే బాధ తప్ప."

"మాకు ఇచ్చే శ్రమేముందే స్వరూ ! పోన్లే ఎడ్జస్ట్‌మెంట్ ! మేం ఇక్కడ పర్మనెంటుగా వుంటామా, ఏమిటి ? ఎప్పుడైనా మాకు ట్రాన్స్‌ఫర్లు రావొచ్చు. మరో ఏడు గడిస్తే శ్రీకాంత్ చదువూ అయిపోతుంది" అంది సుజాత.

"అంతే మరి" అంది సుభాషిత.

"నెలా నెలా నేను మీకు డబ్బు పంపిస్తాను గానీ, వాడు అడిగినంతా ఇవ్వకండి. రేషను ప్రకారం ఇవ్వండి" అంది స్వరూప.

'అల్లాగే' అన్నట్లు వాళ్ళు తలలు ఆడించారు.

కర్నూలు వెళ్లటానికి రైలు ఎక్కేవరకూ స్వరూప తమ్ముడికి నయానా, భయానా హితబోధ చేస్తూనే ఉంది. రోజూ కాలేజీకి వెళ్లమంది; శ్రద్ధగా చదువుకోమంది; ఇతర విషయాలలో జోక్యం పెట్టుకోవద్దంది; విప్లవ సాహిత్యం చదవొద్దంది; కాలేజీ పుస్తకాలు తప్ప మరే పుస్తకాలు చదవకూడదని ఆంక్ష పెట్టింది; ఆటలకోసం ఎక్కువకాలాన్ని వినియోగించవద్దంది; కాలేజీ వొదలగానే నేరుగా ఇంటికి రమ్మంది; అక్కయ్యల మాటలు వినమంది; వాళ్లకు ఎట్టి పరిస్థితులలోనూ ఎదురు చెప్పకూడదంది; అందరిలోనూ సఖ్యతగా, సౌమ్యంగా, సామరస్యంగా ఉండమంది; ఎక్కువగా సినిమాలు చూడవద్దన్నది; అక్కయ్యలకు రోజూ కాలేజీ వరకూ, కాలేజీనుంచి వచ్చేటప్పుడూ తోడుగా వుండమన్నది; ఆగ్రహం, ఆవేశం, మాట జారడం మొదలైనవి అదుపులో వుంచుకోమన్నది; డబ్బు ఎక్కువగా ఖర్చుచేయవద్దన్నది; వారానికో ఉత్తరం వ్రాయమంది; అతని ప్రవర్తనను గురించి ఉత్తరాల ద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకుంటానన్నది.

స్వరూపను ట్రైన్ ఎక్కించడానికి సుజాత, సుభాషిత, శ్రీకాంత్ స్టేషన్‌కు వచ్చారు.

తమ్ముడ్ని గురించిన జాగ్రత్తలు సేహితురాంద్రకు కూడా చెప్పింది స్వరూప.

"వాడేదైనా తప్పుచేస్తే, శ్రద్ధగా చదువుకోకపోతే నిర్మొహమాటంగా

మందలించండి. మీ మాట వినకపోతే నాకు ఉత్తరం వ్రాయండి, లేదా టెలిగ్రాం ఇవ్వండి. మీరేమీ వెరవకండి."

సుజాత, సుభాషితలు 'అట్లాగే' అన్నట్టు తలలు ఆడించారు.

ట్రైన్ బయలుదేరాక, కనుచూపుమేర వరకూ ప్లాట్‌ఫారం మీద స్వరూపకు తమ్ముడూ, స్నేహితురాండ్రూ చేతులు గాలిలో వూపుతూనే వున్నారు.

## 7

తెల్లవారితే ఆదివారమనగా ఆ రోజు శ్రీధర్‌తో కలిసి హిందీ సినిమాకు వెళ్ళాడు శ్రీకాంత్. అతను రెండో ఆట సినిమాకు వెళ్లటానికి సుజాత, సుభాషితలు ఒక పట్టాన ఒప్పుకోలేదు. వాళ్లను వొప్పించటానికి అతనికి పదినిముషాలు పట్టింది.

"పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. సినిమాలు, షికార్లేమిటి ?" అంది సుజాత.

"సినిమా కెళ్ళి రెండువారాలైంది అక్కా !" అన్నాడు శ్రీకాంత్ బతిమిలాడుతూ.

"రెండువారాలైతే మాత్రం వెళ్ళాలని వుందా ? మేం చదువుకునే రోజుల్లో నెల కొక్క సినిమాయే చూసేవాళ్లం. అదైనా పరీక్ష లొస్తున్నాయంటే మూడు నెల్లు ముందుగా మానేసేవాళ్లం" అంది సుభాషిత.

"ఆ రోజులు వేరు అక్కా ! ఈ రోజుల్లో స్టూడెంట్స్ పరీక్ష రేపనగా కూడా సినిమా చూస్తారు - రిలేక్స్ కావటానికి. పంపించు అక్కా ! అవతల ఫ్రెండ్ వచ్చి కూర్చున్నాడు. పోకపోతే పరువుపోతుంది" అన్నాడు శ్రీకాంత్ దీనంగా అర్థిస్తూ.

సుజాత, సుభాషితలు మొహమొహాలు చూసుకొని మెత్తపడ్డారు.

"శనివారం రాత్రి సినిమా. ఆదివారం నిద్ర. చదువుకొనేదెప్పుడోయ్ !" అంది సుజాత కాస్త కఠుగ్గా.

రేపు పగలు నిద్రపోనక్కా. ప్లే గ్రౌండ్‌కు కూడా పోను. తప్పకుండా చదువుకుంటాను" అన్నాడు శ్రీకాంత్ నమ్మకాన్ని కలిగించే గంభీరతతో.

"నమ్మమంటావా ?" అంది సుభాషిత.

"రేపు చూడక్కా !" అన్నాడు శ్రీకాంత్ ఉషారుగా.

ఆపైన అక్క లిద్దరూ అతను సినిమాకు వెళ్లటానికి అనుమతి యిచ్చారు.

"మా అక్కలు ఎంతో మంచివారు. నా కోర్కెను కాదనరు" అంటూ భుజాలు ఎగురవేస్తూ, ఎంతో సంతోషంగా వెళ్లాడు శ్రీకాంత్.

రెండో ఆట సినిమా వొదిలాక, నడుచుకుంటూ ఇంటికొచ్చాడు శ్రీకాంత్. అప్పటికి దాదాపు ఒంటిగంటైంది.

వీధి మలుపు తిరగ్గానే తన ఇంట్లో లైట్లు వెలుగుతూండటాన్ని చూశాడు శ్రీకాంత్. వాకిట్లో నలుగురైదుగురు మనుషులు కూడా వున్నారు. శ్రీకాంత్ గుండె దడదడలాడింది.

ఏమైంది ?

ఆ వేళప్పుడు ఇంట్లో లైట్లు ఎందుకు వెలుగుతున్నాయి ?

వాకిట్లో మనుష లెందుకున్నారు ?

ఎవరైనా దొంగలు పడ్డారా ?

శ్రీకాంత్ యాభై మీటర్ల దూరం పరుగెత్తి, ఇంటికి చేరుకున్నాడు

ఇరుగుపొరుగువారు వాకిట్లో ఎదురైనారు. వాళ్ళల్లో పూర్ణచంద్ కూడా వున్నాడు.

"ఏమైంది" అన్నాడు శ్రీకాంత్ గుండె గొంతులోకి వచ్చినంత ఆదుర్దాగా.

"ఎవడో దొంగ వచ్చాడట. ఆడవాళ్ళు కేకలువేస్తే మేం వచ్చాం" అన్నాడు పక్కింటి సుబ్రహ్మణ్యం. అతను బ్యాంకులో గుమాస్తా.

మూడు అంగల్లో ఇంట్లో కెళ్ళాడు శ్రీకాంత్. హాలులో సుభాషిత, సుజాతలు భయంతో వొణికిపోతూ కూర్చునివున్నారు. వాళ్ల మొహాల్లో దడుపు కొట్టవచ్చినట్టు కనబడుతూంది.

"ఏమైందక్కా ?" అన్నాడు శ్రీకాంత్ సుజాత నుద్దేశించి.

ఆమె పిచ్చిగా చూడటం తప్ప నోరు విప్పలేదు.

"ఏమైందక్కా ?" అన్నాడు శ్రీకాంత్ సుభాషిత నుద్దేశించి.

ఆమె మొహంలో వొణుకు కనబడుతూంది. మాట్లాడే స్థితిలో లేదు.

నాగరత్నమ్మ మండిగంమీద రుబ్బురోలులా కూర్చుంది. ఆవిడలో ఏ భయమూ, భ్రాంతీ, చలనమూ లేవు.

"ఏమైంది నాగరత్నమ్మా !" అన్నాడు శ్రీకాంత్.

"ఏమో బాబూ ! నేను కళ్ళతో చూశానా, పెట్టానా ! వంటింట్లో ముసుగుపెట్టి మామూలుగా నిద్రపోతున్నాను. సుజాతమ్మగారు ఒక్కసారి అరిచారు 'దొంగ' 'దొంగ' అని. గబుక్కున లేచాను. బయటికొచ్చేతలికి ఎవరూ అగుపడలా. అంతలో వాళ్లూ వీళ్లూ వొచ్చారు అంది నాగరత్నమ్మ దీర్ఘాలు తీస్తూ.

"ఆ దొంగను నువ్వు చూశావా అక్కా !" అన్నాడు శ్రీకాంత్, సుజాత నుద్దేశించి.

చూడలేదన్నట్టు కింది పెదవి విరిచింది సుజాత.

"మరి."

సుజాత, సుభాషితలు మాట్లాడలేదు. వాళ్ళను ఆవహించిన భయం ఇంకా సద్దుమణగలేదు. వాళ్ళ కళ్ళముందు ఓ ముసుగువ్యక్తి మెదులుతూనే వున్నాడు.

"ఏం జరిగిందో చెప్పండక్కయ్యా ! నే నొచ్చానుగా. ఇంకా భయం దేనికి ? మీరు వివరాలు సరిగ్గా చెబితే దొంగ ఆచూకీ తీయడానికి వీలుగా వుంటుంది" అన్నాడు శ్రీకాంత్.

అప్పుడే పక్కింటి సుబ్రహ్మణ్యం, ఎదురింటి పూర్ణచంద్ బయటినుంచి లోపలకు వచ్చారు. సుబ్రహ్మణ్యం తెల్ల లుంగీమీద బన్నీ వేసుకున్నాడు. యాభై ఏళ్ళకు పైగా వుంటాయి. అర్ధరాత్రిపూట ఇళ్ళల్లోకి దొంగలు రావటం ఆయనకు కొత్త విషయమేమీ కాదు. ఆయన సర్వీసులో ముప్పై ప్రదేశాలు చూశాడు. ప్రతి ఊళ్లోనూ దొంగల బెడద వుండనే వుంటుంది.

పంచరంగుల బాటిక్ ప్రింటిగ్ లుంగీమీద, గ్లాస్కో లాల్చీ ధరించాడు పూర్ణచంద్. కళ్ళు ఎర్రగా పత్తికాయల్లా వున్నాయి. అప్పటికింకా అతను నిద్రపోలేదు. విస్కీ తాగుతూనే వున్నాడు. జులపాల జుత్తు, చెంపలు దిగిన పట్టీలు. పొట్టి మీసాలు. ఉబ్బిన బూరెల వంటి బుగ్గలతో గంభీరమైన మొహం. పొడుగుకు సరిపడిన బొద్దుగా వుంటాడు.

"ఇంట్లో ఆడాళ్ళను వొదిలేసి రెండో ఆట సినిమాకు వెళ్ళావా బాబూ !" అన్నాడు సుబ్రహ్మణ్యం, శ్రీకాంత్ నుద్దేశించి.

"ఇంటికి దొంగ వస్తాడని ఆ కుర్రాడు కలగన్నాడా ?" అన్నాడు పూర్ణచంద్.

"మీ రెవరైనా చూశారా దొంగను ?" అన్నాడు శ్రీకాంత్.

"చూస్తే వూరుకుంటామా ? పట్టుకుని, వీధిలో స్తంభానికి కట్టివేసి, పోలీసులకు ఫోన్‌కొట్టేవాళ్ళం కాదూ !" అన్నాడు పూర్ణచంద్.

"ఏదో అయిపోయింది. ఇంకా అదృష్టం. పూచికపుల్లకూడా పోలేదు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"అసలా దొంగ ఎందుకొచ్చాడో !" అన్నాడు పూర్ణచంద్.




శ్రీకాంత్ చురుగ్గా పూర్ణచంద్ కేసి చూశాడు.

"దొంగ లెందుకొస్తారు ? వస్తువుల్ని దొంగిలించుకుపోవటానికి" అన్నాడు సుబ్రహ్మణ్యం.

దొంగల్లో అనేక రకాలమంది వుంటారు. అందరూ కేవలం వస్తువుల్ని దొంగిలించుకుపోవటానికే రారు సుబ్రహ్మణ్యంగారూ ! కొంతమంది కొన్ని కొన్ని దురుద్దేశాలతో గోడలు దూకవచ్చు" అన్నాడు పూర్ణచంద్ వ్యంగ్యంగా.

సుబ్రహ్మణ్యం అతని మాటల వెనుక దాగివున్న అర్థాన్ని గ్రహించి ఆశ్చర్యంగా చూశాడు.

శ్రీకాంత్‌కు బుస్సున కోపం వచ్చింది.

"దొంగ ఎందుకొచ్చాడనే దానిమీద ఇప్పుడు చర్చ అనవసరం. మా ఇంట్లో వస్తువులేం పోలేదు. దయచేసి మీరు వెళ్ళిపోతారా !" అన్నాడు శ్రీకాంత్ దూకుడుగా.

సుబ్రహ్మణ్యం కనురెప్పలు అల్లలాడించాడు.

పూర్ణచంద్‌కు అవమానంతో మొహం జేవురించింది.

"మీ ఇంట్లో ఉండిపోవటానికి వచ్చాననుకున్నావా ఏమిటి ? ఏదో ఆడంగులు కేకలువేస్తే, ఏం జరిగిందోనని, వాకబు చేయటాని కొచ్చాం. ఏదో సానుభూతి సాయం..."

"మీ సానుభూతి, సహాయాలు మాకేం అవసరంలేదు. వాటిని అర్థించే ఇబ్బందుల్లో ఏమీ లేం" అన్నాడు శ్రీకాంత్ కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్టుగా.

బుసలుకక్కుతూ వెళ్ళిపోయాడు పూర్ణచంద్.

సుబ్రహ్మణ్యం కూడా అతన్ని అనుసరించాడు.

వెలుగుతున్న లైట్లన్నీ ఆర్పివేసి, వీధితలుపు గడియపెట్టి, ఇంట్లోకి వచ్చాడు శ్రీకాంత్. అప్పటికి సుజాత, సుభాషితలు హాలులో కూర్చుని వున్నారు. నాగరత్నమ్మ మళ్ళీ వంటగదిలో చేరి చాపమీద మేను వాల్చింది.

"అసలేం జరిగిందో చెప్పు అక్కా !" అన్నాడు శ్రీకాంత్ మళ్ళీ సుజాత నుద్దేశించి.

"మేం వద్దన్నకొద్దీ రెండో ఆట సినిమా కెళ్ళావు అదెవడో కని పెట్టి ఇంట్లోకి రావటానికి ధైర్యం చేశాడు" అంది సుభాషిత.

"ఇలా జరుగుతుందని నాకేం తెలుసు ? ఎన్నిసార్లు రెండోఆట సినిమా కెళ్ళలేదూ !" అన్నాడు శ్రీకాంత్.

"ఏమో నాకు భయంగా ఉంది శ్రీకాంత్. ఆ వచ్చినవాడు దొంగతనానికి రాలేదు" అంది సుజాత.

"మరి, ఎందుకొచ్చాడంటావు ? వాణ్ని గుర్తుపట్టగలవా ? ఈ లోకాలిటీ వాడేనా ?" అన్నాడు శ్రీకాంత్.

"ఏమో తెల్లటి పంచె ముసుగుగా కప్పుకున్నాడు. ముందుగా తలుపు తట్టాడు. నువ్వనుకున్నాను. మళ్లీ అనుమానం వొచ్చింది. నువ్వయితే 'అక్కా' అని పిలిచేవాడివి గదా ! కొన్ని క్షణాలపాటు తటపటాయించాను. తలుపు తీయలేదు. సుభా మొద్దునిద్రలో వుంది. 'ఎవరు' అన్నాను. 'నీ మొగుడ్ని!' అన్నాడు వాడు. స్టన్ అయ్యాను. వెంటనే హాలులోనూ, బయటా లైట్లు వేశాను. సుభాను లేపాను. 'దొంగ' 'దొంగ' అని అరుస్తూ కిటికీ తలుపులు తెరిచాను. అప్పటికే వాడు గోడదూకి బయటకు పోతున్నాడు. తెల్లముసుగు కప్పుకున్నాడు. గుర్తుపట్టటానికి వీలులేకపోయింది" అంది సుజాత.

పళ్లు పటపట కొరికాడు శ్రీకాంత్ కోపంతో. పిడికిలి బిగించాడు. హాలులో అటూ అటూ పచార్లు చేశాడు చల్లారని ఆవేశంతో.

"వాడు నిజంగా దొంగతనానికే వచ్చాడంటావా ?" అంది సుభాషిత.

"కాదు" అన్నాడు శ్రీకాంత్ గర్జిస్తూ.

"మేం కూడా అలానే అనుకున్నాం అల్లరిచేయటానికే వచ్చి వుంటాడు" అంది సుజాత. భయంతో ఆమె గొంతు కొద్దిగా వొణికింది.

శ్రీకాంత్ మొహం గంభీరమై, కొండరాయిలా గట్టిపడింది.

"ఆ స్కూటర్ వాడే నేమో వీడు" అంది సుభాషిత.

"కావొచ్చు" అంది సుజాత.

"మీరేం భయపడకండి. వాడి అంతు నేను చూస్తాను. వాడు ఈ చుట్టుపక్కలవాడే అయివుంటాడు. గోముఖవ్యాఘ్రాలు ఎన్నో మన చుట్టూ తిరుగుతూ వుంటాయి సమయంకోసం కాచుకొని, కబళించటానికి వేచి వుంటాయి. వాడు దొరక్కపోడు. వాడి రక్తం కళ్ళజూడకపోను. నా తడాఖా ఏమిటో చూపిస్తాను" అన్నాడు శ్రీకాంత్ ఆగ్రహావేశంతో వూగిపోతూ.

"ఎవడు వాడు ? నీ కేమైనా అనుమానముందా ? అంది సుజాత.

"ఈ వీధిలో వాడెవరైనా..." అంది సుభాషిత.

శ్రీకాంత్ ఏం మాట్లాడలేదు. అతని అనుమానం పూర్ణచంద్ మీదికి పోయింది. ఇంత సాహసానికి వాడే పాల్పడి వుంటాడు. అంత ధైర్యం మరెవ్వరికి వుంటుంది ? తాను సినిమాకు వెళ్లేటప్పుడు వాడు స్కూటర్ మీద ఇంటికొస్తూ రోడ్డుమలుపులో ఎదురయ్యాడు. దుర్మార్గుడు. గోముఖవ్యాఘ్రం. అక్కయ్యలమీద వాడి కన్ను ఎప్పుడో పడింది. అందుచేతనే రోజూ ఉదయం పదిగంటలకు తాము రోడ్డుమీద కొచ్చినప్పుడు వాడూ షాపుకు బయలుదేరి రోడ్డుమీద కొస్తాడు. తాము బయల్దేరేవరకూ రోడ్డు పక్కనే స్కూటర్ మీదనే వుండి, అక్కయ్యలకేసి అవురావురుమంటూ చూస్తూనే వుంటాడు. దుష్టుడు. మస్తాన్ చెప్పింది కరక్టే ! సందేహం లేదు. ఈ దుస్సాహసం వాడిదే ! అనుకున్నాడు శ్రీకాంత్. కాని తన అనుమానాన్ని బయటకు చెప్పలేదు, అక్కయ్యలు భయపడతారనుకున్నాడు.

"ఏం శ్రీకాంత్ ! నీ కెవ్వరిమీదా అనుమానం లేదా ?" అంది సుజాత మళ్ళీ

"ఇట్లాంటి విషయాల్లో అనుమానాలు పెట్టుకుని ప్రయోజన మేముం

దక్కయ్యా! స్పష్టంగా చూసి, పట్టుకోవాలి. ఎంతమందిని అనుమానించ గలం? అనుమానించి అడిగే విషయం కూడా కాదు" అన్నారు శ్రీకాంత్.

"ఏమిటో నాకు భయంగా వుంది. ఇల్లు మారితేనో" అంది సుభాషిత.

"ఇల్లు మారినంత మాత్రాన అవతల మనుషులు మారతారా? ఇంకో చోటుకు పోతే, వాళ్ళు అక్కడకు రావచ్చు. అల్లరిపెట్టేవాళ్ళకు గుణపాఠం నేర్పాలిగానీ, వాళ్ళకు భయపడి పారిపోతే, వెంటాడి తరుముతారు" అన్నాడు శ్రీకాంత్.

"మరేం చేద్దామంటావ్?" అంది సుజాత.

"మీరేం భయపడకండి. మీ రక్షణ బాధ్యత నాది. నిశ్చింతగా వుండండి. మీమీద ఈగవాలనీయకుండా నేను చేస్తాను" అన్నాడు శ్రీకాంత్.

"ఏం చూస్తావ్? చూశావుగా. రెండో ఆట సినిమా కెళ్ళావు. ఆ అదను కనిపెట్టి పోకిరీవాడెవడో గోడదూకి లోపల కొచ్చాడు. ఈ సంగతి నలుగురికీ తెలిస్తే అలుసైపోము. అంది సుజాత

"నలుగురికీ తెలియకుండా వుంటుందా? రేపు ఉదయమే పేటంతా మ్రోగి పోతుంది. నానా రకాలుగా చెప్పుకుంటారు" అంది సుభాషిత.

"చూద్దాం. ఇదేదో కుట్రపన్ని చేస్తున్నట్టుగా వుంది. ఆ కుట్ర వెనుక ఎవరున్నారో తెల్సుకుంటేగానీ, మనం ముందుకు పోవటానికి వీల్లేదు. మీరేం భయపడకండి. ఏం వొచ్చినా నేను చూసుకుంటాను" అన్నాడు శ్రీకాంత్ అభయం యిచ్చినంత ధీమాగా.

"మాకు భయమేమీ లేదు. మా గురించి అనవసరంగా నువ్వు తగాదాలకు దిగుతావేమోననే భయం. అసలే నీది దూకుడు తత్వం. ఒంటికాలుమీద కొండను ఢీ కొంటానంటావు. ఆవేశంలో వెనుకా ముందూ చూడవు. ఎదుటి వాళ్ళ బలాన్ని గ్రహించవు" అంది సుజాత.

శ్రీకాంత్ హాలులో పచార్లుచేస్తూనే ఆలోచించసాగాడు.

రాత్రి రెండుగంటలు కావస్తోంది.

"రేపు ఆలోచించవచ్చులే. పడుకుందాం" అంది సుభాషిత.

తెల్లవారుఝామున నాలుగు గంటలకుగానీ శ్రీకాంత్‌కు నిద్ర పట్టలేదు. అప్పటిదాకా పూర్ణచంద్‌ను గురించి తీవ్రంగా ఆలోచిస్తూనే వున్నాడు.

## 8

స్వరూప కర్నూలు కాలేజీలో చేరింతర్వాత దాదాపు వారానికో ఉత్తరం వ్రాస్తూనే వుంది స్నేహితురాంద్రకు. సుజాత, సుభాషితలు కూడా సమాధానాలు

వ్రాస్తూనే వున్నారు. అప్పుడప్పుడూ శ్రీకాంత్ కూడా ఉత్తరాలు వ్రాస్తున్నాడు. అయితే ఆరోజు రాత్రి ఇంట్లో ఓ వ్యక్తి ప్రవేశించిన సంగతి స్వరూపకు ఎవ్వరూ వ్రాయలేదు. భయపడుతుందని వూరుకున్నారు.

ఆ రోజు ఆదివారం.

సుజాత, సుభాషిత, శ్రీకాంత్ ఇంటిదగ్గర ఉన్నారు. వాళ్ళు ముగ్గురూ మ్యాట్నీకి వెళదామనుకున్నారుగానీ. 'ఏ సినిమాకు వెళ్లాలి ?' అనే దానిమీద ముగ్గురికీ ఏక మనస్కత కుదరక మానివేశారు. సుజాత హిందీ సినిమాకు వెళదామంది; సుభాషిత తెలుగు సినిమాకు వెళదామంది; శ్రీకాంత్ ఇంగ్లీషు సినిమాకు వెళదామన్నాడు. ఓ పావుఘంటసేపు వాదించుకున్నారు. చివరకు విరమించుకున్నారు. నాగరత్నమ్మను పిలిచి ఉల్లిపాయ పకోడీలు తయారు చేయించుకుని తింటూ కబుర్లు చెప్పుకొనేందుకు నిర్ణయించుకున్నారు. వాళ్ళ సినిమా ప్రోగ్రాం కుదరకపోవటం మంచిదైంది. ఎందుకంటే, సాయంత్రం నాలుగున్నర గంటలకు సుజాత తండ్రి నారాయణమూర్తి వచ్చాడు.

ఆ సమయంలో అందరూ హాలులో కూర్చుని ఉల్లిపాయ పకోడీలు తింటూ కబుర్లు చెప్పుకుంటూ. జోక్సు వేసుకుంటూ విరగబడి నవ్వుకుంటు న్నారు ముగ్గురూ. ఆయన్ను చూడగానే నవ్వులు తక్కున ఆగిపోయాయి

నారాయణమూర్తి తనతోపాటు ఓ యువకుడ్ని వెంటబెట్టుకొచ్చాడు. పాతికేళ్ళు ఉండొచ్చు అతనికి. నీట్‌గా వున్నాడు. పొడగరి. కోలమొహం, తెల్లని శరీర ఛాయమీద పక్కపాపిటగల నల్లని జుత్తు. ఎముకపుష్టిగల దేహం. చెవులు కొంచెం పెద్దవి. మొహంకంటే అవే ముందుగా కనబడేట్టు వుంటాయి క్రీమ్ కలర్ స్ట్రెచ్‌లాన్ బెల్‌బాటమ్ ప్యాంటుమీద సన్‌రైజ్ ఆరెంజ్, జెట్‌బ్లాక్ చెక్స్ గల టెరీకాట్ స్లాక్ వేసుకున్నాడు. అతన్ని అంతకుముందు వాళ్ళెవ్వరూ చూడలేదు

"రండి" అంటూ నారాయణమూర్తి ఆ యువకుడ్ని లోపలకు ఆహ్వానించి కుర్చీలో కూర్చోబెట్టాడు. సుజాత, సుభాషితలు లోపలికి వెళ్ళారు. శ్రీకాంత్ అక్కడే కూర్చున్నాడు.

ఆ యువకుడూ, శ్రీకాంత్ మొహమొహాలు చూసుకున్నారు గానీ, ఎవరో, ఏమిటో తెలియక వూరుకున్నారు.

నారాయణమూర్తి లోపలకు వెళ్ళాడు.

"ఇదేనా రావటం నాన్నా!" అంది సుజాత.

"అవునమ్మా! ఫోంచేసి బస్సుకొచ్చాను. సమయానికి ఇంట్లోనే వున్నావు. ఏ మ్యాట్నీకో, ఫ్రెండ్ దగ్గరకో వెళతావని తెగ భయపడ్డాను" అన్నాడు నారాయణమూర్తి ఉత్తరీయంతీసి మంచంమీద వేస్తూ.

"ఎవరతను బాబాయ్?" అంది సుభాషిత.

"సుజాతకు వరుణ్ని వెతుక్కొచ్చానమ్మా!" అన్నాడు నారాయణమూర్తి. ఆయన మొహంలో చిరునవ్వు దొర్లింది.

సుజాత ఆశ్చర్యపోతూ తండ్రికేసి చూసింది.

"త్వరగా కాస్త మొహం కడుక్కొని మంచి చీర కట్టుకోమ్మా ! ఒకరకంగా పెళ్ళిచూపులే అనుకో! ముందుగా చెప్పటానికి టైం లేకపోయింది. నేరుగా అబ్బాయిని ఇక్కడకు తీసుకొచ్చాను. అసలు నిన్నే మన వూరు పిలిపిద్దామనుకున్నాను. కాని ఆ పల్లెటూళ్ళో పెళ్ళిచూపులు దేనికి ? ఒకవేళ కుదరకపోతే అమ్మలక్కలు ఆక్షేపిస్తారు నాలుగు రకాలుగా అనుకుంటారు. పల్చనైపోతాం. అందుకని ఇక్కడ ఏర్పాటు చేయించాను పిల్లవాడు బుద్ధిమంతుడు. ఎం.ఎస్సీ ఫస్ట్‌క్లాసులో ప్యాసయ్యాడు. మనవూరి దగ్గర బ్రాహ్మణకోడూరు లేదూ ! ఆ వూరే అబ్బాయిది. పిల్లలుగల కుటుంబం. ఊళ్ళో పరువు ప్రతిష్ఠలు గల వంశం" అన్నాడు నారాయణమూర్తి వివరాలను త్వరగా చెబుతూ.

గుమ్మందగ్గర నిలబడ్డ శ్రీకాంత్ ఆ వివరాలను విన్నాడు.

"ఉద్యోగం ఏదైనా చేస్తున్నాడా ?" అంది సుభాషిత.

"ఇంకా లేదమ్మా! రెండు మూడు కాలేజీలకు అప్లయి చేశాడట. ఫస్టుక్లాస్ ఎం. ఎస్సీ. గదా? ఉద్యోగం రాకపోతుందా ? అబ్బాయి ఎట్లా వున్నాడమ్మా ?" అన్నాడు నారాయణమూర్తి.

"ఆ సంగతి సుజాత చెప్పాలి" అంది సుభాషిత స్నేహితురాలికేసి చూస్తూ.

"నువ్వు చెప్పమ్మా!" అన్నాడు నారాయణమూర్తి.

"నన్ను చెప్పమంటారా?" అన్నాడు శ్రీకాంత్ మధ్యలో కల్పించుకొని.

నారాయణమూర్తి అతనికేసి నిశితంగా చూశాడు – నిన్నెవరు అడిగారు అన్నట్టు అయినా ఆయన అంగీకారంకోసం ఆగకుండా శ్రీకాంత్ చెప్పేశాడు:

"అబ్బాయి పర్సనాలిటీ నంబరు వన్‌గా వుంది. అక్కయ్యకు తగిన వరుడు. మరి కట్నం ఎంతో!"

"ఇంకా అంతదాకా రాలేదు. అమ్మాయి నచ్చితే అదేమంత ముఖ్యమైన విషయంకాదు" అన్నాడు నారాయణమూర్తి.




"అయితే సంబంధం మంచిదే. వరుడికి ఆ మాత్రం వ్యక్తిత్వం వుంటే, అంతకంటే ఇంకా ఏం కావాలి?" అన్నాడు శ్రీకాంత్.

సహజమైన సిగ్గువల్లనో, మరేకారణంచేతనో సుజాత ఏం మాట్లాడలేదు. అందరూ మాట్లాడుకొనేది మాత్రం శ్రద్ధగా వినసాగింది. కిటికీలోంచి రెండు మూడుసార్లు హాల్లో కూర్చున్న ఆ యువకుడ్ని చూసింది. ఆమెకూ అతని పర్సనాలిటీ నచ్చింది. చదువూ బాగానే ఉంది. అయితే ఉద్యోగం మాత్రం లేదు. కట్నం ఎంతో తేలలేదు. గత సంవత్సరంగా పెళ్ళిచేసుకుని జీవితంలో స్థిరపడిపోవాలనే కాంక్ష సుజాతలో ప్రబలంగా ఉంది. ఆ కాంక్షను ప్రత్యక్షంగా ఎవరిదగ్గరా వెల్లడిచేయక పోయినప్పటికీ, తల్లిదండ్రులు సంబంధాలు చూస్తూంటే ఏమీ అభ్యంతరం చెప్పడంలేదు.

సుజాతను త్వరగా తయారుకమ్మని నారాయణమూర్తి అనడంతో ఆమె బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది.

వచ్చినవాళ్ళకు ఫలహారాలు, కాఫీ వ్యవహారం సుభాషిత చూడసాగింది. శ్రీకాంత్‌చేత బజార్నుంచి స్వీట్స్ తెప్పించింది. నాగరత్నమ్మ చేత మళ్ళీ పకోడీలు చేయించింది.

ఫలహారాలు, కాఫీలు అయింతర్వాత సుజాత పెళ్ళిచూపుల కళతో హాలులోకి వచ్చింది. కృష్ణప్రసాద్ అనబడే ఆ యువకుడూ, సుజాత ఎదురుబదురుగా కళ్ళతో చూసుకున్నారు. చూపులతో పలకరించుకున్నారు.

సుజాతను సింపుల్‌గా అలంకరించింది సుభాషిత. టర్క్వాయిస్ బ్లూకలర్ బ్యాగ్రౌండ్‌మీద సన్‌సెటింగ్ రెడ్ ఫ్లవర్స్ ప్రింటుగల వూల్లీచీర ధరించింది. మెడలో రెండుపేటల గొలుసు. ఒకచేతికి హెచ్.ఎం.టి. రిస్టువాచీ, మరో చేతికి మూడు మట్టిగాజులు. మొహానికి నామమాత్రంగా స్నో, పౌడర్లు. నుదుటిమీద నిలువుబొట్టు.

కృష్ణప్రసాద్‌కు సుజాత నచ్చింది. ఆ మాట మనసులో అనుకున్నాడు.

సుజాతకు కృష్ణప్రసాద్ నచ్చాడు. ఆ మాట మనసులో అనుకుంది.

"ఇద్దరూ మౌనంగా చూసుకోవటమేనా, మాట్లాడుకొనేదేమైనా వుందా?" అన్నాడు శ్రీకాంత్ ఇరువురి మధ్యా మౌనాన్ని భగ్నంచేయటానికి.

కృష్ణప్రసాద్, సుజాత ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. అంతేకాని పెదవులు విప్పలేదు.

"ఇద్దరికీ మాటలు రావా ?" అన్నాడు శ్రీకాంత్ మళ్ళీ

అయినా వాళ్ళు మాట్లాడుకోలేదు.

వాళ్ళచేత ఏదో మాట్లాడించాలనే తహతహ, ఉత్కంఠ శ్రీకాంత్‌లో హెచ్చుకాసాగింది.

"ఇద్దరూ మూగవాళ్ళు? ఏం బావగారూ! ఏం అక్కయ్యా!" అన్నాడు శ్రీకాంత్ పట్టుదలగా.

ఇద్దరూ ఫక్కున నవ్వారు.

"దేన్ని గురించి మాట్లాడుకోవాలి చెప్పండి" అన్నాడు కృష్ణప్రసాద్.

"పెళ్ళి అయింతర్వాత జీవితం ఎలా వుండాలి? ఏయే ఆదర్శాల ప్రకారం ఏయే ఆశయాల ప్రకారం జీవిత శకటాన్ని ముందుకు నడిపించాలి? జీవితంలో డబ్బు సంపాదన ముఖ్యమా! జీవితాన్ని సుఖంగా అనుభవించడం ముఖ్యమా ! జీవితాన్ని సార్థకం చేసుకోవటం ముఖ్యమా!—మొదలైన విషయాల్ని గురించి నిర్మొహమాటంగా మాట్లాడుకోవచ్చు. పరస్పరమైన అభిరుచులు, అభిలాషలు, అభిప్రాయాలు తెల్సుకుంటే ముందు ముందు పొరపొచ్చాలు, మనస్పర్థలు రాకుండా వుంటాయి. జీవితం కొండమీద మంచుజారిపోయినట్టు సుఖంగా, కులాసాగా గడిచిపోతుంది. అయినా నా కంటె ఇద్దరూ పెద్దవాళ్ళు, నాకంటే బాగా చదువుకున్నవాళ్ళు. నేను మీకు చెప్పేదేమిటి ?" అన్నాడు శ్రీకాంత్.

శ్రీకాంత్ అంత చొరవగా, స్వేచ్ఛగా మాట్లాడటం నారాయణమూర్తికి నచ్చలేదు. అనవసరమైన వాగుడుతో సంబంధాన్ని ఎక్కడ చెడగొడతాడో

అనే భయం ఉందాయనకు. అసలు శ్రీకాంత్ ఆ ఇంట్లో వుండటమే ఆయన కిష్టంలేదు. ఆ మధ్యవరకూ సొంత అక్కయ్య వుందిగాబట్టి ఏమీ ఆక్షేపించ లేకపోయాడు. ఇప్పుడామె ఇక్కడ వుండటంలేదు. వీడు ఇద్దరు ఆడవాళ్ల మధ్య వుండటం దేనికి? లోకులు ఏమైనా అనుకోవచ్చు. వాడ్ని అనేదేముంది! సుజాత, సుభాషితలను అనాలి. వాళ్లకు ఇంగితజ్ఞానం ఉండాలి అనుకున్నాడు.

"శ్రీకాంత్ చిన్నవాడు. ఏవేవో వాగుతూవుంటాడు, పట్టించుకోకండి," అన్నాడు నారాయణమూర్తి మధ్యలో కల్పించుకుంటూ.

"అదేం లేదులెండి. శ్రీకాంత్ ఉషారైన యువకుడు. వయసుకు మించిన ఆలోచనలు గలవాడు. ఏం చదువుతున్నావు మిస్టర్" అన్నాడు కృష్ణప్రసాద్.

"బి కాం ఫస్ట్‌ఇయర్" అన్నాడు శ్రీకాంత్

"స్వరూప అని మా అమ్మాయి స్నేహితురాలు. మొన్నటిదాకా ఆమె ఇక్కడే వుండేది. ఈ మధ్యనే కర్నూలుకు ట్రాన్స్‌ఫరయింది. సుజాత, స్వరూప, సుభాషిత—ఈ ముగ్గురూ ప్రాణానికి ప్రాణం యిచ్చుకొనే స్నేహితురాండ్రు చదువుకునే రోజుల్నించీ! స్వరూప తమ్ముడే శ్రీకాంత్. అసలు అక్కయ్య కర్నూలు వెళ్ళినా, మధ్యలో ఎక్కడ కెళ్లడమని అక్కయ్యల దగ్గరే ఉంటున్నాడు కాస్త సాయంగా" అన్నాడు నారాయణమూర్తి. ఆ ఇంట్లో శ్రీకాంత్ ఎందుకుంటున్నాడో ముందుగా చెప్పడం భావ్యంగాతోచింది ఆయనకు.

కృష్ణప్రసాద్ చేతిగడియారం చూసుకున్నాడు. అయిదున్నరైంది.

'వెళదామా' అన్నట్టు నారాయణమూర్తికేసి చూశాడు అతను.

"పొద్దుగూకుతోంది. వెళతామమ్మా?" అన్నాడు నారాయణమూర్తి.

"అంతా బాగానే వుంది. పెళ్ళిచూపుల ఫలితమేమిటో చెప్పలేదు" అన్నాడు శ్రీకాంత్.

కృష్ణప్రసాద్ చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వులో కించిత్ సిగ్గు తొంగి చూడకపోలేదు. దాన్నిబట్టి అతను పెళ్ళికి సుముఖంగా ఉన్నట్టు అర్థమైపోయింది.

"అంత తొందరపడతావేమిటోయ్! పెద్దలతో సంప్రదించవల్సి వుందిగా. ఆ తర్వాతనే ముహూర్త నిర్ణయం అన్నాడు నారాయణమూర్తి.

కృష్ణప్రసాద్‌ను వెంటబెట్టుకొని నారాయణమూర్తి వెళ్ళాడు. కళాసాయైన చిరునవ్వుతో అందరికీ నమస్కారాలు చెప్పి వెళ్ళాడు కృష్ణప్రసాద్. సుజాతకు మాత్రం కళ్ళతో చెప్పాడు.

దాదాపు ఆ సంబంధం స్థిరపడినట్లుగా అనుకున్నారు అంతా.

"అక్కయ్యా! కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు శ్రీకాంత్ నిండైన సంతోషంతో.

'ఎందుకు?' అన్నట్టు చూసింది సుజాత.

"అదేమిటక్కా అలా చూస్తావు! మంచి భర్త దొరికినందుకు" అన్నాడు శ్రీకాంత్.

"అప్పుడే ఏమైందోయ్!" అంది సుజాత.

"ముఖ్యమైన ఘట్టం ముగిసింది. మిగతాదంతా మామూలు తతంగమేగా! పెళ్ళికొడుక్కి నువ్వు నచ్చావు. నీకు పెళ్ళికొడుకు నచ్చాడు. ప్రధాన ఘట్టం అయిపోయినట్లేగా! వాళ్ల తల్లిదండ్రుల్ని సంప్రదించి ముహూర్తం పెట్టుకోవటమే మిగిలింది. అదెంతసేపు. మంచి ముహూర్తం సాధ్యమైనంత ముందుగా వుంటేనే మంచిది. అక్కయ్యా! నీ పెళ్ళికి పెత్తనమంతా నాదే!" అన్నాడు శ్రీకాంత్ చప్పట్లు చరుస్తూ.

శ్రీకాంత్ పరవశత్వానికి సుజాత, సుభాషితలు మురిసిపోయారు.

"సుజా! నీవు జీవితంలో స్థిరపడబోతున్నావు. ఎంతో సంతోషంగా వుందే! పెళ్లి కాగానే మమ్మల్ని విడిచి మరో ఇల్లు చూసుకుంటావు కాబోలు!" అంది సుభాషిత.

"మరి నీ పెళ్ళి అయితే నువ్వూ మరో ఇల్లు చూసుకుంటావుగా! అప్పుడు నే నొక్కణ్ణే మిగిలిపోతాను" అన్నాడు శ్రీకాంత్ బుంగమూతి పెట్టి.

"నువ్వు ఒక్కడివే మిగిలిపోవటం దేనికోయ్! నువ్వూ పెళ్లి చేసుకుంటే సరిపోతుంది. ఇల్లు తీసుకొని కాపురం పెట్టొచ్చు" అంది సుజాత.

"ఫో? అక్కయ్యా?" అన్నాడు శ్రీకాంత్ సిగ్గుపడుతూ.

"అబ్బో! పెళ్ళి పేరెత్తగానే ఎక్కడలేని సిగ్గు ముంచుకొచ్చిందే!" అంది సుభాషిత.

నవ్వింది సుజాత. ఆ నవ్వులో తన నవ్వుకూడా కలిపింది సుభాషిత. అక్కయ్యలతోపాటు తనకీ నవ్వక తప్పలేదు శ్రీకాంత్‌కు.

## 9

సుజాత పెళ్లిచూపులై వారమైంది. ఇంకా ఏ సమాచారమూ తెలియలేదు. నారాయణమూర్తి రాలేదు. సుజాతకు ఓ రకమైన ఆదుర్దా ఎక్కువైంది. కాని బయటపడలేదు.

ఆ రోజు ఉదయం శ్రీకాంత్ అన్నాడు.

"అక్కయ్య పెళ్లి ముహూర్తమెప్పుడో ! ఇంకా ఏమీ తెలియలేదే!"

సుజాత మాట్లాడలేదు.

"దగ్గర్లో ముహూర్తాలు లేవేమో!" అంది సుభాషిత.

"పురోహితుడ్ని కనుక్కొని రమ్మంటావా ?" అన్నాడు శ్రీకాంత్.

"మధ్యలో నీ హడావుడి ఎక్కువగా ఉందే" అంది సుభాషిత.

"మరి పెళ్ళికి పెత్తనం వహించవద్దూ!" అన్నాడు శ్రీకాంత్.

"అతని తల్లిదండ్రులు ఏమన్నారో!" అంది సుజాత మనసులోని సందేహాన్ని వెలిబుచ్చుతూ.

"తల్లితండ్రులది ఏమీ లేదుటగా! అంతా అబ్బాయిదేనట. అతనికి నచ్చితే చాలట. కట్నం కానుకల ప్రసక్తి కూడా లేదట. మీ నాన్నగారు అన్నారు" అంది సుభాషిత.

"పోనీ అక్కయ్యా ! నువ్వు ఓసారి మీ వూరు వెళ్ళిరాకూడదూ, వచ్చే ఆదివారం. నన్ను తోడుగా రమ్మన్నా వస్తాను" అన్నాడు శ్రీకాంత్.

సుజాత ఏం మాట్లాడలేదు. టవల్ తీసుకుని బాత్‌రూం కెళ్ళింది.

ఆ రోజు కాలేజీలో సెకండ్ పిరియడ్ అయింతర్వాత, సెకండియర్ బి.యస్సీ క్లాసుకెళ్ళి స్టాప్‌రూంకి వచ్చింది సుజాత. ఛాక్‌పీసులను, డస్టర్‌ను టేబుల్‌మీద పడేసి అట్లా కుర్చీలో కూర్చుందో, లేదో కబురొచ్చింది ప్రిన్సిపాల్ గారు రమ్మంటున్నారంటూ, ఓ నిట్టూర్పు విడిచి వెంటనే బయలుదేరింది సుజాత.

ఆమెకు కారిడార్‌లో సుభాషిత కలిసింది.

"ఎక్కడికే ?" అంది సుజాత

"ప్రిన్సిపాల్ రమ్మంది. మరి నువ్వు" అంది సుభాషిత.

"నన్నూ రమ్మంది. ఎందుకో" అంది సుజాత.

ప్రిన్సిపాల్ రమ్మన్న కారణాన్ని ఇద్దరూ ఊహించలేకపోయారు.

"ఒకవేళ మనకూ ట్రాన్స్‌ఫర్లు వచ్చాయేమో!" అంది సుజాత.

"మైగాడ్! నిజమా!" అంది సుభాషిత.

"ఏమో అలా అనిపిస్తోంది."

"ఇద్దర్నీ కర్నూలుకు ట్రాన్స్‌ఫర్ చేస్తే బావుండు."

"బావుంటుంది. కాని చెయ్యాలిగా. ఏ శ్రీకాకుళమో ట్రాన్స్‌ఫర్ చేశారంటే చచ్చి వూరుకుంటాం."

''చూద్దాం. అసలెందుకు రమ్మందో !''

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ ప్రిన్సిపాల్ రూమ్‌కు వెళ్ళారు. ఆ రూమ్‌లో ఎవ్వరూలేరు. ప్రిన్సిపాల్ ఒక్కతే ఉంది. ఆవిడ మొహం బెరడు వలిచిన తుమ్మమొద్దులా గంభీరంగా వుంది. శూన్యంలోకి చూస్తూ నిశ్శబ్దంగా వుంది. ఆవిడను చూడగానే సుజాత, సుభాషితలు కొద్దిగా జంకారు. తప్పు చేసిన స్టూడెంట్స్‌ను శిక్షించేముందు ఆవిడ ఎంత సీరియస్‌గా వుంటుందో, అంత సీరియస్‌గా వుండేసరికి, సుజాత, సుభాషితలు ఒకరి మొహాలు మరొకళ్ళు అమాయకంగా చూసుకున్నారు-తాము ఏం తప్పు చేశామా అనుకుంటూ.

ప్రిన్సిపాల్ ఎదురుగ్గా వెళ్ళి నిలబడ్డారు వాళ్ళు.

''సిట్ డౌన్'' అంది ప్రిన్సిపాల్ సీరియస్‌గా.

కూర్చున్నారు వాళ్ళు.

''ఎక్కడ మీరు ఉండేది?''

చెప్పింది సుజాత.

''ఇద్దరూ ఒకేఇంట్లో వుంటున్నారా?''

తలలు ఆడించారు ఇద్దరూ.

''మీ ఇద్దరేకాక ఆ ఇంట్లో ఇంకెవరుంటున్నారు?''

ప్రిన్సిపాల్ అంత యిదిగా ఎందుకడుగుతూందో అర్థంకాలేదు వాళ్ళకు. బోనులో నిలబడ్డవాళ్ళను లాయరు క్రాస్ ఎగ్జామిన్ చేస్తూన్నట్టుంది.

''వంటమనిషి. బి. కాం. ఫస్ట్ ఇయర్ చదువుతున్న ఓ కుర్రాడు.'' అంది సుభాషిత.

''ఎవరా కుర్రాడు?'' అంది ప్రిన్సిపాల్ నిశితంగా.

''తమ్ముడు'' అంది సుజాత.

''ఎవరికి తమ్ముడు'' అంది ప్రిన్సిపాల్.

''ఇద్దరికీ'' అంది సుభాషిత.

''మీ రిద్దరూ సిస్టర్సా'' అంది ప్రిన్సిపాల్.

''కాదు. అంతకంటె ఎక్కువ.'' సుభాషిత సమాధానం.

అర్థంగాక అయోమయంలో పడింది ప్రిన్సిపాల్.

''నిజం చెప్పండి. ఎవరా కుర్రాడు? మీకూ అతనికి సంబంధమేమిటి?''

''నిజమే చెబుతున్నాం. మీరు ఇంత లోతుగా ఎందుకడుగుతున్నారో మాకు అర్థంకావటంలేదు'' అంది సుజాత. రోషంతో ఆమె మొహం కొంచెం ఎరుపుకు తిరిగింది.




"అవసరం ఉండబట్టే అడుగుతున్నాను. అన్యథా భావించకండి. పవిత్ర దేవాలయంవంటి విద్యాసంస్థలో మీరు పనిచేస్తున్నారు. మీ వ్యక్తిగత జీవితాలు కూడా ఆదర్శవంతంగా ఉండాలి. మీరు పనిచేసే సంస్థ పరువు మర్యాదలు కాపాడే కర్తవ్యం నామీద ఉంది. ఆ సంస్థలో పనిచేసేవాళ్ళు పొరపాటు చేసినా, తప్పుడు మార్గాలు తొక్కినా వాళ్ళను సరిచేసే బాధ్యత నాపైన ఉంది. అందుకే అధికారికంగా మాట్లాడుతున్నా. ఆ కుర్రవాడి పేరేమిటి ?"

"శ్రీకాంత్" అంది సుభాషిత.

"వయస్సెంత వుంటుంది?" ప్రిన్సిపాల్ ప్రశ్న.

"ఇరవయ్యేళ్ళు ఉండొచ్చు." అంది సుజాత.

"నిజంగా మీ ఇద్దరిలో ఎవరికి తమ్ముడు?" అంది ప్రిన్సిపాల్.

"ఎవరికీ కాదు. ఇదివరకు ఇంగ్లీషు లెక్చరర్‌గా ఇక్కడవుండి, ఆ మధ్య కర్నూలు ట్రాన్స్‌ఫరైపోయింది స్వరూప. ఆమె అసలు తమ్ముడు. మేం ముగ్గురమూ మొదట్నుంచీ ఒకే ఇంట్లో వుండేవాళ్ళం. మాతోపాటే శ్రీకాంత్ ఉంటున్నాడు. ఇంటర్మీడియట్ చదివాడు. ఇప్పుడు బి. కాం. చదువుతున్నాడు. మధ్యలో స్వరూప ట్రాన్స్‌ఫరొచ్చి వెళ్ళిపోయింది. శ్రీకాంత్ మాతోనే వుంటున్నాడు. సొంత తమ్ముడులాగానే మాతో కల్సిపోయాడు" అంది సుభాషిత.

ఆ మాటల్లోని నిజాన్ని గ్రహించింది ప్రిన్సిపాల్. ఓ నిముషంపాటు స్తబ్ధురాలైనట్టు ఆలోచించసాగింది. ఆ నిశ్శబ్దాన్ని భరించలేకపోయారు సుజాత, సుభాషితలు. ఏదో జరగరాని దుర్ఘటన జరిగినట్లుగా భయపడసాగారు.

"మిమ్మల్ని చూస్తే నాకు జాలివేస్తోంది. మీరు అమాయకులు. మీ దృష్టిలో ఆ కుర్రవాడు తమ్ముడులాంటివాడు కావచ్చు. నేనూ నమ్ముతాను. కాని లోకం వేరు. విస్తీర్ణంలో విశాలమైందిగానీ, దాని మనసు బహు ఇరుకైంది. సంకుచిత మైంది. అనుమానాలకు ఆలవాలమైంది. లోకం దృష్టిలో అతను మీ తమ్ముడు కాదు, మీ ప్రియుడు." అంది ప్రిన్సిపాల్ బరువుగా.

సుజాత, సుభాషితలు నిలువునా నిశ్చేష్టులై, ప్రిన్సిపాల్‌కేసి చూసేటప్పటికే, ఆవిడ డ్రాయర్లోంచి ఓ ఎర్రటి కరపత్రాన్ని తీసి వాళ్ళకిచ్చింది.

"ఇంతకుముందే పోస్టులో వచ్చింది. చదువుకుంటే మీ గురించి లోకం ఏమనుకుంటుందో మీకే అర్థమవుతుంది" అంది ప్రిన్సిపాల్.

గబగబా చదివింది సుజాత ఆ కరపత్రాన్ని. ఆమెతోపాటు సుభాషితకూడా చదివింది. దాన్ని చదువుతూన్నప్పుడు మాటమాటకూ ఆ ఇరువురి మొహాల్లో రంగులు మారసాగాయి. నరనరాల్లో నెత్తురు దూకుడుగా ప్రవహించి, మొహాలు కందగడ్డలా తయారై, చివరకు మసిగుడ్డలువలె వ్రేళ్ళాడాయి. ఆ కరపత్రంలో ఇట్లా వుంది.

శీర్షిక : ప్రభుత్వ స్త్రీల కళాశాల అధ్యాపకరాండ్ర అవినీతి కార్యకలాపాలు.

గుంటూరు ప్రభుత్వ స్త్రీల కళాశాలలో సుజాత, సుభాషిత అనే ఇద్దరు లెక్చరర్లు పనిచేస్తున్నారు. వారు అరండేల్‌పేటలో ఓ ఇంట్లో వుంటున్నారు. ఇద్దరూ అందమైనవారు. మంచి వయసులో వున్నారు. ఇద్దరికీ ఇంకా పెళ్ళి కాలేదు. అయితే యేం? వాళ్ళిద్దరూ 'శ్రీకాంత్' అనే బి. కాం. చదివే ఓ యువకుడ్ని ఇంట్లో ఉంచుకొని, తమ తమ ప్రవృత్తిని గుట్టుచప్పుడు కాకుండా తీర్చుకొంటున్నారు. వాళ్ళ కామకేళీవిలాసాలతో ఆ వీధంతా మారుమోగి పోతూన్నది. విద్యార్థినులకు నీతిపాఠాలు బోధించే ఇద్దరు అధ్యాపకురాండ్రు ఇట్లాంటి అవినీతి కార్యకలాపాలను బహిరంగంగా కొనసాగించటాన్ని సమాజం సహించరాదు. ఈ విషయమై అధికారులు వెంటనే చర్య తీసుకోవాల్సిందిగా అర్థించడమైంది.

ఇట్లు
ప్రత్యక్ష సాక్షులు

ఆ ప్రత్యక్ష సాక్షుల పేర్లు లేవు. ఆ కరపత్రాన్ని అచ్చువేసిన ప్రెస్‌పేరు లేదు.

ఆ కరపత్రాన్ని చదివిన మీదట సుజాత, సుభాషితలు శిలాప్రతిమలై

కొన్ని నిముషాలపాటు అక్కడే కూర్చుండిపోయారు. వాళ్ళ మొహాల్లో కలిగిన అలజడినీ, అశాంతినీ, అవమాన జ్వాలనూ చూస్తూ కూర్చుంది ప్రిన్సిపాల్.

"ఆ కరపత్రం బూటకమని తెలుస్తూనేవుంది. ఎవరో మీరంటే గిట్టనివాళ్ళు మిమ్మల్ని బజారుకెక్కించి అపఖ్యాతిపాలు చేయాలని కుట్రపన్ని చేసిన పని. ఏది ఏమైనా పెళ్ళిగానివాళ్ళ పేర్లు ఇట్లా వీధికెక్కడం మంచిదికాదు. పెళ్ళిళ్ళు కావటం కష్టం. ఈ రోజుల్లో నిజాన్ని నిదానంగా ఎవరు చూస్తారు? నలుగురు నోళ్ళలో పడిందే నిజం. అది అభూత కల్పన అయినప్పటికీ. ఇట్లాంటివాటికి అవకాశాన్ని ఇవ్వకుండా జాగ్రత్తగా మసలుకోవాల్సిన అవసరముంది. ఇప్పటికైనా మీరు గ్రహించాలి," అంది ప్రిన్సిపాల్ సలహాగా.

నెత్తురు చుక్కలు ఎండిన మొహాలతో సుజాతా, సుభాషితలు అక్కణ్నుంచి లేచి, బరువుగా స్టాఫ్‌రూం కొచ్చారు.

ఆ స్టాఫ్‌రూంలో ఉన్న అయిదారుమంది లెక్చరర్లవద్ద ఆ ఎర్రటి కరపత్రాలున్నాయి. ఎవరో కుర్రాడువచ్చి ఆ కరపత్రాల్ని పంచిపెట్టి, పరుగెత్తాడట.

కాలేజీలో ఎవ్వరి మొహాన్నీ తలెత్తి చూడలేకపోయారు. వెంటనే మధ్యాహ్నానికి సెలవుచీటీలు వ్రాసి, రిక్షా ఎక్కి ఇంటికి బయలుదేరారు. కొంతమంది విద్యార్థినుల చేతుల్లోకూడా ఆ ఎర్రటి కరపత్రాలున్నాయి. కాలేజీ గేటుమీదనూ, గోడలమీదనూ కూడా ఆ కరపత్రాలు అంటించి ఉన్నాయి.

రిక్షాలో కూర్చుని ఇంటికి వస్తూన్న సుజాత, సుభాషితలు మాట్లాడుకోలేదు. అవజ్ఞా భారంతో వాళ్ళ మనసులు మొద్దుబారిపోయినయ్. ఆలోచనా యంత్రాంగం పనిచేయడం మానేసింది; ప్రపంచమంతా కక్షబూని కబళించ టానికి కరాళహస్తాలతో తమ వెంటబడుతూన్నట్లుంది.

ఇంటికి రాగానే ఇద్దరూ చెరో మంచంమీద జేరి, ముసుగులుపెట్టుకొని, పసి పిల్లల్లా ఏడ్వసాగారు.

## 10

ఇట్లా ఎందుకు జరిగింది ?

ఎవరిది తప్పు ?

ఈ అపవాదును ఎవరు పుట్టించారు ? అంత అవసరం ఎవరికి కలిగింది ? అందువల్ల వాళ్ళకు వచ్చే లాభమేమిటి ?

తమపై ఇంత కక్ష ఎవరికుంది ?

తమని అపఖ్యాతిపాలు చేయాల్సిన అగత్యం ఎవరికుంది ?

తమని ప్రత్యక్షంగా ఎవరూ ప్రేమించలేదు. ఎవరూ తమకు ప్రేమలేఖలు వ్రాసి, తమపై ఏకపక్ష ప్రేమను వెల్లడించలేదు.

రిక్షా యాక్సిడెంట్లకూ, అర్ధరాత్రివేళ దొంగ ఇంట్లో ప్రవేశించడానికి ప్రయత్నించడానికీ, ఈ కరపత్రాలకూ సంబంధమేమైనా వుందా ? వీటన్నింటి వెనుక అదృశ్య హస్తం ఒకరిదేనా ? ఎవరతను ?

తాము ఏ మగవాడ్ని కవ్వించలేదు. ఎగతాళి చేయలేదు. చివరకు కన్నెత్తి కూడా చూడలేదు. తమపై ఇంత పగ, శత్రుత్వం ఎవరికుంది ? ఎందుకుంది ?

శ్రీకాంత్ అమాయకుడు. అతగాడ్ని తమ్ముడిలా చూసుకోవటంలో తప్పు లేదు అతనూ తమని అక్కయ్యల్లాగే చూసుకుంటున్నాడు. అతని ప్రవర్తనలో ఆక్షేపించదగింది రవ్వంతలేదు. తమ అనుబంధంలోని పవిత్రతను లోకం శంకించిందంటే, తప్పు పట్టిందంటే, అవినీతి ముద్ర వేసిందంటే-దానికి తాము బాధ్యులా?

ఛి. ఛీ ఎంత ఘోరం! యువతీ, యువకుల మధ్య అక్కా, తమ్ముళ్ళ సంబంధాన్ని గుర్తించలేని ఈ లోకం ఎంత దైన్యస్థితికి దిగజారింది. లేనిపోని అవినీతి సంబంధాన్ని అంటగట్టటానికి కించింత్ కూడా వెనకాడనట్టుంది.

ఏంచేయాలి ?

ఈ క్లిష్టపరిస్థితుల్లో తమ కర్తవ్యమేమిటి ?

ఈ అపవాదులకు అవకాశాన్ని కల్పించిన తాము ఈ దుష్ఫలితాన్ని అనుభవించవల్సిందేనా? నేరం చేయని ఈ శిక్షను శిరసావహించవల్సిందేనా?

ఈ ఘోరం సంగతి తెలిస్తే శ్రీకాంత్ ఏమౌతాడు? విపరీతమైన ఆవేశంతో ఏ అఘాయిత్యానికి పూనుకున్నా ఆశ్చర్యపడక్కర్లేదు. అసలు అతన్ని ఇంట్లో వుంచుకోవడంవల్లనే ఈ అనర్థం వొచ్చింది. తాము అప్పుడు ఇంతదూరం ఆలోచించలేదు. పరిస్థితులు ఇంతగా విషమించే అవకాశముందని అనుకోలేదు. అక్కడికీ స్వరూప హెచ్చరించింది. అయినా తాము అభిమానంతో, వాత్సల్యంతో, స్నేహితురాలిమీద గౌరవంతో శ్రీకాంత్‌ను ఇంట్లో పెట్టుకోంటా మనే ఖచ్చితంగా చెప్పడం జరిగింది.

ఇప్పుడేం చేయాలి?

ఈ అపవాదు, అప్రదిష్ట, చెడ్డపేరు మాసిపోవటం ఎట్లా ?

లోకానికి నిజాన్ని ఎట్లా చాటి చెప్పాలి ?

—దాదాపు ఆ విధంగా సుజాత, సుభాషితలు సాయంత్రం మూడున్నరదాకా తలలు పట్టుకొని తీవ్రంగా ఆలోచిస్తూనేవున్నారు. కాని మార్గం దొరకలేదు. ఆలోచించుకున్నకొద్దీ దుఃఖం ఎక్కువవుతూన్నదిగానీ, ఉపశమనం ఏ మాత్రం లభించడంలేదు.

మూడున్నరకు నాగరత్నమ్మ యిచ్చిన వేడి వేడి కాఫీ త్రాగారు ఇద్దరూ.

"ఇంత దారుణం జరుగుతుందని అనుకోలేదే!" అంది సుభాషిత ఉబ్బిన కళ్ళతో.

"ఏం చేద్దాం? మనం నిర్దోషులం. ఆ సంగతి మన ఆత్మలకు తెలుసు. మనపై ఇంత ఘోరమైన నిందవేసి, అపఖ్యాతిపాలు చేసినవాళ్ళు అంతకంతకూ అనుభవించకపోతారా ?" అంది సుజాత తీరని కసితో.

"అది తర్వాత సంగతి. ముందు ఈ అపవాదును ఎదుర్కొనే మార్గం చెప్పు. చేయని తప్పుకు ఇంత పెద్ద శిక్ష పడితే ఎట్లా భరించడం? రేపు కాలేజీకి ఎట్లా వెళ్ళడం? అందరూ మనవంక అదోరకంగా చూస్తారే! ఆ చూపుల్ని ఎట్లా భరించడం?" అంది సుభాషిత.

అంతలో ఇంటిముందు సైకిలు రిక్షా ఆగిన చప్పుడైంది. ఆ రిక్షాలోంచి నారాయణమూర్తి దిగాడు. నేరుగా ఇంట్లోకి వచ్చాడు.

అల్లకల్లోలంగా వున్న సుజాత మనసు మరీ భీభత్సమైంది. తండ్రి ఒకవేళ కాలేజీకి వెళ్ళాడేమో, అక్కడ గోడలమీదున్న కరపత్రాల్ని చూశాడేమోనన్న భయం ఆమె వూపిర్ని పట్టేసింది.

"అప్పుడే కాలేజీనుంచి ఇంటికొచ్చావా ?" అన్నాడు నారాయణమూర్తి కూతుర్ని. ఆయన మాటల దూకుడూ, ధోరణీ చూడగా సుజాతకు మూడొంతులు ప్రాణాలు ఎగిరిపోయాయి.

"వర్క్ అయిపోతే ముందుగా ఇంటికొచ్చాం" అంది సుభాషిత.

హాలులో కుర్చీలో తాపీగా కూర్చున్నాడు నారాయణమూర్తి. సుజాత, సుభాషితలవంక పరిశీలనగా చూశాడు. దుఃఖోద్విగ్నతచేత మొహాలు ఉబ్బినట్టుగా వున్నాయి. అయినా వాళ్ళు ఆ దుఃఖాన్ని కనబడనీయకుండా ఉషారుగా వుండటానికి ప్రయత్నించసాగారు. అయినా ఆయన కనిపెట్టాడు.

"ఏమిటి ! మీ ఇద్దరి మొహాలు అట్లా వున్నాయి ? ఏం జరిగింది ?"

"ఎట్లా వున్నాయి? మామూలుగానే వున్నాయ్! నిద్రబోయి లేచాం. అంతే!" అంది సుజాత.

ఓ నిముషంపాటు నిశ్శబ్దంగా ఉన్నాడు నారాయణమూర్తి.

నాగరత్నమ్మ ఆయనకు కాఫీ తెచ్చి ఇచ్చింది. ఆ కాఫీ త్రాగాక...

"వాడింకా ఇంట్లోనే ఉంటున్నాడా?" అన్నాడు నారాయణమూర్తి ఆగ్రహావేశాన్ని కనబరుస్తూ. వాడంటే 'శ్రీకాంత్' అని ఆయన ఉద్దేశం.

"ఎవరూ! శ్రీకాంతా ?" అంది సుభాషిత.

"ఆఁ!...ఆ ప్రబుద్ధుడే!" అన్నాడు నారాయణమూర్తి కసిగా.

"ఊఁ!" అంది సుభాషిత. ఆ మాట అనటానికి సుభాషితకు ధైర్యం చాలలేదు.

"మీకు బుద్ధీ, జ్ఞానం లేదమ్మా ! పెళ్ళి కావాల్సినవాళ్ళు ఎదిగిన కుర్రాణ్ణి ఇంట్లో పెట్టుకుంటారా? లోకం ఏమనుకుంటుంది? లోకం అనుకునేదానికి మీరు చెప్పే సంజాయిషీ ఏమిటి? అదేమంటే తమ్ముడులాంటి వారంటారు. మీరు అంటేనూ, అనుకుంటేనూ సరిపోతుందా? స్నేహాలకుకూడా కొన్ని హద్దులుండాలి. ఔచిత్యాలుండాలి. వాడు మీకు తోడబుట్టినవాడా ? లోకానికి నమ్మాల్సిన అవసరమేముంది? వాడివల్లనే బంగారంలాంటి సంబంధం చెడిపోయింది" అన్నాడు నారాయణమూర్తి ఉద్విగ్నచిత్తుడై.

సుజాతా, సుభాషితలు నిర్విణ్ణులై, నిల్చున్నపాటుగా శిలాప్రతిమలైపోయారు.

సంబంధం ఎట్లా చెడిపోయిందోకూడా నారాయణమూర్తి చెప్పాడు.

"అంతా బాగానే వుందిగానీ, పిల్ల ప్రవర్తన సరైంది కాదని తెల్సిందట. ఇంట్లో బి. కాం. చదివే కుర్రాడ్ని పెట్టుకుని కులుకుతూందని ఎవరో ఆకాశ రామన్న లేఖద్వారా తెలయజేశారట! అతగాడు నమ్మాడు. నమ్మటంలో తప్పేముంది? ప్రత్యక్షంగా ఆ రోజు శ్రీకాంత్‌ను చూశాడుగా! పైపెచ్చు వాడి ప్రవర్తన ఆకతాయిగా కనబడి వుంటుంది" అన్నాడు నారాయణమూర్తి.

సుజాతలో దుఃఖం పొంగి పొర్లింది. కళ్ళవెంట ఉబికే కన్నీటిని చాటుగా పైటకొంగుతో నొక్కిపెట్టింది. ఆమెకేసి చూసిన సుభాషిత మనస్సు సానుభూతితో ఆర్ద్రమైంది. ఇద్దరూ నోరు విప్పలేకపోయారు.

"నేను పెద్దవాడ్ని. లోకానుభవంతో వెంట్రుకలు నెరిసినవాడ్ని. మొదట్నుంచీ నా కిష్టంలేదు–వాడు ఈ ఇంట్లో మీతో ఉండటం! స్నేహాలు వేరు, అభిమానాలు వేరు. ప్రేమలు వేరు, బాధ్యతలు వేరు. ఏం పని చేసినా లోకాన్ని ఓ కంట కనిపెట్టి చేయాలి. అందులో పెళ్ళిగాని ఆడవాళ్ళు ఒకచోట వుంటూన్నప్పుడు–పరిసరాల్ని గమనించి, మరీ మసలుకోవాలి. ఇతరులు ఆక్షేపించడానికి అవ




-గింజంతకూడా అవకాశాన్ని ఇవ్వరాదు. శ్రీకాంత్ మీ ఇంట్లో లేడనుకోండి. మిమ్మల్ని ఎవరు వేలెత్తి చూపుతారు ? వాడు ఇంట్లో ఉన్నంతకాలమూ మీ చుట్టూ పొగ కమ్ముకొనే వుంటుంది. ఆ పొగ మీ బ్రతుకులకు మసిపట్టిస్తుంది. ఇప్పటికైనా గ్రహించి వాడ్ని వెంటనే ఇంట్లోంచి వెళ్ళగొట్టండి. రేపే మరో చోట రూమ్ చూసుకొని అందులోకి మారమని చెప్పండి" అన్నాడు నారాయణ మూర్తి గట్టిగా.

సుజాత, సుభాషితలు మౌనంగా వుండిపోయారు. వాళ్ళ మనస్సుల్లో ఒక ప్రక్కన ప్రళయ భీకర సంఘర్షణ; మరో పక్క తీవ్రాతి తీవ్రమైన దుఃఖాగ్ని జ్వాలలు. రెండింటికీ తట్టుకోలేక ఏ పొటాషియమ్ సైనైడో పుచ్చుకొని క్షణాల మీద చనిపోతే ఎంత బావుండు? అనుకొనే దుస్థితికి వచ్చారు.

నారాయణమూర్తి లేచివెళుతూ చివరగా కూతురితో అన్నాడు.

"ఇదిగో! సుజా! నేను మళ్ళీ నాలుగైదురోజుల్లో వస్తాను. నేను వచ్చేసరికి వాడు ఈ కొంపలో వున్నాడంటే వూరుకొనేదిలేదు. మళ్ళీ నీ మొహం చూడను. నీకు పెళ్ళి సంబంధాలు చూడడం వృధా. నీ కర్మకు నిన్నే వదిలేస్తాను. నా మాట వినని కూతురుకోసం నేను నానా అగచాట్లూ పడటం దేనికి?"

## 11

ఆఖరి పిరియడ్ అయిదుగంటలకుగానీ అయిపోదు. టైం టేబుల్‌నుంచి ఆఖరి పిరియడ్‌ను తీసివేస్తే బావుంటుందని అటు విద్యార్థులూ, ఇటు లెక్చరర్లూ

అనుక్షోవడంలో ఆశ్చర్యమేమీ లేదు. కాని నిబంధనల ప్రకారం ఆ పిరియడ్‌కు భరతవాక్యం పలకటానికి వీల్లేదు. ఆఖరి పిరియడ్ తీసుకోకుండా క్లాసు వొదిలేసే లెక్చరర్లంటే విద్యార్థులకు అభిమానం జాస్తి. కాని ఆ అభిమానాన్ని అందరు లెక్చరర్లు పొందలేరు. ప్రిన్సిపాల్ లేనప్పుడు కొంతమంది లెక్చరర్లు ఆఖరి పిరియడ్‌ను వొదిలివేస్తూ వుంటారు. దానికి మరికొంత ధైర్యం కావాలి.

ఆ రోజు ఆఖరి పిరియడ్ వాణిజ్య భూగోళశాస్త్రం. వరి పుట్టు పూర్వోత్తరాలు; దాని పెరుగుదలకు అవసరమైన శీతోష్ణస్థితి, వర్షపాతం, భూసారం, ఇతరత్రా అనుకూల పరిస్థితులు; వరి ఏయే దేశాలలో విరివిగా పండుతుంది; భారత దేశంలో ఎక్కడెక్కడ పండుతుంది; ఏయే దేశాలు బియ్యాన్ని ఎగుమతి చేస్తాయి; ఏయే దేశాలు బియ్యాన్ని దిగుమతి చేసుకుంటాయి; భారతదేశంలో వరి ఉత్పత్తి వివరాలు మొదలైనవాటిని గురించి లెక్చరర్ చెబుతూంటే, క్లాసులోని విద్యార్థులంతా పరమబోర్ ఫీలయి చేతి గడియారాలకేసి చూడ సాగారు. శ్రీకాంత్‌కూడా చేతి గడియారంకేసి చూసుకున్నాడు. ఇంకా మూడు నిముషాల టైమ్ వుంది పిరియడ్ అయిపోవటానికి. లెక్చరర్ పాఠం ఆపుచేశాడు.

ఇద్దరు స్టూడెంట్స్ లేచారు.

"అదేమిటోయ్! ఇంకా బెల్ కాలేదు" అన్నాడు లెక్చరర్.

"అయింది సార్. మనరూమ్‌కి సరీగ్గా బెల్ వినపడదు. పక్క రూమ్‌లో వాళ్ళు ఎప్పుడో వెళ్ళిపోయారు సార్!" అన్నాడో స్టూడెంట్.

లెక్చరర్ తబ్బిబ్బయ్యాడు. తన వాచీకేసి చూసుకున్నాడు. అయిదూ ఎనిమిదైంది. కాలేజీకి ఎప్పుడూ లేటుగా రాకూడదనే సిద్ధాంతరీత్యా ఎప్పుడూ పదినిముషాలు టైం ముందుపెట్టే అలవాటు.

స్టూడెంట్స్ లేచారు. గతిలేక లెక్చరర్ కూడా లేచాడు.

రూమ్ బయటికి వచ్చేసరికి బెల్ అయింది.

రూమ్ బయటికి వచ్చీరాగానే శ్రీకాంత్‌కు ఎవరో కుర్రాడు ఓ కవరు ఇచ్చి, స్టూడెంట్స్‌తో కలిసి వెళ్ళిపోయాడు. ఆ కుర్రాడ్ని లీలగా చూశాడు. పద్నాలుగేళ్ళు ఉంటాయేమో! ఖాకీ నిక్కరుమీద, ఎర్రచారల చొక్కా వేసుకున్నాడు. నుదుర్ని కప్పివేసే జుత్తు. క్షవరం చేయించుకొని ఎన్ని మాసాలైందో!

"ఏమిటో యిది" అని శ్రీకాంత్ అంటూవుండగానే ఆ కుర్రాడూ స్టూడెంట్స్‌లో కలిసిపోయాడు.

ఆ కవరు చించగా ఓ ఎర్రటి కరపత్రం ఉంది. గబగబా చదువు కున్నాడు శ్రీకాంత్. వొళ్ళంతా కుతకుత వొణికిపోయింది. కోపావేశంతో వూగిపోయాడు.

తనకీ, అక్కయ్యలకూ అక్రమ సంబంధాన్ని ఆపాదిస్తూ వేసిన కరపత్రమది ! ఆ కుర్రవాడికోసం చూశాడు శ్రీకాంత్. గబగబా మెట్లు దిగి వచ్చాడు. గేటు బయట సైకిలుమీద పోతూ కనబడ్డాడు ఆ కుర్రాడు. వెంటనే శ్రీకాంత్ షెడ్డులోకి వెళ్ళి, తన సైకిల్ను తీసుకొని వేగంగా రోడ్డు మీదకొచ్చాడు. ఆ కుర్రాడు మాయమయ్యాడు.

శ్రీకాంత్‌కు పిచ్చెక్కినట్లయింది. వొళ్ళంతా వేడెక్కింది. నరనరాల్లో రక్తం చిమ్ముతోంది. కళ్ళు ఎర్రబాడ్డాయి. కాళ్ళు బలహీనమయ్యాయి. మనస్సంతా మండిపోతోంది. ఆగ్రహానికి హద్దులు లేకుండా పోతున్నాయి. ఆ కుర్రవాడ్ని పట్టుకొని ఆ చెంపా ఈ చెంపా వాయించి, ఆ కరపత్రాన్ని వేసినవాళ్ళ ఆమాకీ తీద్దామనుకున్నాడు.

జిన్నా టవర్ కేసి సైకిలు పోనిచ్చాడు. జనంలో, ట్రాఫిక్‌లో ఆ కుర్రవాడు ఎటు వెళ్లాడో అంతుబట్టలేదు. సైకిలుమీద వీధి వీధీ పిచ్చిబట్టినట్టు తిరిగాడు. కాని ఆ కుర్రవాని జాడ దొరకలేదు.

ఆ కరపత్రాన్ని ఎవరు వేశారు ?

ఎందుకేశారు ?

అక్కయ్యలను అపఖ్యాతిపాలు చేస్తే వాళ్ళకు వొరిగేదేముంది ?

తనకీ, అక్కయ్యలకూ ఎంత దారుణమైన, ఘోరమైన సంబంధాన్ని అంటగట్టారు ? తను కలలోకూడా ఊహించలేదే !

ఈ కరపత్రం సంగతి అక్కయ్యలకు తెలిసివుంటుందా ? తెలిస్తే ఎంత బాధపడతారు ?

దీనికి కారకకులైనవాళ్ళను నాశనం చేయాల్సిందే ! అప్పుడుగానీ తన కోపం సద్దుమణగదు; తనకు మనశ్శాంతి కలగదు.

— ఆ విధంగా ఆలోచిస్తూ శ్రీధర్ రూమ్ కెళ్ళాడు శ్రీకాంత్. అతనికి కరపత్రాన్ని చూపెట్టాడు.

ఎంత అన్యాయంరా ? నిప్పులాంటి నీమీదే దుర్మార్గులు అవినీతి బురదను పులిమారు. వాళ్లను ఏం చేస్తే పాపముంది ?" అన్నాడు శ్రీధర్.

"ఈ దుర్మార్గం చేయించిన వాళ్ళను ప్రాణాలతో వొదలను" అన్నాడు శ్రీకాంత్ గర్జిస్తూ.

ఇద్దరూ కలిసి సైకిళ్ళమీద భావనారాయణ దగ్గరకు వెళ్ళారు. అప్పుడే భావనారాయణ స్నానంచేసి, విప్లవ కవులు వ్రాసిన గేయాలను చదువుతున్నాడు. శ్రీకాంత్ ఆ కరపత్రాన్ని భావనారాయణకు చూపెట్టాడు. ఆ కరపత్రాన్ని చివరిదాకా చదివాడతను. ఓ నిట్టూర్పు విడిచాడు.

"ఏంచేద్దాంరా ?" అన్నాడు శ్రీధర్.

శ్రీకాంత్ మొహం గంభీరాతి గంభీరంగా ఉంది. కోపోద్రేకాలు కరడుగట్టి మొహాన్ని రాయిలా మార్చాయి.

"అన్యాయం జరిగిపోయింది. ఇప్పుడు అఘోరించి లాభమేముంది ? పాపం, అమాయకులైన మీ అక్కయ్యలపై అంతులేని అపవాదు పడింది. ఈ అపవాదు వాళ్ళ జీవితాలకు మాయని మచ్చ" అన్నాడు భావనారాయణ తన సానుభూతిని తెలుపుతూ.

"కర్తవ్యం బోధించరా !" అన్నాడు శ్రీధర్.

"కర్తవ్య మేముంది ? ఈ అపవాదు రూపుమాపలేనిది. కరపత్రంలోకి ఎక్కిందంటే ఎంతమంది కళ్ళబడుతుందో చెప్పలేం. దీనికి కారకులైన వాళ్ళెవరో తెల్సుకుని మాత్రం చేసేదేముంది ?" అన్నాడు భావనారాయణ.

"అంతేనా ?" అన్నాడు శ్రీకాంత్ సెగలు కక్కే కసితో.

"ఒక్క సలహా యిస్తాను. వింటావా ?" అన్నాడు భావనారాయణ సీరియస్‌గా.

"చెప్పు" అన్నాడు శ్రీధర్.

"ఏమిటా సలహా ?" అన్నాడు శ్రీకాంత్.

"వెంటనే నువ్వు ఆ యింట్లోంచి బయటకు రా. నా రూమ్‌లో వచ్చి వుండు. నీవల్ల వాళ్లకు అపఖ్యాతీ, ఇబ్బందీ, కష్టాలూ కలక్కుండా చూడు" అన్నాడు భావనారాయణ.

స్నేహితుని సలహాకు స్టన్ అయ్యాడు శ్రీకాంత్. అట్లాంటి సలహాను అతను ఆశించలేదు. తల అడ్డంగా తిప్పాడు.

"నేను ఆ యింట్లోనే వుంటాను. అంత పిరికివాడ్ని కాదు. మా మధ్య నిజమైన అక్కా తమ్ముడి సంబంధ ముందనీ, కొంతమంది దుర్మార్గులు దాన్ని

అవినీతి చర్యగా మార్చారనీ లోకానికి తెల్సివచ్చేటట్లు చేయడమే నా కర్తవ్యం. నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవాల్సిన బాధ్యత నా పైనుంది" అన్నాడు శ్రీకాంత్ దృఢంగా.

"నా అభిప్రాయం చెప్పాను. ఆ తర్వాత నీ యిష్టంరా" అన్నాడు బాపనారాయణ చివరగా.

అతని అభిప్రాయమూ, సలహా నచ్చకపోగా శ్రీకాంత్ సైకిలెక్కి ఇంటికి బయలుదేరాడు. అతనితోపాటు బయలుదేరిన శ్రీధర్ నాజ్ థియేటర్ వద్ద ఆగిపోయాడు.

* * *

ఆలోచనలతో బుర్ర ఇనుపకొలిమిలా వుంది. ధ్యాసంతా ఆ కరపత్రం మీదా, దాన్ని అందించిన కుర్రవాడిమీదా వుంది. సైకిలు తొక్కుతున్నాడు శ్రీకాంత్.

సాయంత్రం ఎర్రగా నెత్తురు రంగులో ఉంది. సూర్యుడు అస్తమించటానికి సిద్ధంగా ఉన్నాడు.

సైకిలు తొక్కుకుంటూ అరండేల్ పేటకు వచ్చాడు శ్రీకాంత్. దారి పొడవునా ఆ కుర్రవాడికోసం అతని కళ్లు గాలిస్తూనే వున్నాయి. వాడెక్కడ కనబడితే అక్కడే వాడ్ని పాతేద్దామన్న అతని కోపం వీసమెత్తు తగ్గలేదు.

శ్రీకాంత్ అదృష్టమో మరి దురదృష్టమో ఆ కుర్రవాడు అరండేల్ పేటలో కట్టెల దుకాణం దగ్గర కనబడ్డాడు. అంతదూరంలో కనిపెట్టాడు శ్రీకాంత్. వాడే! ఆ జుత్తూ, కాకీ నిక్కరూ, ఎర్రచారల చొక్కా? ఆ కుర్రవాడు ఒక పక్కగా తిరిగి ఐస్‌క్రీమ్ కాండిల్ స్టిక్ చీకుతున్నాడు. మెల్లగా సైకిలు దిగి, స్టాండ్ వేసి, చప్పుడుకాకుండా ఆ కుర్రవాడి మెడ పట్టుకున్నాడు శ్రీకాంత్.

శ్రీకాంత్‌ను చూడటంతోటే వాడి ప్రాణాలు గాలిలో కల్సినంత పనైంది. నోట్లోవున్న ఐస్‌క్రీమ్ కాండిల్‌స్టిక్ జారి నేలమీద పడింది. గజగజ వొణికి పోయాడు.

"నువ్వేనట్రా ఆ కరపత్రాన్ని ఇచ్చింది" అన్నాడు శ్రీకాంత్ వొళ్ళు తెలీని కోపంతో.

ఆ కుర్రావాడు భయోత్పాతంతో 'ఊఁ' 'ఆఁ!' అంటూ నీళ్ళు నమిలాడు.

"ఎవరిమ్మన్నారు ఆ కరపత్రాన్ని ?" గర్జించాడు శ్రీకాంత్.

వాడు చెప్పలేదు.

"చెబుతావా ? చెంప ఛెళ్లు మనిపించమంటావా ?" శ్రీకాంత్ కేకలకు వాడు భయపడుతున్నాడుగానీ, నోరు విప్పటంలేదు.

"నిన్నే !"

"చెబుతావా ? వీపు చీరెయ్యమంటావా ?"

వాడి మౌనానికి శ్రీకాంత్‌కు వొళ్ళు మండింది. నాలుగు తగిలిస్తేగానీ నిజం చెప్పడని, చెంపమీద ఒక్కటి వేశాడు శ్రీకాంత్.

ఆ కుర్రాడు కెవ్వున కేక బెట్టాడు. ఆ కేకకు రోడ్డుమీద పోయేవాళ్ళు ఇద్దరు ముగ్గురు అక్కడ కొచ్చారు. జనం మూగితే, తాను నిజం చెప్పించటం అసాధ్యమని భావించి, ఆ కుర్రాడ్ని బలవంతాన లాక్కెళ్ళి సైకిలుమీద కూర్చుండబెట్టి, ఇంటికి తీసుకెళ్ళాడు శ్రీకాంత్.

అప్పటికి సాంతం ప్రొద్దు గ్రుంకింది

ఆ కుర్రవాడ్ని ఇంట్లోకిలాక్కురావటాన్ని చూసిన సుజాత, సుభాషితలు తెల్లబోయారు. ఎవరా కుర్రాడు? అతన్ని శ్రీకాంత్ ఎందుకట్లా యీడ్చు కొస్తున్నాడు ? – వాళ్ళకు అర్థంకాలేదు.

ఆ కుర్రాడ్ని గదిలోకి తీసుకెళ్ళి గది తలుపులు గడియపెట్టాడు.

"ఇప్పుడు చెప్పు. ఆ కరపత్రాన్ని నిన్నెవ్వరు ఇవ్వమన్నారు ?" గర్జించాడు శ్రీకాంత్.

వాడు నోరు విప్పలేదు. భయంతో వొణికిపోతున్నాడు.

"నిజం చెప్పావంటే నిన్ను కొట్టను. చెప్పకపోయావో నీ రక్తం కళ్ళ జూస్తాను" అన్నాడు శ్రీకాంత్ ప్యాంట్ బెల్టు బయటికితీస్తూ.

ఆ కుర్రవాడు పట్టుదలగా నోరు విప్పలేదు. ఆ పట్టుదల చూసేసరికి శ్రీకాంత్‌కు పిచ్చికోపం వొచ్చింది. ఆ బెల్టుతో రెండు తగిలించాడు.

కుర్రవాడు దెబ్బలకు వోర్చుకోలేక గొంతు విప్పాడు. గది దద్దరిల్లిపోయేట్టు కేకలు, పెడబొబ్బలు.

బయటనుంచి సుజాత, సుభాషితలు తలుపు బాదుతున్నారు.

"శ్రీకాంత్ !... శ్రీకాంత్ ! ఆ కుర్రాడ్ని విడిచిపెట్టు...కొట్టకు...కొట్టకు ...శ్రీకాంత్ !.. శ్రీకాంత్ !"

కుర్రవాడిచేత నిజం చెప్పించాలనే పట్టుదలతో, నిశ్చయంతోవున్న శ్రీకాంత్‌కు వాళ్ళ మాటలు, తలుపు కొట్టడాలు వినిపించలేదు.




అయిదు నిముషాలు గడిచాయి.

గదిలోపల బెల్టు దెబ్బలు, కుర్రవాడి ఏడ్పు. మధ్య మధ్యలో కేకలు.

ఇరుగూ పొరుగూ ఇళ్ళనుంచి ఆ కేకలు విని ఇద్దరు ముగ్గురు వచ్చారు. ఏమిటేమిటని అడుగుతున్నారు. సుజాత, సుభాషితలు తలుపులు బాదుతూనే వున్నారు.

హఠాత్తుగా లోపలనుంచి కుర్రవాడి ఏడుపు ఆగిపోయింది.

ఖర్మంచాలక వాడు చచ్చాడేమోనని సుజాత, సుభాషితలు భయపడ్డారు.

దెబ్బలకు వోర్చుకోలేక కుర్రవాడు నిజం చెప్పేశాడు.

ఆ కరపత్రాల్ని పంచమని యిచ్చింది ఎదురింటి పూర్ణచంద్ అట. పంచి నందుకు పాతిక రూపాయలు బహుమతి యిచ్చాడట.

ఆ సంగతి విన్న శ్రీకాంత్ ఓ నిమిషంపాటు నిర్విణ్ణుడయ్యాడు. నెమ్మదిమీద ఆ కుర్రవాడి మాటలు యదార్థంగా తోచాయి శ్రీకాంత్‌కు.

గది తలుపులు తెరిచాడు శ్రీకాంత్.

ఆ కుర్రవాడికి జేబులోంచి తీసి అయిదురూపాయలు ఇచ్చాడు. బెల్టు దెబ్బలతో అక్కడక్కడా వాడి మొహం పొంగింది. మెడమీద కొద్దిగా రక్తం కారుతోంది చొక్కా, నిక్కరూ వుండటంవల్ల వొంటిమీద గాయాలు కనబడటం లేదు. అయినప్పటికీ అయిదురూపాయలు శ్రీకాంత్ ఇవ్వడంతో ఆ దెబ్బలన్నింటినీ మరిచిపోయాడు. చిరునవ్వు మొహంతో గదిబయటపడి, మామూలుగా నడిచి వెళ్ళాడు. ఇరుగూ పొరుగూ వాళ్లు ఏం మాట్లాడకుండానే వెళ్ళిపోయారు.

ఆ కుర్రవాడ్ని గొడ్డును బాదినట్టు బాదినందుకు ఆ కుర్రవాడి తల్లిదండ్రులు ఇంటిమీదకొచ్చి ఏం గొడవ చేస్తారోనని సుజాత, సుభాషితలు భయపడ్డారు. వాళ్ళకు శ్రీకాంత్‌మీద బాగా కోపమొచ్చింది.

"శ్రీకాంత్! నీ ప్రవర్తన ఏం బాగుండలేదు. ఇప్పటికే మా పరువుప్రతిష్ఠల్ని వీధిపాలు చేశావు. పైగా ఈ హింసాకాండ. దీని పర్యవసాన మేమిటో! ఆ కుర్రవాడి తల్లిదండ్రులు ఇంటిమీదకు దండెత్తివస్తే!" అంది సుజాత కోపంతో.

"శ్రీకాంత్! మమ్మల్ని ప్రశాంతంగా బ్రతకనిచ్చేట్టులేవు. ఈ దౌర్జన్య మేమిటి? కుర్రవాడ్ని ఇంట్లోకి లాక్కొచ్చి కొట్టడమేమిటి?" అంది సుభాషిత అంతకంటే కోపంగా.

కుర్రవాడు చెప్పిన విషయానికే శ్రీకాంత్ నిశ్చేష్టుడై వున్నాడు. పైపెచ్చు అక్కయ్యల ఆగ్రహం. ఎన్నడూ తనని అనని మాటలు అనడం. శ్రీకాంత్ తల గిర్రున తిరిగింది.

"ఆ కరపత్రాల్ని పంచింది ఆ కుర్రాడే అక్కా! వాడిచేత నిజం కక్కించాను. ఆ కరపత్రాలు వేయించింది ఎవరో తెల్సిపోయింది" అన్నాడు శ్రీకాంత్ ఆవేశాన్ని అణుచుకోవటానికి ప్రయత్నిస్తూ.

"కరపత్రాలు ఎవరు వేస్తేనేం, ఎవరు పంచితేనేం. మేం బజారుకెక్కాం. మా బ్రతుకుల్లో మాయనిమచ్చ పడింది. దాన్ని నువ్వు తొలిగించగలవా, శ్రీకాంత్ !" అంది సుభాషిత.

"నేనేం చేశానక్కా ! నేను ఇన్నోసెంట్‌ని. నిర్దోషిని. నేనేం తప్పు చేయలేదు" అన్నాడు శ్రీకాంత్ ఆవేశంతో కూడిన అమాయకత్వంతో.

"నువ్వేం తప్పుచేయలేదు. మేమూ ఏం తప్పుచేయలేదు. ముల్లువచ్చి అరిటాకుమీద పడింది. మేం చేసుకున్న ఖర్మ. దీనికి ఎవరూ బాధ్యులుకారు. స్వరూప మీదగల ప్రేమాభిమానాలతో, ఆమెతోగల సన్నిహిత స్నేహంతో నిన్ను ఇంట్లో పెట్టుకున్నాం. ఊహించని పరిణామాలు ఏర్పడ్డాయి. పరిస్థితులు దుర్భరంగా మారాయి. ఇక నువ్వు మాతో ఈ ఇంట్లో వుండటం మంచిదికాదు. ఎక్కడేనా రూమ్ చూసుకొని రేపే మరో చోటుకు వెళ్ళిపో !" అంది సుజాత మనస్సు రాయిచేసుకుని. ఆ నిర్ణయానికి రావటానికి ఆమె చాలా ఆలోచించింది; ఎంతోసేపు సంఘర్షణకు లోనైంది.

"అక్కా ! ఇది అన్యాయం. ఎవరో ఏదో కుట్రపన్ని చేసిందానికి నన్ను శిక్షిస్తారా ? నేను ఎటువంటివాణ్ణో మీకు తెలుసు. నేను ఏ బంధుత్వంతో, బాంధవ్యంతో మిమ్మల్ని ఆరాధిస్తున్నానో మీకు తెలుసు" అన్నాడు శ్రీకాంత్. అతని గొంతులో ఆవేశం స్థానే ఆవేదన తొంగిచూస్తోంది.

"మాకు తెలుసు శ్రీకాంత్ నిన్ను ఇంట్లోంచి పంపెయ్యాలని మాకు ఏ కోశానా లేదు. కాని పరిస్థితులు అట్లా విషమించాయి. సుజాత పెళ్ళి తప్పిపోయింది. ఎందుకో తెలుసా ! నీ వల్లనే. నిన్ను ఇంట్లో వుంచుకోవడం వల్లనే. ఎవరో ఏదో చెప్పారు. కృష్ణప్రసాద్ మనస్సు విరిగిపోయింది. పెళ్లికి ఒప్పుకోలేదు. నీ వంటే నారాయణమూర్తిగారికి మహా కోపంగా వుంది. నువ్వు ఈ ఇంట్లోవుంటే మళ్ళీ ఈ ఇంటి గడప తొక్కనన్నారు. చెప్పు. నీ కోసం సుజాత కన్నతండ్రిని వొదులుకుంటుందా ? మాపై నీకు నిజంగా అభిమానం, ఆప్యాయత వుంటే, మమల్ని అక్షరాలా అక్కలుగా భావిస్తుంటే, ఈ ఇంట్లోంచి తక్షణం వెళ్ళిపో !" అంది సుభాషిత గట్టిగా.

శ్రీకాంత్ నిలువునా నీరు కారిపోయాడు. అందరూ తనమీద కుట్ర పన్ని, తనని వెలివేయటానికి చూస్తూన్నట్టు కనబడుతోంది. తాను అక్కల్ని ఎంతో పవిత్రంగా ఆరాధించాడు. అందరితోపాటు వాళ్ళు తనని అపార్థం చేసుకుంటు న్నారు. అంతేగాదు ఇంట్లోంచి వెళ్ళిపొమ్మంటున్నారు. తాను ఎవరి కోసం

ఆదుర్దాపడ్డాడో, అలజడి పొందాడో, ఎవరి క్షేమంకోసం, రక్షణకోసం తాపత్రయపడ్డాడో వాళ్లే ఈనాడు తనని గుర్తించలేదు. ఇది వాళ్ళ తప్పుకాదు. వాళ్ళల్లో ధైర్యంలేదు. పరిస్థితులను ఎదుర్కొనే ధైర్యంలేదు.

"అక్కయ్యా! నేను మిమ్మల్ని విడిచి బ్రతగ్గలను. మరోచోట వుండి చదువుకోగలను. కాని ఇప్పుడు కాదు. లోకం మనల్ని అనుమానించినప్పుడు, మనపై అవినీతిని ఆరోపించినప్పుడు, లోకానికి భయపడి పారిపోవటం నా అభిమతంకాదు. మనం నిష్కల్మషులమని, మన అనుబంధం పవిత్రమైందనీ, సోదర సోదరీ భావంతో కూడుకున్నదనీ అందరికీ తెలియజేయడం నా కర్తవ్యం ఆ కరపత్రంలో వ్రాసిందంతా అబద్ధమనీ, దురాలోచనతో చేసిన దుష్కృత్యమనీ ఆ కరపత్రం వేసినవాడిచేతనే పదిమంది ఎదుట చెప్పిస్తాను. అప్పటిదాకా ఈ ఇంట్లోనే వుంటాను. ఆ కరపత్రంవేసిన దుర్మార్గు డెవడో కాదు. మన యింటి ఎదురుగా లేడూ స్కూటర్ మీద తిరుగుతూవుంటాడు. పూర్ణచంద్ అని వాడే! వాడి అంతు తేలుస్తాను" అంటూ శ్రీకాంత్ గబగబా బయటికి వెళ్ళాడు.

పూర్ణచంద్ పేరు వినగానే సుజాత, సుభాషితలు వొణికిపోయారు. అతన్ని గురించీ, అతని కింద ఉండే రౌడీలను గురించీ, టవున్లో అతనికున్న పలుకుబడిని గురించీ, అతని దుష్కృత్యాలను గురించీ వాళ్ళిద్దరూ నాగరత్నమ్మ చెప్పగా, మరెవరో అనుకూంటుండగా విన్నారు అతనిమీదకు శ్రీకాంత్ వెళ్ళడం కొండతో మూర్ఖంగా ఢీకొనడమే అనుకున్నారు. మరీ భయపడ్డారు.

మూడు నిముషాల్లోనే బుసలు పెడుతూ తిరిగివొచ్చాడు శ్రీకాంత్.

"దుర్మార్గుడు. ఊళ్లో లేడట. విజయవాడ వెళ్ళాడట. ఎప్పుడొస్తాడో తెలియదట. రేపైనా రాకపోతాడా? వాడిచేత నిజాన్ని కక్కించలేకపోతానా?"

"వాడొట్టి దుర్మార్గుడురా! వాడికి బోలెడంత బలగముంది. వాడితో నువ్వు పెట్టుకోకు" అంది సుభాషిత బ్రతిమిలాడుతూ.

"జరిగిందేదో జరిగిపోయింది. ఆ దుష్టుడిజోలికి పోకు. మా గురించి నువ్వు దేంజర్‌లో పడకు" అంది సుజాత.

"నాకేం దేంజరులేదు. వాడికే దేంజరు-తప్పు ఒప్పుకోకపోతే. మీరేం భయపడకండి! రేపు వాడిచేత నిజం చెప్పిస్తాను," అన్నాడు శ్రీకాంత్ తన పంతాన్ని వొదలకుండా.

ఆ రోజు రాత్రి సుజాత, సుభాషితలు ఎంతో చెప్పిచూశారు శ్రీకాంత్‌కు




పూర్ణచంద్ జోలికి వెళ్ళవద్దని. కాని అందుకు శ్రీకాంత్ ఒప్పుకోలేదు. మొండి పట్టు పట్టాడు. ఎంతో రాత్రివరకు సుజాత, సుభాషితలు ఆలోచిస్తూనే ఉన్నారు తమ కర్తవ్యాన్ని గురించి. శ్రీకాంత్ తనగదిలో కూర్చున్నాడు తన ఆలోచనలతో.

## 12

ఆ మరునాడు ఉదయం కాఫీలు త్రాగాక హాలులో కూర్చున్నారు సుజాత, సుభాషితలు. పేపరు పట్టుకొని అక్కడికొచ్చాడు శ్రీకాంత్. కొన్ని క్షణాల పాటు ఎవ్వరూ మాట్లాడుకోలేదు.

"శ్రీకాంత్!" అంది సుభాషిత.

పేపర్లోంచి మొహాన్ని తొలగించి చూశాడు శ్రీకాంత్. గళ్ళలుంగీ మీద నేత లాల్చీ ధరించాడు. రాత్రిపూట బాగా మేల్కొన్నాడేమో కళ్ళు ఎర్రబడి వున్నాయి.

"ఏం చేశావు?" అంది సుభాషిత.

"ఏమిటది?" అన్నాడు శ్రీకాంత్.

"ఇంట్లోంచి వెళ్ళే విషయం" అంది సుభాషిత కరుగ్గా.

"వెళ్ళనన్నానుగా!" అన్నాడు శ్రీకాంత్ ముక్తసరిగా.

"నువ్వు వెళ్ళనంటే సరిపోతుందా? మేం వెళ్ళమంటున్నాం. నువ్వు ఈ ఇంట్లో వుండటానికి వీల్లేదు" అంది సుజాత ఖంగుమనే స్వరంతో.

"మీ రెన్నయినా అనండి, నేను మాత్రం ఇప్పట్లో ఈ ఇంట్లోనుంచి

వెళ్లను- మా అక్కయ్య వెళ్లినప్పుడు నన్ను మీరే ఇంట్లో ఉండమన్నారు. ఇప్పుడు పొమ్మంటే పోతానా!" అన్నాడు శ్రీకాంత్ మొండిగా.

"అప్పుడు పరిస్థితులు వేరు. ఇప్పుడు పరిస్థితులు వేరు. నువ్వు ఈ ఇంట్లో వుండి మా బ్రతుకులతో చెలగాటమాడతావా? మమ్మల్ని సమాజంలో తలెత్తుకో నివ్వకుండా చేస్తావా?" అంది సుభాషిత.

"అక్కా! నన్ను మీరు అర్థంచేసుకోవడంలేదు. పూర్ణచంద్‌గాడిచేత నిజం చెప్పించి, ఈ గాలిదుమారం కేవలం కల్పితమైందేననీ, స్వార్థంతో ఓ దుర్మార్గుడు సృష్టించిందేననీ నిరూపించి అప్పుడు మీకు దూరంగా పోతాను. అంతవరకూ ఇంట్లో ఉండనివ్వండి" అన్నాడు శ్రీకాంత్.

"ఈ నిరూపణలూ, సాక్ష్యాలూ మాకేమీ వొద్దు. వెంటనే పెట్టె సర్దుకుని ఇంట్లోంచి వెళ్ళిపో. ఇంట్లోవుండి ఆ పూర్ణచంద్‌తో తగాదా పెట్టుకొన్నావంటే మేం ఈ ఇంట్లో ఉండలేం," అంది సుభాషిత.

"నువ్వు ఈ ఇంట్లోంచి పోకపోతే మేమే ఈ ఇంట్లోంచి తక్షణం వెళ్ళి పోతాం," అంది సుజాత.

"ఎక్కడికి వెళతారు? మీరెక్కడికి వెళ్ళినా మీతో నేనూ వస్తాను," అన్నాడు శ్రీకాంత్.

"ఇదెక్కడి బెడద? మమ్మల్ని దయ్యంపట్టినట్టు పట్టావు" అంది సుజాత కోపంతో రెచ్చిపోయి.

"మీ అక్కయ్యకు టెలిగ్రాం ఇస్తాను. వెంటనే బయలుదేరి రమ్మనమని" అంది సుభాషిత.

మాట్లాడలేదు శ్రీకాంత్.

అంతపనీ చేసింది సుభాషిత. రిక్షాలో ఎనిమిది గంటలకు టెలిగ్రాఫ్ ఆఫీసుకు వెళ్ళి, 'వెంటనే రావాల్సింది' అని స్వరూపకు టెలిగ్రామ్ ఇచ్చింది సుభాషిత.

ఆ రోజు సుజాత, సుభాషితలు కాలేజీకి సెలవుపెట్టారు. కాలేజీకి వెళ్ళడానికి వాళ్ళకు మొహం చెల్లలేదు. పైపెచ్చు శ్రీకాంత్‌ను ఇంట్లోంచి బయటకు పంపించలేకపోతున్నారు. ఏం చేయడానికీ, ఏం చేయకుండా వుండటానికీ తోచడంలేదు. పరిస్థితులు ఏదో భయాన్ని కలిగిస్తున్నాయి. జరగరానిదేదో జరగబోతున్నట్టు వాళ్ళ మనసులు శంకిస్తున్నాయి. సెలవుపెట్టి ఇంట్లోనే పచార్లుచేయసాగారు వాళ్ళిద్దరూ.

తొమ్మిదిగంటల ప్రాంతంలో శ్రీకాంత్ ఓసారి పూర్ణచంద్ ఇంటికెళ్ళి వచ్చాడు. అతను ఇంకా విజయవాడనుంచి రాలేదుట.

తొమ్మిదిన్నరకు షేవ్ చేసుకొని, స్నానం చేశాడు శ్రీకాంత్. వెంటనే భోంచేశాడు. టెర్రీకాట్ వైట్‌ప్యాంట్‌మీద బాటిక్ డైపు ప్రింటింగ్ శ్లాకు వేసుకున్నాడు. రెండు పుస్తకాలు సైకిలు క్యారియర్‌మీద పెట్టుకొని, "కాలేజీకి వెళుతున్నాను" అన్నాడు శ్రీకాంత్

సుజాత, సుభాషితలు మాట్లాడలేదు. మొహాలు యింతలావు చేసుకొని కూర్చున్నారు. స్వరూప వస్తేగాని శ్రీకాంత్ మాటవినడని నిర్ణయించుకున్నారు వాళ్ళు.

ఇంటిముందు సైకిలెక్కి పది మీటర్లు వెళ్ళాడో లేదో, ఎదురుగ్గా స్కూటర్ మీద వస్తున్న పూర్ణచంద్ కనిపించాడు శ్రీకాంత్‌కు. వెంటనే సైకిలు దిగాడు. స్టాండ్ వేశాడు.

పదిగంటల ఎండ మిటమిట లాడుతోంది. ఆ ఎండను మించిన కోపం అతనిలో ఒక్కుమ్మడిగా పూనకంలా వచ్చింది. వస్తున్న స్కూటర్‌ను చేయెత్తి ఆపాడు శ్రీకాంత్.

'ఏం కావాలి?' అన్నట్టు స్కూటర్‌మీదనుంచి చూశాడు పూర్ణచంద్. రేబాన్ కూలింగ్ గ్లాసులు పెట్టుకున్నాడు. జుత్తంగా రేగివుంది. విజయవాడ నుంచి స్కూటర్‌మీద వస్తున్నట్లున్నాడు. బ్లాక్ చెక్స్‌గల టెర్రీవూల్ ప్యాంట్ మీద గళ్ళ శ్లాకు వేసుకున్నాడు. మనిషి కొంచెం బడలికగా వున్నాడు.

ప్యాంట్ జేబులోంచి గబుక్కున ఎర్రటి కరపత్రాన్ని తీసి పూర్ణచంద్‌కు చూపిస్తూ, "ఈ కరపత్రాన్ని వేయించింది నువ్వేనా?" అన్నాడు శ్రీకాంత్.

"ఎవరన్నారు?" అన్నాడు పూర్ణచంద్ నిమ్మకు నీరెత్తిన నిర్లక్ష్యంగా.

"నే నంటున్నాను."

"నువ్వంటే, అనుకో."

"నిజం చెప్పు. ఈ కరపత్రాల్ని పంచిపెట్టిన కుర్రాడు చెప్పాడు".

"ఏమని ?"

"నువ్వు వేయించినట్టు. పంచినందుకు పాతికరూపాయలు ఇచ్చినట్టు."

"ఏమో! నాకు తెలీదు."

"అబద్ధం. ఈ దుర్మార్గపుపని నీదే! నువ్వు అలాంటివాడివే. నీ గురించి అంతా తెల్సుకున్నాను. దీనివల్ల నీకొచ్చిన లాభమేమిటి?"

శ్రీకాంత్ హొళ్ళు తెలీని ఆవేశంతో మాట్లాడుతున్నాడు. పూర్ణచంద్ నిండు కుండలా తొణకకుండా సమాధానాలు చెబుతున్నాడు.

''మర్యాదగా మాట్లాడు'' అన్నాడు పూర్ణచంద్.

''నీలాంటి కిరాతకుడికి మర్యాదేమిటి! చెప్పు. ఆ కరపత్రాన్ని ఎందుకేయించావు? నీ ఉద్దేశమేమిటి? మమ్మల్ని అపఖ్యాతిపాలుచేస్తే నీ కేమొస్తుంది? తప్పు ఒప్పుకో! క్షమాపణ చెప్పుకో! లేకపోతే నీ రక్తం కళ్ళజూస్తాను'' అంటూ శ్రీకాంత్ అతని చొక్కా కాలర్ పట్టుకున్నాడు.

''ఏయ్! మర్యాదగా వొదులు'' అన్నాడు పూర్ణచంద్ కొంచెం గొంతు పెంచి.

''మా అక్కల దగ్గరకొచ్చి క్షమాపణ చెప్పుకొనేదాకా నిన్ను వొదలను'' అంటూ శ్రీకాంత్ అతన్ని ముందుకు గుంజాడు.

స్కూటర్‌తోసహా పూర్ణచంద్ ముందుకొరిగి పడ్డాడు. అయినా అతనిలో కోపోద్రేకాలు విజృంభించలేదు. నిలదొక్కుకున్నాడు.

వీధిన వెళ్ళేవాళ్ల ఇద్దరు ముగ్గురు అక్కడ చేరారు.

''ఏం చెప్పరా!'' అంటూ శ్రీకాంత్ మళ్ళీ పూర్ణచంద్ చొక్కా కాలరు పట్టుకున్నాడు. పూర్ణచంద్ విడిలించుకున్నాడు.

శ్రీకాంత్‌లో పిచ్చికోపం ఉవ్వెత్తుగా లేచింది. ఉడుకు రక్తం ఝుంఝూ మారుతంవలె ప్రవహించింది. ఆ ఆవేశంలో తనను తాను మర్చిపోయాడు శ్రీకాంత్. ఏం చేస్తున్నాడోకూడా గ్రహింపలేని ఉద్ధృతమైన కోపోద్రేకాంతో కసితో పూర్ణచంద్‌ను మెడమీద, చెంపలమీద నాలుగుదెబ్బలు వేశాడు. నోటి కొచ్చినట్లు బూతులు తిట్టాడు.

కాని పూర్ణచంద్ అహింసామార్గాన్ని అవలంబించాడు. అతనికి విపరీతంగా కోపం రాకపోలేదు; మొహం జేవురించకపోలేదు; అవమానం పొందకపోలేదు; శ్రీకాంత్‌ను పట్టుకొని ఆ దవడా ఈ దవడా వాయించి, జుట్టుపట్టుకొని సైడు కాల్వలోకి ఈడ్చి అందులో కుక్కు దామని అనుకోపోలేదు. అతనికి అదేమంత కష్టమైన పనికాదు. అతని బలం ముందు, శక్తి ముందు, కొట్లాటల్లో అనుభవం ముందు శ్రీకాంత్ పసివాడు. అయినప్పటికీ ఎంతో నిగ్రహంతో కోపావేశాన్ని నిలదొక్కుకున్నాడు.

అక్కడ చేరినవాళ్లు పూర్ణచంద్ నిగ్రహానికి, మెదలకుండా వూరుకోటానికి అమితంగా ఆశ్చర్యపడ్డారు. అందులో ఒక యువకుడు పూర్ణచంద శిష్య

వర్గంలోవాడు. గురువుగారిమీద ఒక స్టూడెంట్ అట్లా కలియబడటాన్ని వాడు కళ్ళారా చూసి సహించలేకపోయాడు. అతనిలో రక్తం పరవళ్ళు త్రొక్కింది. వెనగ్గా శ్రీకాంత్ భుజం పట్టుకొని, పిడికిలి బిగించి, మెడమీద గుద్దబోయాడు.

"ఒరేయ్ రాములూ' పూరుకోరా! వొదిలిపెట్టు" అన్నాడు పూర్ణచంద్ శాంతంగా.

మరి నలుగురు మనుషులు ప్రోగయ్యారు.

రాములు పట్టును వొదిలించుకొని, పూర్ణచంద్ మీదకు మళ్ళీ కలబడాలని శ్రీకాంత్ ప్రయత్నం చేయసాగాడు. నోటికొద్దీ తిట్టసాగాడు.

"ఏంటి గురూ! ఇవాళ అపరగాంధీ అయిపోయావు. గుంటూరులో నీ మీద చేయిచేసుకొనే మగాడుండాడా?" అన్నాడు రాములు రెండు చేతులతో శ్రీకాంత్ రెక్కల్ని గట్టిగా పట్టుకొని.

"ఆ ఎలక్ట్రిక్ స్తంభానికి కట్టేయండ్రా వాడ్ని" అన్నాడు మరొకడు. అతనూ పూర్ణచంద్ శిష్యవర్గంలోవాడే.

"ఉండరా సత్యం! ఏదో కుర్రకుంక. మన సంగతి తెలీక కుప్పిగంతు లేస్తున్నాడు. వొదిలివేయండి కాలేజీకిపోయి చదువుకుంటాడు," అన్నాడు పూర్ణచంద్.

రాములు తన పట్టు వొదిలేశాడు. కాని శ్రీకాంత్ పూర్ణచంద్ మీదకు వెళ్ళ లేదు. అతని మనుషులు చాలామంది అక్కడ ఉన్నట్టు తెలుసుకున్నాడు. అ సమయం కాదని భావించాడు. పూర్ణచంద్ ఒంటరిగా వున్నప్పుడే ఎదుర్కొని, అతనిచేత నేరాన్ని ఒప్పించాలనుకున్నాడు. సైకిలు దగ్గరకు వెళుతూ, "నీ అంతు తర్వాత చూస్తాను. కాలేజీ టైం అయింది" అన్నాడు శ్రీకాంత్ బుసలు పెడుతూ.

అక్కడున్నవాళ్ళు నవ్వుకున్నారు.

"పోరా, కుర్రకుంకా!" అన్నాడు రాములు.

"నువ్వెంత? నీ బ్రతుకెంత? 'ఉఫ్' అంటే గాలిలో గడ్డిపోచలా ఎగిరి పోతావ్!" అన్నాడు సత్యం.

వాళ్ళిద్దరూ గురువుగారివెంట వెళ్లిపోయారు.

సైకిలు తొక్కుకుంటూ కాలేజీకి వెళ్ళాడు శ్రీకాంత్.

* * *

స్కూటర్ మీద వస్తోన్న పూర్ణచంద్‌ను శ్రీకాంత్ కొట్టిన సంగతి అరగంట లోనే ఆ వీధి మొత్తానికి తెల్సిపోయింది. ఆ విషయాన్ని నాగరత్నమ్మ మోసుకు

వచ్చి సుజాత, సుభాషితలకు చెప్పింది. వాళ్లు నిర్ఘాంతపోవటమే కాకుండా, నిలువునా భయపడిపోయారు.

"ఎంతపని చేశాడే శ్రీకాంత్?" అంది సుభాషిత.

"ఏదో అఘాత్యానికి పాల్పడతాడని అనుకుంటూనేవున్నా. అట్లాగే చేశాడు" అంది సుజాత.

"మరిప్పుడేం చేద్దామే!"

"పూర్ణచంద్ దుర్మార్గుడు. రౌడీ. వాడు పగపడితే తప్పించుకోవటంకష్టం."

"అందుకనే! నాకేదో భయంగా వుందే ! ఈ రాత్రికి మన కొంపమీదకు రౌడీలను వుసికొల్పడుగదా!"

"ఎలా చెబుతాం? వాడు తెగిస్తే ఎంత దారుణానికైనా వెనుకాడడు. మనం జాగ్రత్తపడటం మంచిది."

"ఎల్లాగే"

"ఇద్దరమూ వారంరోజులు సెలవుపెట్టి ఎవరి వూళ్ళకు వాళ్లం వెళ్ళిపోదాం. వారం తర్వాత పరిస్థితులు కూల్ కావచ్చు. ఈ ఆవేశాలు, దూకుళ్లు ఉండక పోవచ్చు."

"అదే బెటర్!"

సుజాత, సుభాషితలు దృఢంగా ఓ నిర్ణయానికి వచ్చారు. వెంటనే విడి విడిగా ప్రిన్సిపాల్‌కు సెలవు చీటీలు వ్రాశారు-తమకు తమ తమ స్వగ్రామాలలో అర్జంటుపని ఉన్నదనీ, వారంరోజులపాటు సెలవు మంజూరు చేయించ వల్సిందనీ. ఆ సెలవుచీటీలను నాగరత్నమ్మ కిచ్చి, ఆవిడ చేతిలో రెండు రూపాయలు పెట్టి, కాలేజీకి వెళ్ళి ప్రిన్సిపాల్‌కు ఇచ్చిరమ్మన్నారు. నాగరత్నమ్మ ఆ డబ్బును బొడ్లో దోపుకుని ఎర్రని ఎండలో నడిచివెళ్ళి నడిచి వచ్చింది గంట తర్వాత.

ఆ లోపల సుజాత, సుభాషితలు సూట్‌కేసుల్లో తమ బట్టలను సర్దుకున్నారు.

"నాగరత్నమ్మా! ఇంతసేపూ ఏంచేశావు?"

"మధ్యలో రిక్షా చెడిపోయింది. నడిచివెళ్ళాను" అంది ఆవిడ.

"మేం వూరికి పోతున్నాం. ఇల్లు జాగ్రత్తగా చూసుకో. శ్రీకాంత్ బాబుకు అన్నం వండిపెట్టు. మేం వారంరోజులకుగానీ తిరిగిరాం," అంది సుజాత.

అంత అర్ధాంతరంగా వాళ్ళెందుకు ప్రయాణం కట్టారో ఆవిడకు తెలుసు. కాని తల ఆడించి వూరుకుంది. వాళ్ళు లేని సమయంలో తన ఇష్టమొచ్చిన తినుబండారాలు చేసుకు తినొచ్చునని ఆవిడ కుశాలుగా వుంది.

"మరి మనం స్వరూపకు టెలిగ్రాం ఇచ్చాం గదా! ఇవాళ రాత్రికో, రేపు పొద్దున్నో వస్తే ఎట్లా?" అంది సుభాషిత.

"నిజమే! ఎలా? మరి ఆమె కోసం ఆగితే ఇబ్బందుల్లో పడతామే!" అంది సుజాత.

"వస్తే వస్తుంది. ఇంట్లో వుంటుంది. నాగరత్నమ్మ వుంటుందిగా. తమ్ముడి వ్యవహారం స్వయంగా చూసుకుంటుంది," అంది సుభాషిత.

"సరే అంది సుజాత సంతృప్తిపడినట్టుగా.

ఓ రిక్షా పిలిపించుకొని తర్వాత అరగంటలోనే వాళ్ళిద్దరూ బస్‌స్టాండుకు వెళ్ళారు.

అప్పటికే ఎర్రటి ఎండపోయి, ఆకాశంలో మబ్బులు గుమిగూడాయి-భారీ వర్షానికి సూచనగా.

## 13

ఆకాశాన్ని కమ్ముకున్న కారుమేఘాలు రెండుగంటల ప్రాంతంలో వర్షించాయి. పావుగంటసేపు పెద్ద వర్షం కురిసింది. వీధులన్నీ వాన నీటితో నిండిపోయాయి. వర్షం కురిశాక మబ్బులన్నీ విడిపోయి, తెల్లటి ఎండ వచ్చింది.

సాయంత్రంపూట ఫస్ట్ పిరియడ్ జరుగుతోంది. 'వ్యాపార వ్యవస్థ: నిర్వహణ' సబ్జక్టులో కోఆపరేటివ్ సొసైటీలను గురించి లెక్చరర్ చెబుతున్నాడు. స్టూడెంట్సు అందరితోపాటు శ్రీకాంత్ క్లాసులో కూర్చున్నాడుగానీ అతని మనస్సు మనస్సులో లేదు.

...పూర్ణచంద్‌చేత నిజాన్ని చెప్పించలేకపోయాడు. జనం గుమిగూడటంతో తను అనుకొన్నట్టు జరగలేదు. లేకపోతే పూర్ణచంద్‌చేత నిజాన్ని చెప్పించేవాడే! అయినా వాడెక్కడకు పోతాడు? సాయంత్రం వాడి సంగతి చూడాలి. ఇవాళ కాకపోయినా, రేపైనా వాడిచేత తప్పు ఒప్పించలేకపోలేదు. ఆ దుర్మార్గుడి వల్ల అక్కయ్యలకు ఎంత చెడ్డపేరు వచ్చింది? సుజాత అక్కయ్య పెళ్ళి సంబంధం కూడా చెడిపోయింది. ఆ పూర్ణచంద్‌గాడే కృష్ణప్రసాద్‌కు ఆకాశరామన్న లేఖ వ్రాయించి వుంటాడు. ఎంత నీచానికైనా ఎంత దారుణానికైనా వాడు పాల్పడగలడు. వాడిలో మానవత్వం లేదు. తాను గానీ, అక్కయ్యలు గానీ వాడికి చేసిన ద్రోహం ఏమీ లేదు. తమ మీద వాడు కక్ష బూనటానికి కారణమేమీ లేదు. ఏ దురుద్దేశంతో ఈ ద్రోహానికి పూనుకున్నాడో!

అక్కయ్య లెంతో బాధపడుతున్నారు. ఈ అవాంఛిత పరిస్థితులకు తననే కారణంగా పేర్కొంటున్నారు, తనెందుకు కారణమవుతాడు ? తనని దృష్టి బాణానికి ఒక సాధనంగా అవతలివాళ్ళు ఉపయోగించుకున్నారు గానీ, తనెట్లా కారణమవుతాడు. సుజాతక్కయ్య పెళ్ళి చెడిపోవటానికి తానెట్లా హేతువు? ఆకాశరామన్న ఉత్తరం చూసి బెదిరిపోయిన ఆ పెళ్ళికొడుకు జీవితంలో ఎదురయ్యే సంకట పరిస్థితులను ఎట్లా ఎదుర్కొగలడు? అట్లాంటి ఆకాశరామన్న ఉత్తరాలు పెళ్ళి అయినాక కూడా రావొచ్చు. అప్పుడు భార్యను వొదిలేస్తాడా?

ఏమైనా అక్కయ్యలకు తనమీద విపరీతమైన కోపం వచ్చింది; ద్వేషం కలిగింది. తనని ఇంట్లోంచి వెళ్ళిపొమ్మని ఒకటికి నాలుగుసార్లు చెప్పారు. తనవల్ల ఎంత వ్యథ, ఎంత బాధ, ఎంత జుగుప్స పొందకపోతే అట్లా నిర్మొహమాటంగా అంటారు. తను ఇంట్లోనుంచి వెళ్ళనని మొండిగా ప్రవర్తించి, వాళ్ళ మనస్సులకు మరీ బాధ కలిగించాడేమో! అంత మూర్ఖంగా ప్రవర్తించి వుండాల్సింది కాదు. అనుకోని మలుపులు తిరిగిన పరిస్థితుల ప్రాబల్యానికి వాళ్ళు తట్టుకోలేకపోయారు. లోకానికి భయపడ్డారు. అదృశ్య శక్తులకు బెదిరిపోయారు. అది వాళ్ళ బలహీనత కావచ్చు. ఆ బలహీనతతోనే తనని ఇంట్లోంచి పొమ్మన్నారు. తను ఇంట్లోంచి పోతే, సమస్యకు పరుష్కారం లభిస్తుందని ఆశించినట్టున్నారు.

తను ఆ ఇల్లు ఖాళీచేయడమే మంచిదేమో!

తద్వారా అక్కయ్యలకు మనశ్శాంతి చిక్కితే అంతకంటె ఏంకావాలి?

తను సమస్యగా తయారయ్యాడేమో! ఆ ఇంట్లోంచి వెళ్ళిపోతే ఆ సమస్య పరిష్కారమవుతుందేమో!

తను ఇల్లు మారాలి. టెంపరెరీగా భావనారాయణ రూమ్‌లో చేరితేసరి. ఆ తర్వాత మరోరూమ్ చూసుకోవచ్చు.

స్వరూప అక్కయ్య వస్తుందేమో! టెలిగ్రాం ఇచ్చినమాట నిజమైతే, అదర్దాపడి వస్తుంది. తననే నిందిస్తుంది. తప్పంతా తనదే అంటుంది. ఆమెతో ఉన్నదున్నట్టు చెప్పాలి. ఆమెను నమ్మించడానికి ప్రయత్నించాలి- తను నిరపరాధని...

శ్రీకాంత్‌కు క్లాసులో కూర్చోబుద్ధి కాలేదు. మనస్సంతా చికాగ్గా వుంది. ఆలోచనలన్నీ అనిశ్చితంగా వున్నాయి. ఏదో అశాంతి, అవ్యక్తమైన క్షోభ! ఏదో చేద్దామనే ఆవేశం; చేయడానికి అనుకూలించని పరిస్థితులు! తీవ్రమైన సంఘర్షణతో మనస్సంతా పొగలూ, సెగలూవలె వుంది.

ఆఖరి పిరియడ్ క్లాసులో వుండకుండా బయటికొచ్చాడు శ్రీకాంత్. వర్షం కురిసిన తర్వాత పడుతూన్న ఎండ తెల్లగా, ప్రశాంతంగా, కులాసాగా వుంది.

షెడ్డులోంచి సైకిల్ని బయటకు తీశాడు శ్రీకాంత్.

"హల్లో! శ్రీకాంత్! లీలామహల్‌లో మంచి ఇంగ్లీషు పిక్చరుంది. సోఫియా లారెన్‌ది. ఫస్టుషోకు వస్తావా?" అన్నాడు ఓ మిత్రుడు కనబడి.

రానని తల అడ్డంగా తిప్పి, సైకిలెక్కాడు శ్రీకాంత్.

కాలేజీ బయటగేటు దగ్గర శ్రీధర్ తటస్థపడ్డాడు.

"ఏమిట్రా! అప్పుడే ఇంటికి వెళుతున్నావు? ఏమిటి విశేషం?" అన్నాడు శ్రీధర్.

"ఏంలేదురా? ఏం తోచటంలేదు?" అన్నాడు శ్రీకాంత్.

"ఏం తోచకపోతే అలా సుదర్శన్‌కు వెళ్ళి కాఫీ తాగొద్దాం పద" అన్నాడు శ్రీధర్.

"ఇప్పుడొద్దులా! ఇంటికెళతాను" అన్నాడు శ్రీకాంత్.

"ఏమిట్రా! అంత డల్‌గా వున్నావు?" అన్నాడు శ్రీధర్.

"మనస్సు బావుండలేదు." అన్నాడు శ్రీకాంత్.

"ఏం? ఎందుకని?" అన్నాడు శ్రీధర్.

"తర్వాత చెబుతాలే!" అంటూ సైకిలెక్కాడు శ్రీకాంత్.

మెయిన్‌రోడ్డుమీద మెల్లగా సైకిలు తొక్కుకుంటూ పోతున్నాడు శ్రీకాంత్. రోడ్డుమీద కార్లూ, రిక్షాలూ, బస్సులూ, లారీలూ, స్కూటర్లూ పోతున్నాయి చప్పుళ్ళు చేసుకుంటూ. మనుషులు నిశ్శబ్దంగా నడుస్తున్నారు.

సాయంత్రం నాలుగున్నర గంటలవుతూంది.

శ్రీకాంత్ సైకిలు తొక్కుతున్నాడు గానీ బుర్రలో అనేక ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి. ట్రాఫిక్‌ను గమనించే దృష్టిలో లేడు.

ఎ సి. కాలేజీ దాటాడు శ్రీకాంత్.

అంతలో వెనకనుంచి ఓ లారీ పెద్ద చప్పుడుతో, హారన్‌తో, వేగంతోవచ్చి-రోడ్డుకు ఎడం పక్కగా పోతూన్న శ్రీకాంత్ సైకిల్ను కొట్టింది. సైకిలు అంత దూరాన పడింది. దానిమీదున్న శ్రీకాంత్ నెత్తురు ముద్దయి రోడ్డుపక్కన కూలి పోయాడు.

ట్రాఫిక్ బంద్ అయింది.

'అయ్యో!' 'అరెరే!' 'యాక్సిడెంట్!' అంటూ రోడ్డుమీదున్న జనం గుమి కూడారు.

కార్లు ఆగిపోయాయి.

రిక్షాలు ఆగిపోయాయి.

స్కూటర్లు ఆగిపోయాయి.

సైకిళ్ళు ఆగిపోయాయి.

జనం ఆగిపోయారు.

కాని శ్రీకాంత్ సైకిల్ను కొట్టిన లారీ ఆగలేదు. దాని రంగుకూడా సరిగ్గా ఎవ్వరికీ గుర్తులేదు. నెంబరుప్లేటు మీద బురదా, దుమ్మూ కొట్టుకొని వుండటం వల్ల, ఆ లారీ నెంబరు ఎవ్వరికీ గుర్తులేదు.

ఆ లారీ సాంబశివపేట మీదుగా దూసుకుపోయింది. ఎటుపోయిందో, ఏమిటో ఎవ్వరూ చూడలేదు.

నెత్తురుముద్దలా పడివున్న శ్రీకాంత్ను ఎవరో గవర్నమెంట్ హాస్పిటల్కు తీసుకెళ్ళారు— శవంగా ధృవీకరించడానికి.

అది యాక్సిడెంటా ?

కాదు అది హత్య.

రోడ్డుకు ఎడంవైపు పోతూన్న శ్రీకాంత్ సైకిల్ని ఆ లారీ కొట్టాలేస్ బాగా లెఫ్ట్సైడుకొచ్చి కొట్టింది. అది యాక్సిడెంట్ ఎంతమాత్రం కాదు. లారీతో హత్య చేయడమే- అన్నారు ప్రత్యక్షంగా చూసిన కొందరు.

అయితే—

ఆ లారీ ఎవరిది ?

ఆ లారీని డ్రైవ్ చేసిందెవరు ?

అట్లా డ్రైవ్ చేయమన్నదెవరు ?

——ఈ విషయాలన్నీ పూర్ణచంద్కు తెలుసు.

ఆ మరునాడు ఉదయమే కర్నూలునుంచి ఎంతో ఆదుర్దాతో వచ్చిన స్వరూపకు గవర్నమెంట్ హాస్పటల్లో తమ్ముడి శవాన్ని గుర్తుపట్టవల్సిన దుర్గతి పట్టింది.

రెండురోజుల తర్వాత దినపత్రికలో వచ్చిన ఓ వార్తను చదివి సుజాత, సుభాషితలు విలవిల్లాడిపోయారు.

"గుంటూరులో మెయిన్రోడ్డుమీద ఎ.సి. కాలేజీ సమీపంలో బి కాం. చదివే 'శ్రీకాంత్' అనే విద్యార్థి సైకిలుమీద పోతూ లారీకింద పడి దారుణంగా మరణించాడు. పోలీసుల దర్యాప్తు జరుగుతూన్నది."

---




తలుపు తెరిచి ఆశ్చర్యపోయాను.

ఎదురుగా ఆమె!

ప్రక్క వాటాలోని జూనియర్ ఇంజనీరుగారి భార్య!

"మీరా!" అన్నాను తొట్రుపాటుతో.

ఆమె మాట్లాడలేదు.

"లోపలకు రండి!" అన్నాను అక్కడనుండి కదలకుండానే.

ఆమె రాలేదు. ఓ నిముషం గడిచాక మెల్లగా అంది. "మీరు అడ్డంగా నిలబడితే ఎలా రాను?"

నా పొరపాటు అర్థమయింది. తడబాటు కప్పిపుచ్చుకుంటూ ప్రక్కకు తప్పుకున్నాను ఆమె మెల్లగా నడిచి వచ్చి మంచం ప్రక్కన నిలబడిపోయింది. నేను తలుపు ఓరగావేసి ఆమె ననుసరించి లోనికి వచ్చేసి. అప్పుడు మొదటిసారిగా నొచ్చుకున్నాను, గదిలో ఒక కుర్చీ అయినా కొని వెయ్యలేకపోయినందులకు!

"అలా మంచంమీద కూర్చోండి,"

అన్నాను. అసలే చిన్న గది! ఆమె నిలబడి వుంటే ఇటూ అటూ గదిలో తిరగ టానికి ఇబ్బందిగా వుంది. మంచం కంది పోతుందేమోనన్నట్లు పట్టెమీద ఒక వారగా కూర్చుంది ఆమె.

సాయంకాలం అయిదున్నర అయింది. అయినా, మబ్బులు ఆకాశంలో వుండటం వలన గదిలో కాస్త చీకటిగా వుంది. లైటు వెలిగించివచ్చి పుస్తకాల గుట్ట ఓ మూలకు నెట్టి టేబిలుమీద కూర్చున్నాను. ఆమె ఏమీ మాట్లాడ లేదు కొంత సేపు.

గదిలో ఉక్కగా వుంది. ఆమె చీర కొంగుతో విసురుకుంటోంది. ఫాను కొనలేని నా ఆర్థిక దస్థితి మరోమాటు జ్ఞప్తికివచ్చింది. ఈమె ఎందుకు వచ్చింది ? నాతో ఏం పని ? నా గది కిటికీవద్ద నిలబడితే వాళ్ళ డ్రాయింగు రూము కనుపిస్తుంది. ఆమె ఆ గదిలో కదిలినపుడు ఈ నాలుగునెలలుగా చాలా పర్యాయాలు ఆమెను చూశాను. కాని ఇంతవరకూ మా మధ్య పలకరింపులు జరగలేదు. ఆ మాటకొస్తే, ఆమె భర్తతోకూడా నేను ఎన్నడూ మాట్లాడ లేదు. ఉదయం యూనివర్సిటీకి వెళ్ళి పోతే సాయంకాలం అయిదు దాటేక రూమ్‌కు రావటం - హోటలుకు వెళ్ళి భోజనంముగించి ఏ తొమ్మిదింటికో వచ్చి చదువుకొని నిద్ర కుపక్రమించటం - ఈ చర్యలవలన పొరుగువాళ్ళతో పరిచయం పెంచుకోటం కష్టమే నాకు ! కనీసం ఇంతవరకూ ఆమె పేరయినా తెలుసుకోలేకపోయినందులకు కించిత్తు బాధపడ్డాను.

"నా పేరు అనూరాధ" అందామె అంతలోనే.

"అవునవును, తెలుసు" అన్నాను, ఏమనాలో తోచక.

ఆమె ఆశ్చర్యంగా నా వంక చూసింది "ఎలా తెలుసు ?" అంది.

నాకు గొంతుకో వెలక్కాయ పడి నట్లయింది. సమాధానం ఏం చెప్పను ? అబద్ధంకూడా సరిగా ఆడలేకపోయాను.

"మీ వారు ఆఫీసుకు వెళ్ళేటపుడు పిలుస్తుంటే విన్నాను." ఒక అబద్ధాన్ని కప్పిపుచ్చటానికి తడుముకోకుండా మరో అబద్ధం ఆడేను. ఆ సంగతి బయటపడ కుండా ఒక వెర్రినవ్వు ముఖానికి పులుముకున్నాను.

"మీరు అబద్ధం ఆడుతున్నారు."

నేను మాట్లాడలేదు. ఆమె ఈ విధంగా దాడిచేయటం నాకంత రుచించ లేదు.

"మాకు పెళ్ళయి సంవత్సర మయింది. ఈ ఏడాదినుండీ ఆయన ఒక్కసారయినా నన్ను పేరుపెట్టి పిలుస్తారేమోనని చూస్తున్నాను! ఉహూ! నాపేరు నేనే మరిచిపోయే స్థితికి వచ్చేను. 'ఒసేవ్' 'ఏమేవ్' ఇత్యాదులు నా పేర్లు..." కొంతసేపు ఆగి "పోనీలెండి,

మీరయినా నా పేరు తెలుసుకున్నారు. ఇకమీదట 'అనూరాధా' అని నన్ను పిలవండి! అలా పిలిస్తే నాకెంతో ఇష్టం." ఆ మాటలు అంటుంటే ఆమె కళ్ళు తడి అయ్యేయి. ఏమనాలో తోచక తలవూపేను అంగీకార సూచకంగా.

"నాకు చదువుకునేందుకు మంచి పుస్తకాలు ఏవైనా ఇవ్వండి."

"నా దగ్గర నవలలు, కథల పుస్తకాలు లేవు. నేను ప్రస్తుతం ఎమ్మే ముగించి రీసెర్చి చేస్తున్నాను. ఈ పని పూర్తయ్యేవరకూ నవలల్ని దూరంగా వుంచుతున్నాను."

"మీరు కథలు వ్రాస్తారట!" అంది నా వంక చూస్తూ.

"ఆ! ఏదో! తోచక! అదీ మానేశాను ఇప్పుడు! రీసెర్చి ముగించే వరకూ మరో పని పెట్టుకోదల్చుకో లేదు."

"మీ సబ్జక్టేమిటి ?"

"శ్రీనాధుడు."

"మెటీరియల్ అంతా సేకరించారా?" అంది.

"దాదాపు సేకరించినట్లే!" అన్నాను.

"శివరాత్రి మహత్యం వుందా ?"

శ్రీనాధుడు వ్రాసిన ఆ పుస్తకం గురించి అడిగేసరికి ఆమెకు తెలుగు సాహిత్యంతో కాస్త పరిచయం వున్నట్లే కనిపించింది.

నైషధంలాంటి మంచి పుస్తకాలు వుండగా అదెందుకు ?" అన్నాను పుస్తకాల గుట్టలో ఆ పుస్తకంకోసం వెదుకుతూ.

"నైషధం నా దగ్గర వుంది. హంస దూత్యంలోని పద్యాలు వారానికి ఒకసారయినా చదివి ఆనందిస్తాను. శ్రీనాధుడులాటి కవి మన తెలుగు భాషకు లభించడం మన అదృష్టం! అతడు వ్రాసిన ఇతర కావ్యాలు చాలా చదివాను. శివరాత్రి మహత్యం నాకు దొరకలేదు," అంది.

ఇంతవరకూ ఆమెను తక్కువగా అంచనా కట్టేను. శివరాత్రి మహత్యం తీసి ఇస్తూ "ఇది ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడవారు ఎప్పుడో వేసిన కాపీ! బాగా నలిగిపోయింది! పేజీలు పొడిలా రాలిపోతున్నాయి ! జాగ్రత్తగా వుంచండి...పుస్తకం పరహస్తం గతం గతః అన్నారు మనవాళ్ళు !" నవ్వుతూ అన్నాను.

"పరహస్తం అన్నారు కానీ నారీ హస్తం అనలేదుగా! అయినా నన్ను పరాయిదాన్నిగా చూస్తే మీరు నాకు ఇవ్వొద్దు!" అంది.

"ఊరకే జోక్ చేశాను, అంతే !"

"మీ పుస్తకం జాగ్రత్తగా వుంచుతానులెండి." అంటూ దాన్ని తీసుకుని 'థేంక్స్' చెప్పి వెళ్ళిపోయింది.

మూడు దినాల తర్వాత ఓ ఉదయం

నేను యూనివర్సిటీకి బయలుదేరుతూ వుంటే ఆమె పుస్తకం తీసుకువచ్చింది.

"పూర్తిగా చదివేరా ?" అన్నాను.

"ఇందులో పూర్తిగా లేదుగా "

ఆమె పుస్తకం చదివింది. సందేహం లేదు! నాలుగో ఆశ్వాసంలో 'అంతట యముండేమిచేసె !' అని అడగటంతో ఆ పుస్తకం పూర్తయిపోయింది. అది చాలా సంవత్సరాల క్రితం వేసిన కాపీ. శివరాత్రి మహాత్యం తాళపత్ర గ్రంథం ఆనాటికి అంతవరకూ వున్నది లభించిందట! ఆ తరువాత తెలంగాణాలో ఎవరింటనో పూర్తి గ్రంథం దొరకటం, దాన్ని ఎవరో మళ్ళీ సంస్కరించి పూర్తిగా ప్రచురించటం జరిగింది. పూర్తి కాపీ నావద్ద లేదు.

అదే విషయం ఆమెతో అన్నాను.

"శ్రీనాధుని శైలిలో కనబడే అందాలు ఈ పుస్తకంలో లేవు నాయకుడు 'సుకుమారుడు' స్వంత కూతుళ్ళతోనే రమించడం జుగుప్సగాలేదూ!" అంది.

సూటిగాచెప్పిన ఆమె అభిప్రాయానికి ఆశ్చర్యపోయాను. ఆమె యెడల నా అభిమానం పెరిగింది. వద్దంటున్నా వినకుండా స్టౌమీద నీళ్ళుపడేసి ఆమెకు కాఫీ కలిపిఇచ్చేను.

"ఆయన లేరా ?" అన్నాను కప్పు అందిస్తూ.

శ్రీకాకుళం కేంప్ వెళ్ళారు. రెండు రోజులు వుంటే మళ్ళీ వారం దినాలు కేంపులు. ఇంటిమీద మనసు మళ్ళి నప్పుడు వస్తారు."

"మరి, ఉద్యోగ బాధ్యతలు తప్పవు కదా!"

నే నా మాట అనగానే ఆమె ముఖం ఎర్రబడింది.

నామీద కస్సున లేచింది. "ఏమిటండీ బాధ్యతలు! దేశంలో ఏ జూనియర్ ఇంజనీరుకూ లేని బాధ్యతలు ఈయనకే వున్నాయికాబోలు. పెళ్ళాలను నిరాదరణగా చూస్తూ ఉద్యోగాలు చెయ్యమని ఏ ప్రభుత్వమూ శాసించటం లేదు. అయినా, ఇంటిపట్టున వుండే రెండు రోజుల్లో సరిగ్గా వుంటే లేనిరోజుల కోసం ఏడవొచ్చును. ఎప్పుడూ గొడవలే " అంటూ మాట్లాడటం ఆపింది.

"కాఫీ చల్లారిపోతోంది, త్రాగెయ్యండి" అన్నాను.

"మరి—మీకో ?"

"నే నిప్పుడు భోజనం చేస్తాను."

"నేనూ చేస్తానుగా - మరో కప్పు ఇవ్వండి, ఒన్ బై టూ తాగుదాం," అంటూ చొరవగా నా వంక చూసింది.

'మరో కప్పు అందించేను' కాఫీ ముగించేం!

భర్త విషయం ఆమె చెప్తూంటే వినడానికి ఇబ్బందిగా వుంది.

అంతలోనే అంది. "ఏమండీ అసలదీ ఓ మనిషేనంటారా ?"

ఈ ప్రశ్నతో తడబాటు పడ్డాను.



"ఎందుకు కాదు? మనిషిలోని పరిపూర్ణతకు ఆడదే పరాకాష్ఠ! సంపూర్ణత్వం ఆడదానిలోనే వుంది," అన్నాను.

"స్త్రీకికూడా ఓ మనసూ, కోరికలూ, ఇష్టాఇష్టాలు వుంటాయని ఒప్పుకుంటారా?"

"ఆహా! నిరాక్షేపణీయంగా ఇంతకూ ఇవన్నీ వుండకూడదని ఎవరన్నారు?"

ఈ ప్రశ్న వేశాక నాలిక్కొరుచుకున్నాను.

"మా ఆయనే'-నా భర్త, రామనాథ్‌గారు! పబ్లిక్ వర్క్స్ డిపార్టుమెంటులో జూనియర్ ఇంజనీరుగా పనిచేస్తున్న భర్త! నా గోడు కాస్తంత అయినా, పట్టించుకోని మనిషి!"

ఆమె మాట్లాడే తీరుచూస్తే పసిపిల్ల గుర్తుకు వచ్చింది. వ్యవహారం మరీ సిల్లీగా వుంది.

నాకు అయిష్టంగా వున్నా, విషయం మార్చే వీలులేకపోయింది.

ఆమె భర్తగురించి తేలికగా చెప్తూంటే ఆమెమీద నాకు ఏదో అధికారం ఏర్పడిన ఫీలింగ్ కల్గింది.

"అది చాలా అన్యాయం! ఆడదానికి

విలువ ఇవ్వలేకనే ఈ దేశం ఇలా తయారయింది. ఇదే పాశ్చాత్య దేశాల్లో చూడండి! ఇద్దరికీ సమాన హక్కులుంటాయి ఆడవాళ్ళకు సమానహక్కులివ్వటం పురోగమనానికి చిహ్నం," అన్నాను ఆవేశంగా.

విశ్రాంతితో కళ్ళు విప్పార్చుకుని వింది అనూరాధ! ఆమె ముఖం నిండా ఆనందం!

"మీరు నాకు స్నేహితులుగా దొరకటం నా అదృష్టం," అంది మెల్లగా.

"మీకు యూనివర్సిటీకి వేళవుతోంది. వెళ్ళిరండి" అంటూ లేచింది.

"ఎప్పుడయినా వస్తూవుండండి," అన్నాను. ఆమె నా టేబిలుమీది కాగితాల వంక చూసి, "మీ దస్తూరి ఎంత బాగుందో! దస్తూరి అందంగావుంటే వాళ్ళ మనసులుకూడా అంత అందంగా వుంటాయిట," అంటూ పేజీలు తిరగేసింది.

"అవి నా రీసెర్చి వర్కు! శ్రీనాథుడు విలక్షణంగా వాడే 'హేరాళ' 'హేవాక' వంటి పదాలను తీసి వాటిని పరిశీలిస్తున్నాను."

"ఈ కాగితాలు నా కివ్వండి. చూసి ఇస్తాను," అంది.

ఇవ్వనని ఎలా చెప్పగలను ?

"అది నా ప్రాణం," అన్నాను.

"నాకూ అంతే, మంచి మిత్రులంటే ప్రాణం" అంటూ వెళ్ళిపోయింది, ఆ కాగితాలు తీసుకుని.

మరునాడు ఉదయం నిద్రలేచేసరికి ఆ కాగితాలు నా గదిలో వున్నాయి. న్యూస్‌పేపరు కట్టి భద్రంగా కిటికీలోంచి పడేసినట్లుంది అనూరాధ. ఆత్రంగా కాగితాలు విప్పిచూసేను. పేజీ పేజీకి మధ్య ఏదైనా కాగితం దొరుకుతుందేమోనని!

కాగితం అంటే మామూలు కాగితం కాదు-ప్రేమలేఖలాంటిది!

ఈ ఉదయం మొదటిసారిగా ఈ ఆలోచన నా మనసులోకి వచ్చింది.

నా మనసు అనూరాధను అభిమానిస్తోంది-కాదు కోరుతోంది!

నిరాశగా కాగితాలు టేబిలుమీద పడేశాను.

అద్దంలో నా ముఖం చూసుకున్నాను. నేను రామనాథ్‌కంటె అందంగానే వుంటాను. సందేహంలేదు! అంతేకాదు అనూరాధ అందానికీ, అందమయిన మనసుకీ ఆ మోటుమనిషి తగడనిపించింది.

ఆ సాయంకాలం యూనివర్సిటీ నుండి వస్తుంటే, వీధి మలుపులో అనూరాధా, ఆమె భర్తా కనిపించేరు. లేతనీలంరంగు నైలెక్స్ చీరలో అనూరాధ అప్సరసలా మెరిసిపోతోంది. బంగారు లాకెట్ ఆమె నిండయిన




రొమ్ముల మధ్య ఒదిగి వయ్యారాలు పోతోంది.

వాళ్ళవంక చూసి చిరునవ్వుతో 'గుడ్ ఈవినింగ్' అన్నాను. రామనాథ్ తిరిగి విష్ చేశాడు అతని ముఖంలో ఏ భావమూ లేదు. ఇద్దరినీ దాటి గదికి వచ్చేశాను.

రెండు దినాల తరువాత అనూరాధ వచ్చింది. "ఉదయం ఆయన కేంపు వెళ్ళిపోయారు. తుఫాను వెలిసినట్లయింది" అంది మంచంమీద దుప్పటి సవరించి కూర్చుంటూ.

"ఏం?" అన్నాను.

"ఆవేళ రాత్రి ఒకటే గొడవ! సాయంకాలం చిరునవ్వుతో విష్ చేశారు కదా మీరు! అందులో విష్ ఆయనకీ, చిరునవ్వు నాకూనట! ఛీ! ఒట్టి అనుమానం మనిషి!"

రామనాథ్ ఘటికుడే! గొప్పగా 'ఎనలైజ్' చేశాడనుకున్నాను మనసులో.

"...ఆ ముందురోజు రాత్రి మీ రీసెర్చి కాగితాలు నా దగ్గర వుండటం చూసి నన్ను కొట్టేరు." ఆ మాటలు అంటూవుండే ఆమె కన్నుల్లో నీళ్ళు తిరిగాయి.

నేను చలించిపోయాను.

రామనాథ్ మనిషా! పశువా? ఛీ! అనూరాధని కొట్టడానికి అతనికి చేతులెలా వచ్చేయి? అంత అందమైన,

మృదువయిన శరీరంమీద చెయ్యిజేసుకో టానికి అతనికి మనసెలా ఒప్పింది?

నా మనసు వశం తప్పుతోంది!

తలుపు దగ్గరగావేసి ఆమె వద్దకు వచ్చేను.

"అనూరాధా !" గోముగా పిల్చేను. ఆమె తలెత్తి నావంక చూసింది. "మీ పరిస్థితికి నాకు చాలా జాలికలుగుతోంది. మీలాటి అప్సర భార్యగా దొరకటమే ఒక వరం. మిమ్మల్ని కొట్టడానికి అతని మనసెలా ఒప్పిందో నాకు అర్థం కావటంలేదు." నా ఓదార్పు మాటలకు ఆమె కళ్ళు ఆనందంతో మెరిసేయి.

నేనంటే ఎంత ఇష్టమో ఆ ముఖమే చెప్తోంది.

నామీద ఎంత ప్రేముందో మెరిసే ఆ చెక్కిళ్ళే చెప్తున్నాయి.

"అనూరాధా" గొణుగుతూ ఇంకా దగ్గిరగా వెళ్ళాను.

వణికిపోతున్న చేతులతో ఆమె ముఖాన్ని అదిమిపట్టి దగ్గరగా తీసుకొని......

అంతే! కళ్ళు మసకబారేయి!

నా ఎడమచెంప పగిలినంత పనయింది!

జరిగింది అర్థంచేసుకుని కళ్ళువిప్పి చూసేసరికి ఆమె నా ఎదుట రొప్పుతూ నిలబడివుంది.

"చిన్నతనంనుండీ నాన్నా, అమ్మా, అక్కలూ, అన్నలూ ఎవ్వరూ తోడు లేకుండా పెరిగేను. నా కష్టం, సుఖం చెప్పుకునేందుకు కూడా ఎవరూ లేరు నాకు! ఇంత కాలానికి మంచిస్నేహితుడు దొరికేడనుకున్నాను. నా బాధలు విని రవంత సానుభూతి చూపిస్తారని ఆశించేను. ఛీ! మొగాళ్ళంతా ఇంతే! కుక్కలు"

ఆమె కళ్ళు నీళ్ళు వర్షిస్తున్నాయి! కాదు - నిప్పులు కురిపిస్తున్నాయి! గబగబా గదిలోంచి వెళ్ళిపోయింది.

"ఆమె చదువుకొని ఆనందించేందుకు శ్రీనాధుడున్నాడు! ఆమె అవసరాలను చూసి బ్రోచే నాధుడు-భర్త రామనాధు డున్నాడు! ఆమె గోడు చెప్పుకునేందుకు వినే నాధుడు ఆమెకి కావాలి! ఆ నాధుణ్ణి నేను! కేవలం-వినే నాధుణ్ణి! అంతే!" అనుకుంటూ నీరసంగా మంచంమీద కూలబడ్డాను.






"అంటే నీ వుద్దేశం, నేనేం పట్టించుకోవటంలేదనే కదూ! సంసారం అంటే లక్ష్యం లేని చవట దద్దమ్మననే కదూ!"

తెరమీద మధ్యవయస్సు హీరోయిన్ తన కూతురు ధరించవలసిన లంగా, ఓణీలతో ఎగురుతూంది - షట్టలు, గుట్టలు పట్టుకొని.

లావుపాటి బొజ్జని అతి కష్టంగా బుష్‌షర్ట్‌లో దాచేసి ఆయాసపడుతూ, పరుగెత్తుతున్నాడు ఆలనాటి హీరో.

ఆనంద పెదవులమీద అప్రయత్నంగా చిరునవ్వు వెలిసింది. పాపం! హీరోకి హార్ట్‌అటాక్ రాదుకదా యీ పరుగు పందెంలో...!

హీరోయిన్‌ని దొరకపుచ్చుకున్నాడు హీరో. ఇద్దరూ పొదలమాటుకి అదృశ్యమయ్యారు, సెన్సార్ కత్తెరకి అందకుండా!

ఆనంద కళ్ళు సినిమా చూస్తున్నవే కాని, మనస్సు మాత్రం మన్మధని గురించే ఆలోచిస్తూంది. ఈరోజు సినిమాహాల్లో ఇంతలా కబుర్లు చెబుతూ, నవ్విస్తూ, కవ్విస్తూ కూచున్న ఈ మన్మధ నిన్న తనతో ఎంత ఘర్షణ పడ్డాడు! ఎంత భయపడ్డది తాను! కొండలా వచ్చిన ఆపద, దూదిలా ఎగిరిపోతుందంటారు దీన్నే కాబోలు. నిన్నటికి నిన్న...

* * *

"ఏమండీ! ఇలా తలపట్టుకు కూచుంటే ఎలాగండి?" ఆనంద మాటలు, ఆనంద నోట్లో వుండగనే 'గంయి' మని లేచాడు మన్మధ.

"అబ్బబ్బ ! ఎందుకండీ అంతంత మాటలు ! మన మిద్దరమే అయితే ఫరవాలేదు మనిద్దరికి ముగ్గురున్నారే ! ఎంతకాల మిలా...?"

"అందుకే నేను నా వుద్యోగం ఊడిననాడే చెప్పాను - పిల్లల్ని తీసుకొని పుట్టింటికి వెళ్ళమని. నా కెవాగూ నా అన్నవాళ్ళు లేరు, కనీసం నువ్వయినా."

"భలేవారండి మీరు...? వుద్యోగం లేక మనస్తాపంలోవున్న మిమ్మల్ని విడిచి టింగురంగా అంటూ నేను మాత్రం వూరెళ్ళి కూచోనా...?"

"ఈ మాట ఇప్పటికి వందసార్లు చెప్పావు. అందుకే నాతోబాటు నువ్వూ..."

"నే నెప్పటికైనా, దేనికైనా తయారేనండీ ! కానీ...పిల్లలు...? ఈ నెల జీతాలు కట్టక స్కూలుకి కూడ పంపలేదు కదా వాళ్ళని...!"

"ఓహ్ ! వాళ్ళేమీ...ఐ.ఎ.ఎస్. లు డాక్టరీలు వెలిగించక్కరలేదులే !"

"చూడండి ! ఎన్నాళ్ళిలా ఇంట్లో వస్తువులు అమ్మి తింటూ కూచుంటాం ? ఇదో, ఆదో అని అప్పుడే నాలుగు నెల లవుతూంది...!"

"నందా ! నన్నేం చేయమంటావో చెప్పు ? నేనూ ఉద్యోగ ప్రయత్నం లోనే వున్నాను కదా ! ఇంక అదీ, ఇదీ కాకుంటే దొంగతనానికి బయలుదేరాలి!"

"రామరామ ! ఏ మాటన్నా మీతో కష్టమే వచ్చిపడింది అయినా బంగారం లాంటి వుద్యోగాన్ని వొదులుకొని..."

"అదిగో! మళ్ళీ మొదటికొస్తున్నావ్! వుద్యోగం బంగారమో, వెండో నాకు తెలీదనుకున్నావా ? ఆ వెధవ చేసే దగుల్బాజీ పనులన్నింటికి తలూపుతూ, అతగాడు చేసే అక్రమాల నన్నింటిని కప్పిపుచ్చుతూ, పైగా నేను పై అధికారులతో అబద్ధపు సాక్ష్యం పలకాలా? అలా పలకనన్నానని నామీద లేనిపోని నిందారోపణలు చేసి వుద్యోగం ఊడదీయిస్తాడా ? నా నిజాయతీ బయటపడి,మళ్ళీ వుద్యోగం రాకుండా పోతుందా...?"

"చూడండి. మీ మట్టుకు మీరు న్యాయంగా వున్నారు. ఒకరి సొమ్ము అక్రమంగా తినడంలేదు. నిజమే - కష్టపడి కడుపు నింపుకుంటున్నారు. అంతవరకు చాలండీ మీ నిజాయితీ ! ఒకరితో మీ కేం పని ?"

"ఇలా ప్రతి ఒక్క చవట అనుకొనే మన దేశ మిలా తగలబడిపోతున్నది నందా ! నీ కెందుకు ... నీ వేం దిగులు పడకు ! నిన్ను కట్టుకున్నందుకు పిల్లల్ని - కన్నందుకు మిమ్మల్ని పోషించే భారం నాది..." చిరాగ్గా, మరింత కోపంగా మన్మథ లేచి పచార్లుచేయడం మొదలెట్టాడు.

"నేను చెప్పేది...ప్లీజ్ ... కాస్త

వినండి. ఇందాక మీరు అలా బయటకు వెళ్ళినప్పుడు రామస్వామి..."

"ఎవరు? ఆ గుంటనక్క రామస్వామే! వెధవ ! వాడెందు కొచ్చారుడు మళ్ళా? నువ్వెందుకు రానిచ్చావ్ వాడిని ?"

"అబ్బబ్బ ! మీ రావేశపడక నేను చెప్పేది కాస్త వినండి. మీ కంపెనీ జి.ఎమ్. పంపిస్తే వచ్చాట్ట!"

"ఊ..."

"ఆ ఫైల్లోని ఆ కాగితాలని తొలగించి వేసి, అతడు చెప్పినట్లు చేస్తే మిమ్మల్ని వేరే వూరికి ట్రాన్స్‌ఫర్ చేయించి, అక్కడి బ్రాంచికి మేనేజర్‌ని చేసే పూచీ తనదంటూ చెప్పాట్ట..."

"స్కౌండ్రల్ ! ఇడియట్ ! ఆ రామస్వామి గాడివన్నీ ఏకరువు పెట్టూ కూచుంటే, సావకాశంగ విన్నావన్న మాట. నీ కెంత బుద్ధిలేను నందా !"

మన్మధ కోపావేశంతో అన్న మాటలకి కొంత జడిసింది ఆనంద. కానీ, వెనువెంటనే ధైర్యం తెచ్చుకుంది.

"ఔనండీ ! అతడు చెప్పేది కరెక్టే! ఈ ఊర్లో ఉండొద్దు మనం. వేరేచోట కెళ్ళి నిజాయతీగా బ్రతుకుదాం. మీ జి.ఎమ్. అడిగే కాగితాలను అతగాడికి యిచ్చిపడేస్తే మనకేం పోతుందండీ ?"

"అయ్యో ! పిచ్చి ఆనందా నీ కేం మతిపోయిందా ? ఆ కాగితాల్లోనే వుంది, అతని జాతకమంతా ! సంసారం కాపాడుకోడానికే అతనికి దాసోహం అనడంకన్నా, నా భార్యా పిల్లల కింత విషమిచ్చి నేనూ, నాతోపాటూ..."

"పోనీ ఆ పనయినా చేసి పుణ్యం కట్టుకొనండి. చావాలేక బ్రతకనూ లేక, రోజు రోజు చావటంకన్నా..." దుఃఖం ముంచుకొచ్చింది, ఆనందకి.

* * *

ముభావంగా కాఫీ త్రాగి బయటి కెళ్ళిన మన్మధ, హుషారుగా ఈల వేసు కుంటూ వచ్చాడు, పన్నెండుగంటల ప్రాంతంలో. చేతినిండా బట్టల ప్యాకెట్లు, పూలు, పండ్లు, మిటాయి పొట్లాలు. దిగ్భ్రమ చెందిన ఆనంద, అనుమానంగా చూచింది భర్తకేసి. మన్మధ చిరునవ్వు నవ్వాడు. పిల్లలు కొత్తబట్టల సంబరంలో పడిపోయారు. భర్తని చేరిన ఆనంద, ప్రశ్నార్థకంగా చూసింది

"భయంలేదోయ్ ! నేనేం దొంగతనం చేయలేదు... !"

దెబ్బతిన్నట్లు చూసింది, ఆనంద.

"పిచ్చిమొద్దూ ! ఆశ్చర్యపోతున్నా వెందుకోయ్ ? భార్యా పిల్లలకు అన్నం పెట్టలేని నా నిజాయితీ ఎందుకు నన్ను కాల్చనా ! రాత్రంతా ఆలోచించాను. నువ్వు చెప్పిందే సబబనిపించింది. ప్రొద్దుటే వెళ్ళి ఆ ఫైలులోని ఆ కాగితాలను జి.ఎమ్. ముఖాన పడేశాను. జి.ఎమ్. నన్ను మెచ్చుకున్నాడు. నా సిన్సియారిటీకీ జోహారు అన్నాడు. ఇవ్వవలసిన నాలుగు నెలల జీతం ఇచ్చి,

రేపటినుండే డ్యూటీలో జాయిన్ కమ్మంటూ ఆర్డర్స్, షేక్‌హాండ్ ఇచ్చి మరీ పంపాడు. ఇప్పుడు చెప్పు ! నందా ! నేను ప్రయోజకుణ్ణే కదూ !" ఆనంద చుట్టూ చేతులేసి, ముఖంలో ముఖం పెట్టి, అడిగాడు మన్మథ.

భర్త ముఖంలోకి సూటిగా చూడలేక, తప్పుచేసినదానిలా తల దించుకుంది, ఆనంద.

"చెప్పు నందా ! నీ కిపుడు సంతోషంగా వుంది కదూ !" ఆనంద వీపుమీద ముఖం రుద్దుతూ అన్నాడు, మన్మథ.

మరేం మాట్లాడలేని ఆనంద తన కంటనీటితో భర్త షర్టుని తడిపింది.

"నందా ! ఊరుకో. మన కష్టాలన్నీ గట్టెక్కాయి. ఇప్పు డీ కన్నీ రెందుకు ? పద. మన నూత్న జీవితాన్ని స్వీట్స్‌తో సెలబ్రేట్ చేద్దాం." పిల్లల వద్దకు ఆనందని నడిపించాడు, మన్మథ.

కొత్త బట్టలని, మిటాయిని, పండ్లని పంచేసుకొని, పువ్వులని, కొత్తచీరని అమ్మకి అందించారు పిల్లలు పరమానందంగా.

* * *

హాల్లో ఇంటర్వెల్‌ని వుద్దేశిస్తూ, గోల్డ్‌స్పాట్ - స్నాక్స్ కన్పించసాగాయ్.

తనకి పరిచయమున్న ముఖాలేమైనా కన్పిస్తాయేమోనని అటూ - ఇటూ చూస్తున్న ఆనంద వద్దకు వచ్చాడు, రామస్వామి.

"ఓ... మీరు కూడా వచ్చారే ! మీ మిసెస్ రాలేదా...?" అంది, చిరునవ్వు నవ్వుతూ ఆనంద.

"రాలేదమ్మా ! ఆవిడకి ఇటువంటి సినిమాలు నచ్చవ్. ఏవో పాతకాలపువి మార్నింగ్ షోస్‌కి మాత్రమే వెళ్తూంటుంది. అన్నట్లు మన్మథగారు రాలేదా ? పిల్ల లేరీ...?" అన్నాడు రామస్వామి.

"అందరం కలిసే వచ్చామండీ. మావా రిప్పుడే అలా పిల్లల్ని తీసుకొని బయటకు వెళ్ళారు."

"అలాగా...!" అంటూ రామస్వామి ఒక్క నిమిషం ఆగి, సందేహిస్తూనే, ఆనందగారూ ! నే నంతగా చెప్పి కూడ మీరు మీవార్ని వొప్పించలేకపోయారు కదండీ ! జి.ఎమ్. అగ్గిమీద గుగ్గిలమై పోతున్నాడు. వీలయితే మన్మథగార్ని క్రిమినల్ కేసులో కూడా ఇరికించాలని చూస్తున్నాడు. కొండని తలతో ఢీ కొనడం ఎందుకు చెప్పండి ?" మన్మథ దూరంగా రావటం గమనించిన రామస్వామి, మెల్లగా జారుకున్నాడు.

దిగ్భ్రాంతికి లోనయిన ఆనంద, కొంతసేపు తేరుకోలేకపోయింది. ఇంతలో భర్త - పిల్లలు రావటం, భర్త తనచేతిలో చిప్స్ ప్యాకెట్ పెట్టడం, వెంటనే సినిమా ప్రారంభం కావడం,




ఇవన్నీ క్షణంలో జరిగిపోయాయ్. సినిమాలో లీనమైపొయ్యారందరూ - ఒక్క ఆనంద తప్ప. ఆనంద మస్తిష్కంలో అనంత కోటి అనుమానాలు!

భర్త మాటలకి, రామస్వామి మాటలకి ఎక్కడా పొంతన కుదరడం లేదు. ఎవ్వరి మాట నమ్మాలి? ఎవ్వరిమాట తోసిరాజనాలి...?

భర్తకేసి తదేకంగా చూడసాగింది ఆనంద, ఎవరో కొత్తమనిషిని చూచినట్లు ఎంతో ఆనందంగ, మరెంతో ఆహ్లాదంగ వున్న తన భర్త తనకి అబద్ధం చెప్పవలసిన అగత్యమేమిటి? కానీ, రామస్వామి కేం పట్టింది, అసత్యమాడడానికి...? తెరమీద గ్రూప్ ఫోటో పడడంతో తన ఆలోచనలకి స్వస్తి చెప్పింది, ఆనంద.

సినిమానుండి ఇంటికి వచ్చిన మన్మథ హుషారుగ పిల్లలకి అన్నం పెట్టడంలో భార్యకి సాయపడ్డాడు. పిల్లలకి సినిమా చూడకముందున్న హుషారు, సినిమా చూచి వచ్చాక లేదు; అన్నాలు తినీ-తినక మంచాలకి అడ్డం పడ్డారు.

పిల్లల భోజనాలయ్యాక, భార్యా భర్తలిద్దరూ కూచున్నారు భోజనానికి

"ఒక కంచం చాల్లేవోయ్!" రెండో కంచాన్ని దూరంగా తోస్తూ అన్నాడు మన్మథ

తలెత్తి చూచిన ఆనందకి చిలిపి నవ్వులు చిందిస్తున్న భర్త కన్పించాడు.

మన్మథ నడిపించే ఆ రసవత్తర నాటకంలో తాను కూడ పాల్గొనదలచింది ఆనంద.

"మీ ఇష్టం," అంటూ ఒకే కంచంలో వడ్డించింది.

"నందా! ఇలా మనిద్దరం ఒకే కంచంలో తిని ఎన్నాళ్ళైందో కదూ!" మన్మథ అందిస్తున్న అన్నం ముద్దని చేతిలోకి తీసుకొని మనోహరంగా నవ్వింది, ఆనంద.

తనో ముద్దచేసి, భర్తచేతి కందించింది, ఆనంద.

"అబ్బ! ఎంత రుచిగా వుందీ పూట నీ వంట!" అంటూ, మన్మథ ఆనందని కవ్విస్తూ భోజనం పూర్తి చేశాడు.

ఆనంద వంటిల్లు సర్ది, పడుకునే గది లోకి నడిచింది. లోనికి వెళ్ళిన ఆనంద ఓ క్షణం నివ్వెరపోయి నిలబడిపోయింది. పక్కమీద తెల్లటిదుప్పటి పరిచివుంది. వాటిమీద మల్లెలు విరిసి సువాసనలు వెదజల్లుతున్నాయ్. మల్లెల సువాసనకు తోడు సుగంధ శృంగార పరిమళాలు. ఆశ్చర్యచకితయై గదిని పరికిస్తున్న ఆనందకేసి, ఆనందంగా చూశాడు మన్మథ.

"రా, నందా! అలా నుంచున్నావేం? పదేళ్ళనాటి మన తొలిరేయి గుర్తొచ్చిందా? అప్పటిలాగే - ఇప్పుడూ మంచందగ్గరికి నడిపించాలా?" మన్మథ మాటలికి నవ్వొచ్చింది ఆనందకి. అయోమయంగానే భర్త చెంతకి నడిచింది ఆనంద.

దరిచేరిన అర్ధాంగిని అత్యంత తమకంతో హృదయానికి చేర్చుకున్నాడు మన్మథ. ఊపిరి సలపలేనంత వుద్వేగంతో వూగించాడు. భర్త ఉధృత ప్రణయంలో కొట్టుకపోయిన ఆనంద మనస్సు - శరీరం, ఆనందంతో మూగవోయాయి...

ఆదమరచి నిద్రపోతున్న భర్తకేసి చూస్తూ అలాగే పడుకుంది ఆనంద. భర్త ప్రవర్తనని, పల్కులని, చేష్టలని అర్థం చేసుకోలేక ఇదమిద్ధమని సమన్వయపరచుకోలేక, ఆనంద బుర్ర పగిలిపోసాగింది. ఎంత ప్రయత్నించినా నిద్రపట్టడంలేదు ఆనందకు. కళ్ళు మూసుకొని పడుకున్న ఆనంద నిద్రా దేవి ఒడిలోనికి జారుకునేటప్పటికి, తన ఒడిలోని తన మన్మథ, మంచంమీది నుంచి జారుకున్నాడు.

ఏదో శబ్దానికి వులిక్కిపడి ప్రక్కకి తిరిగి చూచింది, ఆనంద. తన ప్రక్కన భర్త లేడు. గబుక్కున లేవబోయిన ఆనంద, గదిలో ఒకమూలవంగి, సూట్ కేస్ లోంచి ఏదో బయటకు తీస్తున్న భర్తను చూచి ఆగిపోయింది. భర్త దృష్టిలో పడకుండా, అలాగే పడుకొని, భర్త చేష్టలని గమనించసాగింది.

సూట్ కేస్‌లోంచి అట్టపెట్టె నొకదాన్ని బయటకు తీసాడు మన్మథ. అందులోంచి




ఇంజెక్షన్‌ని సిరంజిని తీసి టేబిల్‌పై పెట్టి మంచంకేసి చూశాడు. వెంటనే కళ్ళుమూసుకొని నిద్రనభినయించ సాగింది ఆనంద.

సిరంజిలోకి మందును ఎక్కించి మళ్ళీ భార్యకేసి చూశాడు మన్మధ. పాపం ఆదమరిచి నిదురోతోంది, ఆనంద అనుకున్నాడు. లేచి, పిల్లలున్న గదికేసి నడువబోయాడు. మళ్ళీ ఏమనుకున్నాడో ఏమో ఆ ప్రయత్నం విరమించాడు. ఓ మారు సిరంజికేసి చూచి మెల్లగా ఆనంద పడుకున్న మంచంవేపు నడిచాడు.

ఉలిక్కిపడింది ఆనంద మన్మధని చూచి. ఇదేంటి? ఈయన ముఖం ఇంత వికృతంగా వుంది? ముఖంనిండా ఆ చెమటేంటి? ఎందు కలా వణికి పోతున్నాడు! చూద్దాం! ఏమవుతుందో! అని మళ్ళీ నిద్ర నభినయించింది, ఆనంద.

ఆనంద ముఖంకేసి దీర్ఘంగా చూచి, గబుక్కున వంగి ఆమెచేయి అందుకున్నాడు మన్మధ.

భర్త చెయ్యి తనమీద పడగానే చివ్వున లేచి కూచుంది ఆనంద. అదిరిపోయాడు మన్మధ. ఒక్కడుగు వెనక్కి వేశాడు.

"ఏమిటి మీరు చేస్తున్న పని...!?" ప్రశ్నించింది ఆనంద. జవాబు చెప్పటానికి తటపటాయించాడు మన్మధ.

"చెప్పండి ! ఎందుకిస్తున్నారు, నా కీ ఇంజక్షన్ ? నాకేం జబ్బుచేయలేదే !"

ఈమారూ సమాధానం చెప్పలేదు మన్మధ. అతనిచేయి మాత్రం వణక సాగింది.

"ఏమండీ ! నా ముఖం చూచి నిజం చెప్పండి. ఆ సిరంజిలో వున్నది విషం కదూ !"

పట్టుబడిపోయినట్లు తల వంచుకున్నాడు మన్మధ.

"మీ రెంతపనికి సిద్ధపడ్డారండి ! కట్టుకున్న భార్యకే విషమిచ్చి చంపాలన్న సత్సంకల్పం ! పోనీ, అదీ మంచిదే ! భర్తచేతుల్లో మరణించడం కన్న భార్యకి కావలసినదేమున్నది ? కానీ, నన్ను చంపి మీరు పొందగోరే లాభమేమిటి ? నా పేర ఇన్సూరెన్స్ లేదే ! నా పేర ఏ ఆస్తిపాస్తులు లేవే!!"

"నందా ! నందా !!" గట్టిగా అరిచాడు మన్మధ

"ప్లీజ్, చెప్పండి! నేను చనిపోవడమే మీ కోరికయితే, ఇదో ఇప్పుడే ఇంజక్షన్ చేసుకొని సంతోషంగా చచ్చిపోతాను. కాని, మీరు పిల్లలు సుఖంగా బ్రతుకుతామని మాత్రం మాట యివ్వండి" చెయ్యి చాపుతూ, దృఢ నిశ్చయంతో అంది ఆనంద.

"నందా ! ఆనందా ! ! నన్నెంత అపార్థం చేసుకుంటున్నావ్ ? నువ్వు చనిపోయాక నేను, పిల్లలు బ్రతికుంటామనే నీ వుద్దేశ్యమా ? నీతోపాటే మేమూ...!"

"అంటే అందరికీ ఇలాగే విషపు ఇంజక్షన్లు ఇచ్చి చంపేస్తారన్నమాట !"

దానికేం సమాధానంలేనట్లు చూశాడు, మన్మధ.

"ఎంత పనికి ఒడిగట్టారండీ ? కుటుంబాన్ని పోషించలేక ఈ నిర్మూలన పద్ధతికి దిగజారారన్నమాట ! హుం ఇటువంటి అఘాయిత్యానికి తలబడతారని రాత్రి సినిమాహాల్లోనే ఊహించవలసింది కాని, అంత దూరం ఆలోచించలేకపోయాను."

"హూ...! అప్పు తెచ్చి...! అలా ఎన్నాళ్ళు ? ఒకని దగ్గర తలవంచి, దేహీ ! అని చేయిచాపడంకన్న, ఒక్కసారి అందరం చనిపోవటమే మేలనే యీ నిశ్చయానికి వచ్చాను. నాకు బి.ఎ లో వచ్చిన బంగారు పతకాన్ని తెగనమ్మాను. పిల్లలకు పిడికెడు అన్నం పెట్టలేని ఆ గోల్డ్ మెడల్, కనీసం ప్రశాంతంగా కనుమూయటానికైనా ఉపయోగపడితే మేలనుకున్నాను ఆనందంగా నిద్రపోయిన నా పిల్లలు ఆనందంగానే మరణిస్తారు. నందా ! ప్లీజ్ ! నిన్ను వేడుకుంటాను. నాతో సహకరించు, నా మనస్సాక్షిని చంపు

కాని నేనో క్షణమైనా బ్రతకలేను. నన్ను నమ్ముకున్న మిమ్మల్ని, నడివీధిలో అనాథులుగ వదలలేను. అందుకే నాతోబాటు మీరూ !"

ఎవరో కొత్తమనిషిని చూచినట్లు చూసింది, ఆనంద.

"అంటే మన మందరం చనిపోవడమే దీనికి పరిష్కారమా ?"

"అంతకన్న ఇంక వేరే మార్గంలేదు. నేను లేక నువ్వు లేవు. మనిద్దరంలేక పిల్లలు లేరు. పద పిల్లలకి ఇంజక్షన్ యిచ్చి ఆ పిమ్మట మనిద్దరం ఒకే మారు ఇంజక్షన్ చేసికొని ఒకరిచేతుల్లో ఒకరం..."

మన్మథ చేతుల్ని విదిలించి లేచి నుంచుంది, ఆనంద.

ఆనంద ముఖంలో అంతులేని గంభీరత.

ఇంత చదువులు చదివి, ఎంతో జ్ఞానం, అనుభవం సంపాదించిన మీరు కేవలం బ్రతుకుతో పోరాడలేక పిరికి పందలాగ పారిపోవడమా...?"

"నువ్వేలాగయినా భావించుకో ! నా కనవసరం. నా తుది నిశ్చయం, నిర్ణయం మారదు."

"అంటే ! మీరు చనిపొమ్మనగానే మేము మీ ఆజ్ఞను శిరసావహించాలా ?"

దెబ్బతిన్నట్టు చూశాడు, మన్మథ ఆనందకేసి —

అదే నిశ్చల గంభీరత! ప్రళయానికి ముందు కనిపించే ప్రశాంతత !!

"ఓహో ! మిమ్మల్ని చంపే అధికారం నాకు లేదన్నమాట. నీమీద లేదేమోకాని, నేను జన్మనిచ్చిన నా పిల్లలమీద నాకున్నది అధికారం !"

ఒకవిధమైన ఉన్మాదం చోటు చేసుకున్నది మన్మథలో.

విరక్తిగా నవ్వింది, నందా! మళ్ళీ మళ్ళీ నవ్వింది !

"మీరు జన్మ నిచ్చిన మీ పిల్లలు ! బాగుంది ! ఫలానా రోజున ఫలాన బుల్లి బాబును కంటున్నాను — అన్న దృఢ నిశ్చయంతో కన్నారా ? కేవలం మీ ఆనందసమయంలో మీ ప్రమేయం లేకుండా ఆవిర్భవించిన జీవులండీ అవి."

ఆనంద మాటలకి మరొక్కమారు అదిరిపోయాడు, మన్మథ. వెనువెంటనే చెప్పలేనంత కోపం ముంచుకొచ్చింది.

"ఈ వితండ వాదాలు నా కనవసరం. నేను చెయ్యదల్చుకుంది తప్పక చేసి తీరుతాను."

గబగబ పిల్లలున్న గదిలోకి నడిచాడు, మన్మథ.

సుడిగాలిలా ముందుకు సాగిన ఆనంద, పిల్లలకి భర్తకి మధ్య నిలబడ్డది. ఆవేశంతో వూగిపోతూ, విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయిన భర్త కాళ్ళపై పడిపోయింది. పండుటాకులా వణికి పోతూ, బావురుమంది.

"ఏమండీ! ఒక్కమారు, ఒకే ఒక్క మారు, ఆ పసికందులకేసి కన్నెత్తి చూడండి. వాళ్ళేం పాపం చేశారని

వాళ్ళ చిరుతేత జీవితాలిలా అర్ధాంతరంగ అంతరించాలి? కవిత, గీతలు ఇద్దరూ నా రెండు కళ్ళు - అని వాళ్ళని నెత్తిమీద కెక్కించుకునేవారే ! మీరేనా వాళ్ళ కళ్ళని శాశ్వతంగా మూసివేసేది!! ఆదమరచి నిదురోతున్న ఈ కసికందులకు విషం ఎలా ఇవ్వగలరండీ....? మీరు నిజంగా మనుషులేనా...? మీది నిజంగా హృదయమేనా...?" భార్య పరుషమైన మాటలు వింటూ చేష్టలుడిగి నిలబడ్డాడు, మన్మధ.

భర్త మౌనాన్ని ఆసరాగా చేసికొని, ఆనంద గబగబ లేచి పిల్లల్ని నిద్ర లేపింది. సగం నిద్రలో లేచి, లేవక మత్తు మత్తుగ తల్లిదండ్రులకేసి చూడ సాగారు, పిల్లలు.

"ఆనందా ! ఎంత పనిచేశావు ? కన్నబిడ్డల ఎదుట దోషిగా నిలబెట్టావా నన్ను...?" గిరుక్కున వెనుతిరిగి గదిలోకి వెళ్ళిపోయాడు మన్మధ. అతని వెనువెంటనే పరుగెత్తిన ఆనంద, మన్మధ గది తలుపులను బంధించనీయ కుండ అడ్డుపడింది.

"వదులు, ఆనందా ! నిన్నుకాని, పిల్లల్నికాని నేను చంపను. చంపలేను. ఆ హక్కు నాకు లేదని నువ్వేగా నిరూపించావ్. అసమర్ధుడనైన నేను ఈ ప్రపంచంలో బ్రతకను. బ్రతకలేను. బ్రతకకూడదు..." రోషావేశం ముప్పిరి కొంటూన్న భర్తచేతిలోని సిరంజిని బలవంతంగా లాగి నేలకేసి కొట్టింది, ఆనంద.

ఆదిశక్తివలె నిలబడిన ఆనందకేసి, బ్రద్దలయిన సిరంజికేసి చూడసాగాడు మన్మధ.

ఆవేశం దిగిపోయిన మన్మధ మంచం మీద జారగిలబడి రోదించసాగాడు. భర్తని అనురాగంతో తన ఒడిలోకి తీసుకుంది ఆనంద. తల్లిలా తన ఎదపై భర్తతలని చేర్చుకుంది.

"మీరు జీవన్మృత్యులు కారండీ ! మృత్యుంజయులు కావాలి. భగవంతుడు మన కిచ్చిన అమూల్యమైన వరాలండీ మన ఈ జీవితాలు. వీటిని అర్ధాంతరంగ అంతరింపజేసే అమానుష కృత్యాలను మనం చేయకూడదండీ ! కష్టాలు వచ్చినప్పుడే వాటికి ఎదురొడ్డి నిలబడాలి. చనిపోవటమే కష్టాలకి పరిష్కారమైతే రోజు కెంతమంది చనిపోవాలి ? అవిటివారు, దీర్ఘరోగులు, అన్నాహారాలకి అలమటించే అనాధలు - అభాగ్య జీవులు ఎందరో - ఎందరెందరో ధైర్యంగా బ్రతుకులు కొనసాగిస్తూ వుంటే — మీరు...కేవలం..."

"నందా ! ఇవన్నీ నేను ఆలోచించలే దనుకున్నావా ? ఆలోచించి ఆలోచించి నా బుర్ర బ్రద్దలయింది. ఇంతకన్న మార్గం నాకు కన్పించలేదు..." భార్య పరిష్వంగంలో సేదతీరిన మన్మధ కొద్ది కొద్దిగా మామూలు స్థితికి వస్తున్నాడు.



"నిజంగా మీకు ఈ వుద్యోగం చెయ్యడం యిష్టం లేకుంటే, ఈ ఉద్యోగమే కాదు - ఈ ఊర్నే వదిలి అజ్ఞాతంగా ఎక్కడయినా బ్రతుకుదాం. కాళ్ళుచేతులు ఇచ్చాడు భగవంతుడు. కొద్దో-గొప్పో చదువుకున్నవాళ్ళమే ఇద్దరం. ఎలాగో బ్రతక్కపోము."

"అవన్నీ నువ్వనుకున్నంత సులభం కాదు నందా...!"

"అంతే అన్నిటికన్న సులభం చంపడం - చనిపోవడం అన్నమాట.."

"నందా!" బాధగా చూశాడు మన్మథ.

"చూశారా! 'చంపడం' - ఈ మాటంటేనే మీ కెంత బాధగా వుందో! మీరు మామూలు మనిషయ్యాక, మీ మనస్సు మీ స్వాధీనంలోకి వచ్చాక చీమను కూడా చంపలేరండీ! ఆ క్షణం ఆ ఘోరనిశ్చయానికి మిమ్మల్ని వుసికొల్పిన ఆ భయంకర క్షణం దాటిపోయిందండీ! ఏ భర్త తలని మరింత గట్టిగా హృదయానికి హత్తుకుంది ఆనంద.

---




"అయితే నేను చెప్పినట్లు చేయడానికి ఒప్పుకున్నట్లేగా?"

సుమిత్ర కంఠం ఖంగుమంది-ఆమె కళ్ళలో ఉత్సాహం ఉరకలు వేస్తూంది-ఫ్లాస్క్‌లోని కాఫీ కప్పులోనికి వొంపుకుని సిప్‌చేసి, కిటికీ దగ్గరకు వెళ్ళింది-మేడమీంచి కిటికీగుండా చూస్తే ఆకాశంలో నందకుమారుడిలా చంద్రుడు-చుట్టూ గోపికల్లా తెల్ల మేఘాలు - ఆ రాసకేళిలో తడుస్తూ క్రింద పచ్చటి పందిరి ఆ పందిరి - క్రింద విద్యుద్దీపాల వెలుగులో పెళ్ళిపీటల మీద పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ-

కిటికీలోంచి వచ్చిన గాలితో పాటు మంగళనాధం, సుగంధపరిమళమూ సుమిత్రను తోసుకు లోపలికి వచ్చాయి.

"ఏవిఁటి? మాట్లాడరేం-అయితే మీ యిద్దర్లోనూ ఎవరికీ నమ్మకాల్లేవన్న మాట" అంది తిరిగి.

అద్దం ముందు కూర్చుని తల దువ్వుకుంటున్న అమృతం, పిల్లాడిని జో కొడుతూ వాడి ప్రక్కనే నడుం వాల్చిన

నిర్మల సుమిత్రవంక చూశారు-చూసి ఒకర్నొకరు చూసుకున్నారు.

"సరే-నేను రడీయే" అంది నిర్మల పిల్లాడిని తప్పించుకుని లేస్తూ-

"వెరీ నైస్. అలా వుండాలి ధైర్య మంటే" అని, తాగిన కప్పును ఓ మూలగా వుంచి నిర్మల లేచిన చోట్లోనే దిండు జరుపుకుని నడుం వాలుస్తూ "మరి నీ సంగతేమిటే?" అని అమృతం వంక చూసింది సుమిత్ర.

"అదే ఆలోచిస్తున్నాను-మా ఆయనేం నీ ప్రియుడిలా చదువుకున్నవాడూ, నిర్మల మొగుడిలా ఉద్యోగస్తుడూ కాదుగా – అయినా ఒక్కవిషయంలో అనుమానం..." అంటూ ఆగిపోయి, యిద్దరివంకా చూసింది అమృతం.

మోచేతులమీద తలనాన్చినదల్లా వెల్లకిలా పడుకుని, "యేవిటో చెప్పు-మీ యెవ్వరి సంసారాల్లోనూ నిప్పురాజుకోకుండా, ఏ అనుమానాలూ తలెత్తకుండా చూసే బాధ్యత నాది" అంది సుమిత్ర నిర్భయంగా.

"అదే నేనూ అనబోతున్నది – మగవాళ్ళతో సమానమంటూ యూనివర్సిటీ చదువు వెలగబెడుతున్నదానివీ, పెళ్ళికానిదానివీ కాబట్టి నీకేం ఫర్వాలేదు-ఏపాటి తిరకాసైనా మా సంసారాల్లో గొడవలు తప్పవు. అయినాసరే ఒప్పుకొంటున్నాం-మా యిద్దర్లో ఎవరు గెల్చినా నువ్వు మా యింటికి యిడ్నించిదే వచ్చి రెండురోజులుండాలి-ఇక నువ్వే గెల్చి మేం ఓడిపోతే యేంచేయాలో నువ్వే చెప్పు" అంది నిర్మల.

"యేముంది – మీరెలాగూ నాతో రాలేరు గాబట్టి, మీరొచ్చినా హాస్టల్ వాళ్ళు వూరుకోరు గాబట్టి నా పెళ్ళి ఎక్కడ జరిగినా పదిరోజులు ముందుగానే మీరు మీ శ్రీవార్లతో వచ్చి తీరాలి, సరా."

"సరేగానీ ముందీ పెళ్ళి చూడనిస్తావా చూడనీయవా?" అంది అమృతం లేచి చీర కుచ్చెళ్ళు సర్దుకుంటూ.

"పెళ్ళి చూసేదేమిటే నీ బొంద-ఆ పురోహితు దేమంటున్నాడో మనకి అర్థంకాదు గదా – ఆ సన్నాయిమీద వాయించేది ఏ రాగమో, వాటి స్వరాలేమిటో అంతకంటే అయోమయంగదా-ఇక పుస్తెముడీ, జీలకర్రా బెల్లం, తలంబ్రాలూ, చుట్టుపక్కల వాళ్ళ నవ్వులూ – కొత్తవేమున్నాయి? అన్ని పెళ్ళిళ్ళూ యింతేగా!"

"అలా అయితే మనమెందుకు ఇక్కడకు రావటం? ముప్పూటలా తిని ఆడపెళ్ళివార్ని ఆర్పేందుకు కాకపోతే."

"అలా అన్నావ్, బాగుంది-పెళ్ళికి ఎంతోకొంత ఖర్చుపెడదామని ముందే అనుకుంటారు-కాబట్టి అది నువ్వు తిన్నా నేను తిన్నా పైన పారబోసుకున్నా ఒక్కటే-మనం తినకపోతే వాళ్ళకి మిగిలేదీ వుండదు-తిన్నందువల్ల తగిలిందీ

వుండదు-ఇక మనం ఎందుకొస్తాము అంటే యిందుకే! నిజం చెప్పు- మన ముగ్గురిమీ కల్సుకుని ఎన్నాళ్ళయింది? మీ పెళ్ళిళ్ళకి శుభలేక ముక్క తప్ప స్వయంగా ఉత్తరమన్నా రాశారా? కాలేజీలో ఎలా వుండేవాళ్ళం? మళ్ళీ యిన్నాళ్ళకిలా కల్సుకున్నాం - మరి పెళ్ళిళ్ళకు రాకపోతే ఎలా?"

"ఇన్ని విమర్శలు చేస్తున్నావ్. మరి నీ పెళ్ళెలావుంటుందో అదీ చూస్తాంగా" అంది నిర్మల.

"ఎలా వుంటుందీ-నీలాంటి స్నేహితు రాళ్ళందరూ వస్తారు. సర్దాగా కబుర్లు చెప్పుకుంటాం-సిన్మాలు చూస్తాం. కాల క్షేపం చేస్తాం-ఆరోజు రిజిష్ట్రారాఫీసులో దండలు మార్చుకుంటాం-ప్రెజెంటేషన్లు పుచ్చుకుని టాటాలు చెప్పేస్తాం."

"నీ ప్లాను బాగానేవుందిగానీ-ముందీ పెళ్ళి చూడకపోతే బాగుండదు. పద పద" లేచింది అమృతం.

2

ఐదు నిముషాల్లో ఉత్తరం రాయడం పూర్తి చేసింది సుమిత్ర - ఆమె కళ్ళు ఇప్పుడు సంతృప్తిగా మెరుస్తున్నాయి-

"భార్య యిష్టాయిష్టాలకు ఎంత విలువిచ్చే భర్తయినా కొన్ని కొన్ని సమయాల్లో అనుమానమనే రక్కసి వలలో పడి, 'నీవే నా సర్వస్వం, నీ స్వేచ్ఛే నా స్వేచ్ఛ' అంటూ కూడా స్త్రీని శాసించి తన అధికృతను నిరూపించుకోక మానదు." అంటుంది సుమిత్ర.

"స్త్రీ కూడా తనకున్న స్వేచ్ఛను దుర్వినియోగపరచకుండా వుంటే ఏ పురుషుడూ స్త్రీని అడ్డడు" అంటుంది నిర్మల.

"ఒక జీవితాన్ని పంచుకున్న దంపతులకు వేర్వేరుగా స్వేచ్ఛ లెందుకు?" అంటుంది అమృతం.

ఎంత చర్చించినా తన వాదమే నిజ మంటుంది సుమిత్ర-చివరకు పందాల వరకూ వచ్చింది-సుమిత్ర తెలివైనదీ చురుకైనదీ- ఒక చిన్న అబద్ధాన్ని సృష్టించి నిజానిజాల్ని బయటకు లాగ టానికుద్యుక్తురాలైంది-

"నేను మావారికి ఉత్తరం రాశాను- ముందు నువ్వు నీ సుధాకర్‌కేం రాశావో చూపించు" అంది నిర్మల కవరుమీద ఎడ్రసు రాస్తూ

"ఏముందీ మీలా మాకు నమస్కారాలూ, ముద్దులూ వుండవుగా. చూడు" అంటూ ఉత్తరాన్నందించి అమృతం వంక చూసింది సుమిత్ర-తాపీగా ఆలోచిస్తూ ఉత్తరం రాస్తోంది అమృతం.

"ఏవిటే బాబూ-మీ ఆయనకి ఆవ కాయ పాళ్ళూ, ఆరోగ్య సూత్రాలూ రాస్తున్నావా యేమిటి ఖర్మ-అబద్ధం అని తెలియకుండా నాలుగు ముక్కలు రాసి యిలా పడెయ్యి" అంది.

"అయిపోయిందయిపోయింది - ఉత్త

రంలో మా అత్తగార్ని అడిగినట్టు రాయకపోతే ఆవిడూరుకోదు," అంటూ ఉత్తరాన్ని పూర్తిచేసి అందించింది అమృతం.

ప్రతి ఒక్కరూ ముగ్గురు రాసిన ఉత్తరాలూ చదివాకనే పోస్టుచేసి జవాబుల కోసం ఎదురుచూడసాగారు.

3

మూడోనాటి మధ్యాహ్నానికి నిర్మలకు వాళ్ళాయన దగ్గరనుండి ఉత్తర మొచ్చింది-

"నీ పాత స్నేహితుడు అనుకో కుండా పెళ్ళిలో కలిసి తన యింటికి రమ్మని బలవంతం చేస్తున్నాడు అని రాశావు-నిజంగా చాలా సంతోషమే-జీవితంలో పాత కొత్త లెరుగనిది స్నేహ మొక్కటే-ఆయన నువ్వన్నట్లు భావు కుడు, మంచివాడూ కావచ్చు. కాని స్త్రీ పురుషుల మధ్య నిజమైన స్నేహం ఎప్పుడోగాని నిరూపితమవదు-ఆయన వివాహితుడే అని రాశావు. అంతా మన లాగే వుంటారని ఎప్పుడూ అనుకో కూడదు - ఈపాటికి నే చెప్పేదేమిటో గ్రహించేవుంటావు. స్త్రీ కి స్త్రీయే శత్రువు-కాబట్టి నువ్వు వెళ్ళకపోవడమే శ్రేయస్కరం."

-ఇదీ ఆ వుత్తరంయొక్క సారాంశం.

నిర్మల ముఖం చిన్నబోయింది.

"అమ్మో. మీ ఆయన తెలివైన వాడేనేవ్-తన అయిష్టత సూటిగా చెప్పడం యిష్టంలేక వాళ్ళ సంసారంలో గొడవలేమన్నా వస్తాయని వెళ్ళొద్ద న్నాడు - ఏది ఏమైనా నీకు గ్రీన్ సిగ్నల్ రాలేదు. ఇక ఈవిడగారి కేమని వస్తుందో చూడాలి" అంటూ అమృతం వంక చూసింది సుమిత్ర.

"మా వారి అభిప్రాయం మాటెలా వున్నా ఆయనకు ఉత్తరం రాయడ మంటేనే బద్ధకం-నా కుత్తరం రాదు చూడండి" అంది అమృతం.

"నోనో-అదేం కుదరదు-ఉత్తరం రాకపోతే మీ ఆయన కిష్టం లేనట్టేలెక్క-రేపు సాయంత్రానికల్లా ఉత్తరాలు వచ్చి తీరాలి" నిష్కర్షగా చెప్పింది సుమిత్ర.

"నేను ముందే చెప్పాను - ఆపై నీ యిష్టం" అంది అమృతం నవ్వుతూ.

ఆ మర్నాడు మధ్యాహ్నం సుమిత్రకు సుధాకర్ దగ్గరనుండి ఉత్తర మొచ్చింది. అందులో మూడే మూడుముక్కలున్నాయి.

"నువ్వు నిజంగా వెళ్ళాలనుకున్న ప్పుడు నా అనుజ్ఞ దేనికి సుమిత్రా - నీ యిష్టం"

ఎగిరి గంతేసింది సుమిత్ర.

"ఇప్పుడన్నా తెల్సిందా మగవాడంటే ఎలా ఉండాలో-" స్త్రీకి స్వేచ్ఛ యిస్తే ఏమైపోతుందోనని భయపడి పెళ్ళాన్ని తమ చెప్పుచేతల్లో వుంచుకుంటూ, తమకూడానే తిప్పుకునే మగాళ్ళంటే నా కెప్పుడూ మంచి అభిప్రాయంలేదు-అందుకే అన్నారు 'పురుషులలోన పుణ్య పురుషులు వేరయా...' అని."

"అవునవును - అది అన్నవాళ్ళే ఆడదానికి స్వేచ్ఛ పెళ్ళయ్యేవరకే అని కూడా అన్నారు" అంది నిర్మల కోపంగా.

"పోనీలేవే నువ్వే గెలిచావు. ఒప్పుకుంటున్నా సరా" అంది భర్తనుంచి ఉత్తరం రాని అమృతం-

"ఒప్పేసుకుంటే సరికాదు — నా పెళ్ళికి పదిరోజులు ముందుగా రావాలి తెల్సా-మీ వానపాముని కూడా తీసుకు రావాలి సుమా" అంది సుమిత్ర నవ్వుతూ -

## 4

"హలో సుమిత్రా - ఏమిటీ పెళ్ళి కెళ్ళి యిన్నాళ్ళుండిపోయావ్" అంది లావణ్య హాస్టల్లో అడుగుపెట్టగానే—

"ఎన్నాళ్ళకో ... మూణ్ణాళ్ళకో దీన్ని వుండమని వుంటారు." జోకేసింది సౌజన్య.

గొల్లుమన్నారంతా.

"సంతోషించాంగాని నా కోసం ఎవరన్నా వచ్చారా" రూంలోకి వెళ్ళబోతూ అడిగింది.

"ఎవరో ... వస్తారని ... ఏదో యిస్తారని ఎదురుచూసి మోసపోకుమా"

పాట నందుకుంది రత్నమాల.

స్నానం చేసి డ్రస్ మార్చుకునే సరికి రాధ వచ్చింది -

"యేదో కారణముండే వుండాలి నువ్విన్నాళ్ళున్నావంటే" అంటూ—

"యేంలేదే-చిన్న పందెం కాసేను" అంటూ వివరంగా చెప్పింది సుమిత్ర -

"మొత్తానికి గెల్చావ్" అని, 'అన్నట్టు మొన్న మీ సుధాకర్ వచ్చాడోయ్-నువ్వు లేవంటే ఓ కవరు యిచ్చి వెళ్ళాడు" అంటూ లేచి పెట్టెలోనించి కవరుతీసి అందించిండి-ఆత్రంగా కవరు చింపి చదవటం మొదలుపెట్టింది సుమిత్ర—

మనిషికి అన్నపానీయా లెంత ముఖ్యమో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ అంతే ముఖ్యం. కాదనను-కానీ మన మేర్పరుచుకున్న యీ సంఘనియమాలు, సాంఘిక నీతులూ, సాంప్రదాయాలూ స్త్రీకి కొన్ని విలువల్ని ఆపాదించడం కోసం కొన్ని కట్టుబాట్లను కూడా ఏర్పరచాయి. వీటన్నిటినీ ఎందుకు ఏకరువు పెడుతున్నానో నీకు తెల్సు-నా గౌరవం నిలిపేందుకే నువ్వు నా పర్మిషన్ అడిగావని నీ వుత్తరం చూస్తేనే అర్థమైంది-సంతృప్తికరంగాలేని నా సమాధానాన్ని చూసైనా నువ్వు నీ ప్రయాణాన్ని మానుకుంటావని ఆశపడ్డాను.

నా పిరికితనానికి నువ్వేమనుకున్నా ఫరవాలేదు—కానీ ఒక్కమాట! - నువ్వీ కుటుంబంలో యిమడలేవు-పెళ్ళి చేసుకుని నీ జీవితాన్ని తెలిసీ నరకం చేయలేను. అందుకే మా నాన్నగారి ఆజ్ఞమేరకు మామయ్య కూతురు రేఖను నా జీవితంలోకి ఆహ్వానిస్తున్నాను.

నన్ను క్షమించు.

— సుధాకర్

# దినభటు



కలువకొలను సదానంద

ఆనాడు జనమేజయ మహారాజు సర్పయాగం తలపెట్టాడన్న వార్త విని, ప్రాణాలమీద తీపిచేత దేవేంద్ర సింహాసనానికి చుట్టుకుపోయాడు తక్షకుడు!... నరహరిపేటలో పెద దానవయం, చినదానవయ్య అనే మిత్రద్వయం ఈనాడు శునకయాగం తలపెట్టగా - శరణుజొచ్చే దిక్కులేక, అతి జాగరూకతతో నడయాడసాగింది ఫకీరు కుక్క.

నరహరిపేట ఒక చిన్న గ్రామం. ఆ గ్రామంలో అన్ని కులాలవారు,

అన్ని వృత్తులవారూ ఉన్నారు. రైతులది కొంచెం పెద్ద సంఖ్య. అన్నీ మట్టి మిద్దెలు, పూరిండ్లు, పెంకుటిళ్ళే తప్ప మరొకవిధమైన కట్టడమే కానరాదు. విద్యుచ్ఛక్తి సరఫరా లేదు. ఇంతవరకు నరహరిపేటకు రైలు టిక్కెట్టు కొన్న మనిషి ఇహలోకంలోగానీ, పరలోకంలో గానీ లేడు. గుట్టల నడుమ మలుపులు తిరుగుతూ, ఎర్రటి దుమ్ముతో సింగారించబడిన సన్నటి కంకరబాట ఒకటి ఆ ఊరికి సాగిపోతుంది! ఊరికి తూర్పుగా చిన్న చెరువు, చెరువుక్రింద కొంతమేర పచ్చని పైరులు, మిగిలిన మూడుదిక్కులా చిన్న చిన్న గుట్టలు, అక్కడక్కడ కానవచ్చే మెట్టచేలు – ఇదే ఆ ఊరి ప్రకృతి. మనిషి అరణ్య మధ్యంలో ఉన్నా – నీతి, న్యాయం పరిపాలింపబడాలి కాబట్టి, ఆ ఊళ్లో చిన్న పోలీసుస్టేషను ఉన్నది.

రెండేండ్లుగా వానలు పడనికారణంగా నరహరిపేటలో వ్యవసాయం మంద గించింది. గాదెలూ గరిసెలూ అన్నీ ఖాళీ అయిపోయాయి. రైతుల పాలిట గడ్డురోజులు తారసిల్లాయి. విజ్ఞానము, విచక్షణ ఉన్న మానవుడే కడుపు కోసం ఘాతుకాలకు ఒడిగట్టుతున్నప్పుడు పాపం, నోరులేని కుక్కలు చట్టిలో ముట్టె దూర్చకుండా ఎలా ఉండగలవు?

పెదదానవయ్య, చినదానవయ్య కూడా కాటకానికి గురైన గృహస్థులే! వారివి ఒడిదుడుకులు లేక సాఫీగా సాగి పోయే సంసారాలే అయినా, చేతి కంది నంతవరకూ అప్పుచేసి, శెట్టిగారి కొట్లో సన్నమూకలు, పుచ్చిన జొన్నలు కొని తినక తప్పలేదు. ఆ కబళాన్ని కూడా వంటింట్లోనుంచి ఊరకుక్కలు కాజేసిన సంఘటనలు రెండు మూడు జరగడంతో ఆ ఇద్దరూ ఉగ్ర నరసింహమూర్తు లైపోయారు. కంటబడిన కుక్కనల్లా అక్కడికక్కడే కడతేర్చివేయడానికి కంకణం కట్టుకొన్నారు.

ఈ విషయంలో పెదదానవయ్యకు చినదానవయ్య పోటీమాత్రం ఉధృతంగా సాగింది. ఒకడి స్థాయిని అతిక్రమించ డానికి మరొకడు ఉరకలు వేశాడు. "నే నీ రోజు రెండు కుక్కల్ని చంపాను..." అని పెదదానవయ్య కనుబొమ లెగరేస్తే "నేను మూడింటిని మట్టుబెట్టేశానులే!" అంటూ మీసం దువ్వేవాడు చిన దానవయ్య. చినదానవయ్య మూడు కుక్కలకు ముక్తిని ప్రసాదిస్తే, వాటి వెనుక నాలుగింటినైనా సాగనంపడం తనకు కీర్తికారకం అనుకునేవాడు పెదదానవయ్య.

ఈ హత్యాకాండ ఇలా కొనసాగి పోతుండగా, కుక్కలపట్ల వారికి గల ద్వేషం కూడా ఆకాశానికి గోడ కట్టినట్లు పెరిగిపోసాగింది.

పెదదానవయ్య ఇంట్లో ఉండగానే సంగటిచట్టి నాకిపోయింది ఒక కుక్క.





ఒక రాత్రిపూట చినదానవయ్య తన యింటి అరుగుమీద చలికి వెచ్చగా దుప్పటి కప్పుకొని నిద్రపోతుంటే, అతని ప్రక్కనే దుప్పటి ముసుగులో దూరి హాయిగా పడుకొంది ఇంకొక కుక్క.

పెదదానవయ్య భోజనం చేస్తూఉంటే – దగ్గరకు దగ్గరకు వస్తూ కంచంలో అన్నాన్ని తదేకంగా చూస్తూ, అతనికి దిష్టి పెట్టింది మరొకటి.

చినదానవయ్య ఇంటి గడపలో కూర్చుని చుట్ట కాల్చుకుంటూఉంటే – అతడున్నాడన్న భయభక్తులు లేకుండా ఇంటి లోపలికి లంఘింపజూసింది వేరొకటి !

కుక్కలపైన వారి ద్వేషం మహోన్నతమైపోవడానికి ఇవన్నీ కూడా కారణాలు.

నరహరిపేటలోని కుక్కలకు వినాశకాలమే దాపురించింది. దానవయ్యల చేతులనుంచి విసరబడిన ఆయుధం ఎట్టిదైనా సరే – అది రామబాణమే ! కదవలోని కవ్వం మజ్జిగను, వెన్నను వేరుచేసినట్టు – అది కుక్క ప్రాణాన్ని శరీరాన్ని వేరుచేసేది. రాను రాను వారిద్దరి దర్శనం సింహదర్శనమై పోయింది కుక్కలకు. పెదదానవయ్యో, చినదానవయ్యో కనుచూపుమేరలో కనిపిస్తేచాలు–అయ్యవారిని చూచిన బడి దొంగల్లా అడ్డదారుల్లో పడి పరుగులెత్తేవి. ఈ ఉద్యమంలో యుక్తులూ, ఎత్తుగడలూ కూడా అవలంబించారు వారు. రాను రాను ఇది వారికొక వినోద క్రీడగా కూడా పరిణమించింది.

ఊరిలోని కుక్కల సంఖ్య చాలవరకు తగ్గిపోయింది. ఇక కొద్ది కుక్కలతో బాటు, ఫకీరు కుక్క కూడ మిగిలిపోయింది. దాన్ని దాని అన్నల జాబితాలో చేర్చడానికి ఎన్నో ఎత్తుగడలు పన్నారు దానవయ్యలు! కాని, దాని ఆయుస్సు గట్టిది. వారి ఎత్తుగడలన్నీ, ఛేదించుకుంటూ వారితో దాగుడుమూతలాడటం పరిపాటి అయిపోయింది దానికి. వారిచేత నిహతమై స్వర్గాన ఉన్న

కుక్కల్లాగా - ఫకీరుకుక్క తెలివి లేనిది కాదు. అది అనుక్షణం తన స్మృతిని తన ప్రాణం చుట్టూ కవచంలా పరచుకొంది. మలుపులో యముడు పొంచివున్నాడని అది ముందుగానే పసి గట్టేసేది. అయినా - ఈ జాగరూకతే దానికి అశాంతికరంగా పరిణమించింది. చచ్చిన కుక్కలన్నీ ఏ దిగులూ భయమూ లేక హాయిగానే చచ్చి పోయాయి. దినగండం నూరేండ్లా యుస్సుగా జీవిస్తున్న ఫకీరుకుక్కకు కొండంత దిగులు గుండెలో గూడు కట్టుకొంది. ఏ దుర్ముహూర్తంలోనో ఏ కర్రో, రాయో వచ్చి తన బుర్రను రామకీర్తన పాడించగలదు. ఏ మలుపు లోనో మృత్యువు తనను తటాలున కౌగిలించుకోగలదు......ఈ విధమైన వ్యధతోనేమో - చిక్కి శల్యమైంది ఫకీరు కుక్క. దీని విషయంలో మాత్రం ప్రత్యేకమైన శ్రద్ధ వహించారు దానవయ్యలు. దానిమీద ఇంతటి గట్టి పగబూనడానికి మరొక ప్రబలకారణం కూడా లేకపోలేదు.

* * *

నరహరిపేటలో - ఇల్లూ వాకిలీ, తోడూ నీడా లేని ఒక మూగవాడుండే వాడు. అతగాడి రూపురేఖలను వర్ణిస్తూ కూర్చుంటే - మనోనేత్రం ముందు ఒక వికృత రూపం పొడగట్టగలదు. బహుశా వానరుడు నరుడుగా మారే పరిణామ కాలంలో అటువంటి ఆకారం ఉండి ఉంటుంది. ఆ మూగవాడి పేరు ఫకీరు.

ఫకీరుకు నా అన్నవారెవరూ లేరు. ఉదరపోషణకు ఉపకరించగల యోగ్యత లేవీ లేవు. ఆదిమానవుడికున్న యోగ్యతే అతనికి ఉంది అది శరీర బలం. అయితే అతడు ఆదిమానవుడికి మల్లే ఏ ప్రాణినీ హింసించలేదు. తన కాయకష్టాన్ని వెలకు అమ్ముకోవడమే వృత్తిగా పెట్టుకొన్నాడు. ఎవరు ఏ పని చెప్పినా నోరు మెదపకుండా చేసి పెట్టేవాడు. కూలికి సరుకులు మోసే వాడు. ఎప్పుడైనా ఆ ఊరికి లారీ వచ్చినప్పుడు, అందులోంచి మూటలు ఎత్తివేసేవాడు. కలో, గంజో పోస్తే త్రాగేవాడు. ఒకటో, అరో కాసులిస్తే జేబులో వేసుకునేవాడు. సూర్యుడు గూటిలో పడగానే ఎక్కడో ఒకచోట మేను వాల్చటం, సూర్యుడితోపాటు లేచి వీధుల్లోకి వెళ్ళటం - అతని నిత్య కృత్యాలు. ఎప్పుడూ అతన్ని నీడలా వెన్నంటి తిరుగుతూ ఉంటుంది ఒక నల్లకుక్క.

ఒకనాడు పెదదానవయ్య చెవిలో ఏదో ఊదాడు చినదానవయ్య. పెద దానవయ్య కళ్ళు ఆశ్చర్యంతో పెద్ద వైనాయి. "నేను నమ్మలేను. అయినా, ఇది నిజమా, ఒట్టి అనుమానమేనా?..."

"అనుమానమే అనుకో ! అయినా

నిజం మాత్రం కాకపోదు" అన్నాడు చినదానవయ్య.

ఆనాటినుంచీ వారిద్దరూ ఫకీరు దుస్తులమీద ఒక కన్నువేసి వుంచారు.

ఫకీరు బట్టలు దశసరిగా, అపరిశుభ్రంగా వుండి, దుర్వాసన వెదజల్లుతూ ఉంటాయి. అతడికున్నవి ఆ ఒక్క జత బట్టలే! వాటిని అతడెప్పుడూ ఉతుక్కోనైనా ఉతుక్కోడు. ఆ దుస్తులు అతడి బహిశ్చర్మం!

ఒకనాటి రాత్రి ఊరిబయటి పోలేరమ్మ గుడివరకు ఫకీరును రహస్యంగా అనుసరించారు దానవయ్యలు. మంచివాని మనస్సులా తెల్లగా తేటగా ఉంది వెన్నెల. ఫకీరు గుడివెనుకకు వెళ్ళాడు. తన లాగు విప్పి తిరగేశాడు. కొన్ని కరెన్సీ నోట్లు దానిమీద ఉంచి ఒక గుడ్డముక్క పెట్టి చుట్టూ కుట్టేశాడు. మళ్ళీ లాగూ తొడుక్కున్నాడు.

దురాశతో తబ్బిబ్బయిపోతూ చినదానవయ్య భుజంమీద చెయ్యి వేశాడు పెదదానవయ్య. ఇంతలో ఫకీరు కాళ్ళ దగ్గరే కూర్చుని ఉన్న కుక్క బిగ్గరగా భౌరిళ్ళున మొరిగింది. దానవయ్యలు ఏమీ ఎరుగనివాళ్ళకు మల్లే చాటుమాటుగా వెళ్ళిపోయారు.

ఫకీరు దుస్తుల్లో దాగిఉన్న మర్మం విదితమైపోయింది వాళ్ళకు. ఫకీరు కొన్ని సంవత్సరాలుగా నరహరిపేటలో ఉన్నాడు. తాను తినగా మిగిలిన సంపాదనంతా నిత్యమూ తన రక్షణలోను, తనకు అందుబాటులోను ఉన్నటువంటి ఒక ఖజానాలో దాచుకొంటున్నాడు. అతని ఒక్కగా నొక్క జత బట్టలే అతని ఖజానా! ఈ రహస్యం దానవయ్యలిద్దరే కనిపెట్టగలిగారు.

ఆ ఖజానాను దోచుకోవాలన్న సంకల్పంతో ఇద్దరూ మార్గాలు వెతుకసాగారు. ఇనప్పెట్టెలోని డబ్బులైనా కాజేయవచ్చుగానీ. ఫకీరు వద్ద నున్న డబ్బును కాజేయడం తేలికయిన పనిగాదు.

అతని ధనాన్ని అపహరించడమే ధ్యేయంగా ఉన్న ఆ మిత్రులకు ఒకనాడు మంచి అవకాశమే దొరికింది. ఆనాటి మిట్ట మధ్యాహ్నం - ఊరిబయట మునసబ్‌గారి కపిలబావి గట్టున ఎండిపోయిన వేపచెట్టును గొడ్డలితో నరుకుతూ కనిపించాడు ఫకీరు. వేలికి ఉన్న బంగారు ఉంగరం నాణ్యాన్ని తడివి చూచుకుంటూ, అతని దరగ్గకు వెళ్ళి, నిలబడ్డాడు పెదదానవయ్య. "ఫకీరూ! ఎలాఉంది ఉంగరం? మొన్నే చేయించాను. బాగుందా..." అన్నాడు.

ఫకీరు చెట్టు నరకడం ఆపి, ఉంగరం కేసి పెద్ద కళ్ళతో చూచి నవ్వుతూ "భలే బాగుంది" అన్నట్లు "బే-బే-బే" అన్నాడు.

"దీని మదింపు ఎంత?" అని

అడిగాడు, మూగ భాషలోనే. ఆశ్చర్యంతో ఆ ఉంగరాన్ని తీసి తన చేతివేలికి పెట్టుకొని కొంతసేపు ఆనందంతో తన్మయుడై, దాన్ని దానయ్యకు తిరిగి యిచ్చేశాడు.

"ఉండు ఫకీరూ! దాహమేస్తోంది. బావిలో దిగి నీళ్ళు తాగి వస్తా" అని, దానయ్య బావివైపు నడిచాడు. ఫకీరు మళ్ళీ తన పనిలో నిమగ్నుడైపోయాడు.

బావిలోకి దిగుతూ దిగుతూ, పెదదానయ్య ఉంగరాన్ని తీసి, పంచె కొంగున ముడివేసుకున్నాడు.

రెండునిమిషాల తరువాత "ఫకీరూ! ఫకీరూ!" అని బిగ్గరగా ఒక కేక వినవచ్చింది, బావి వైపునుంచి. ఫకీరు గొడ్డలి నేలమీద పడేసి బావిదగ్గరికి వెళ్ళాడు. పెదదానయ్య గోచీ పెట్టుకుని నీళ్ళల్లో కలియ దిరుగుతున్నాడు.

"ఏమే...?" అన్నాడు ఫకీరు, ఏం జరిగిందన్నట్లు.

"ఉంగరం జారి పడిపోయింది."

ఫకీరు తన అభినయంతో ఆశ్చర్యము, సానుభూతీ, విచారమూ అన్నీ మూక ఉమ్మడిగా ప్రదర్శించేశాడు.

పెదదానయ్య ఏడెనిమిదిసార్లు బావిలోకి మునకలు వేశాడు. ఒడ్డుకువచ్చి పెదవి విరిచాడు. "అయ్యో, కష్టపడి సంపాయించిన సొమ్ము – నీళ్ళపాలైపోయింది..." అంటూ విచారంగా కూర్చున్నాడు. "ఫకీరూ అడుగున అంతా గాలించేశాను. కనిపించనేలేదు. నువ్వో ఒకసారి దిగి చూడరాదూ!..."

ఫకీరు అనంగీకార సూచకంగా తల అడ్డంగా ఆడించాడు. "నావల్లగాదు బాబూ!... ఏమీ అనుకోకు!" అని సంజ్ఞల ద్వారానే తెలియజేశాడు.

కొంతసేపటి తర్వాత పెదదానయ్య బట్టలువేసుకొని "సరే! నే వెళ్తాను. ఏం జేయాలి? ఆ సొమ్ము నాది గాదంతే!" అంటూ విచారంగా అక్కణ్ణించి సాగిపోయాడు.

అతను కనుమరుగయ్యేంతవరకు అలా చూస్తూనే నిలబడిపోయాడు ఫకీరు. తరువాత నెమ్మదిగా వెళ్ళి గొడ్డలి చేతి కందుకుని, చెట్టునరకడం మొదలు పెట్టాడు.

దురాశ దుఃఖానికి నెలవు అన్నది జగమెరిగిన సూక్తి. ఈ సూక్తి తెలిసి వున్నవారిని కూడా దురాశకు గురిచేసే చెడ్డవేళలు అనూహ్యంగానే తారసిల్లుతూ ఉంటాయి. బుర్రనిండా ఏవేవో ఆలోచనలు సందడిచేయగా, ఫకీరు గొడ్డలి క్రిందపడేసి, ఒక రాతిమీద కూర్చున్నాడు. కొంతసేపు గడిచింది. ఫకీరు చుట్టూ చూశాడు. దగ్గరలో మనుషు లెవరూ లేరు. ఫకీరు పైకి లేచాడు. చెట్టునీడలో పడుకొనిఉన్న కుక్కకూడా పైకిలేచి ఒళ్ళు దులుపుకుంది. బావిగట్టుకు నడిచాడు ఫకీరు. కుక్క అతన్ని అనుసరించింది. ఫకీరు




బట్టలు విప్పి, గుబురుగా ఉన్న ఒక పొదలో దాచిపెట్టాడు. కుక్కను అక్కడ కూర్చోబెట్టాడు. తాను బావిలోకి దిగి, బుడుంగున నీళ్ళలో మునిగాడు.

చెట్ల చాటునుంచి చినదానవయ్య ఇవతలికి వచ్చాడు. "ఇజ్జూ...యిజ్జూ" అంటూ కుక్కను మెల్లగా పిలిచాడు. కుక్క తలెత్తి అతనివైపు చూచింది. అతని చేతిలో మాంసపు ముక్క! కుక్క ఆశగా తోకాడిస్తూ, అతనివైపు వడిచింది. చేతిలో మాంసాన్ని ఎరగా చూపిస్తూ, దాన్ని ఆలాగే దూరంగా తీసుకెళ్ళాడు చినదానవయ్య.

లోపలికీ, ఉపరితలానికీ మునకలు వేస్తూనే ఉన్నాడు ఫకీరు. పొదలచాటు నుంచి పెద దానవయ్య రావడం, అతని బట్టల్ని చుట్టచుట్టి చేతబట్టుకుని చల్లగా జారుకోవడం అతడు గమనించలేదు.

వెతికి వెతికి విసిగిపోయి, ఒడ్డుకు వచ్చిన ఫకీరుకు తన బట్టలు కనిపించక పోగా, గుండె బ్రద్దలైనంత పని జరిగింది. చెట్లు, పుట్టలు, పొదలు అన్నీ గాలించేడు. కోపంకొద్దీ కుక్కను డొక్కలో తన్నాడు. గట్టిగా ఏడుస్తూ గుండెలు బాదుకొన్నాడు. పిచ్చివాడిలా బావిచుట్టూ పరుగెత్తాడు. వాడి ఏడ్పులు ఎవరికి అర్థమవుతాయి? తన చింపిరి బట్టలకోసమా రోదిస్తున్నాడు ఫకీరు? పాపం ... యిది విన్నవారు విరగబడి నవ్వుకొన్నారు.

దానవయ్యలు రహస్యంగా ఫకీరు బట్టలకున్న అతుకులన్నీ ఊడబెరికారు. మాసిపోయి, నలిగిపోయి, బట్టకంటు కున్న నోట్లనన్నిటినీ లెక్కబెట్టారు. సుమారు సంఖ్యలో చెప్పాలంటే, ఆ మొత్తం మూడువేలు! ఫకీరు దశాబ్దం పైగా తన చెమటోడ్చి సంపాదించి దాచుకున్న కష్టార్జితం!

* * *

దానవయ్యలిద్దరూ కలిసి ఉమ్మడిగా

కపిలబావి ఒకటి త్రవ్వకోబోతున్నా రన్న వార్త నరహరిపేటలో కొందరికి అసూయను, మరి కొందరికి ఆశ్చర్యాన్ని కలుగజేసింది.

చెరువుదగ్గర - వారిద్దరి పొలాలూ పక్క పక్కనే ఉన్నాయి. చెరువు ఎండి పోయినప్పుడు ఆ పొలాలకు నీటివసతి శూన్యం. అందుచేత తమ యిద్దరి పొలాలకు సరిహద్దున బావి ఒకటి త్రవ్వించదలుచుకున్నారు వారు.

పని ప్రారంభమైంది. బావి నాలుగు మట్లులోతు తెగింది. అనుకోకుండా బావి లోను, ఆ యిద్దరి గుండెల్లోను బండ పడింది. బస్తీనుంచి నల్లమందు తెప్పించి నాట్లు పెట్టించారు. బండ పగిలింది. రాతి పలుకులు ఆకాశాని కెగిరాయి. బావి చుట్టూరా, గట్టున గుట్ట తయారైంది. అయినా బావిలో బండకు అంతులేదు. ఒక పొట్టేలు, ఒక దున్నపోతు తలలు కూడా తెగాయి. ప్రయోజనం మాత్రం లేకపోయింది. నీళ్ళు పడలేదు. మూడు వేలూ కరిగిపోగా-దానవయ్యలు ఖిన్నులై పోయి, అంతటితో ఆ ప్రయత్నం ఆపి వేశారు.

రోజులు గడిచిపోసాగాయి. బావి అసంపూర్ణంగానే ఉండి పోయింది. దట్టంగా ముళ్ళపొదలు, తీగలూ చుట్టూ మొలిచిపోయాయి. ఇనుము కరిగించి ఆ బావిలో పోతపోసి తీస్తే, రకరకాల భయంకరాయుధాలు తయారు కాగలవు. బావి - మొనదేలిన రాళ్ళతో నిండి, గట్టున నిలబడి చూసేవారికి గుండెలవియజేసేది.

ఒకనాడు దానవయ్యలు బావిగట్టున కలుసుకున్నారు. "ఇదిగో తమ్ముడూ! నా కొక ఆలోచన తోస్తోంది!...పెద్దల కాలంలో నరబలులుకూడా యిచ్చే వారటగా?" అన్నాడు పెద్దదానవయ్య.

"అమ్మబాబోయ్! నరబలే!" అంటూ బావిగట్టునుంచి వెనక్కు నాలు గడుగులు వేశాడు చినదానవయ్య.

ఆ రాత్రంతా నిద్రపట్టలేదు చినదానవయ్యకు. నరబలిని గూర్చిన ఆలోచనతోనే, గడిపి. తెల్లవారుజామున ఎప్పుడో చిన్న కునుకు తీశాడు. ఉదయం లేచీలేవగానే పెదదానవయ్య దగ్గరికి పరుగెత్తుకువెళ్ళాడు.

"అన్నయ్యా! రాత్రి కల్లో గంగా భవాని కనిపించింది..." అన్నాడు వగర్చుతూ."ఒరేయ్ చినదానవయ్యా ! నేను గంగాదేవిన్రోయ్! పొట్టేలు నెత్తురు నా కెందుకురోయ్! దున్నపోతు నెత్తురు నా కొద్దురోయ్! నాకు నరబలి యివ్వం డ్రోయ్!...మీరు చల్లగుంటారు...'అని చెప్పిపోయిందిరా అన్నయ్యా!"

"ఏమిచేమిటీ? గంగా భవాని చెప్పిందా అలాగని?" అన్నాడు పెద దానవయ్య విస్మయంతో.

దేవికి నరబలి యివ్వడానికే నిశ్చ యించుకున్నారు ఇద్దరూ. ఒక సమస్య

తీరిందనుకుంటే, మరొక సమస్య తలెత్తింది.

నరబలి

నల్లిని, చీమను, దోమను నలిపివేస్తే చట్టం ఊరుకుంటుందిగానీ, మనిషిని నలిపివేస్తే చట్టం ఊరుకుంటుందా?

మనిషిని చంపే విషయంలో ఇద్దరి గుండెలూ కాస్త వెనకడుగు వేశాయి. ఈ అధైర్యం కారణంగానే మరికొన్ని రోజులు గడిచిపోయాయి.

వారి దృష్టి అకస్మాత్తుగా ఫకీరుపైకి ప్రసరించింది. ఫకీరు దాదాపు పిచ్చివాడే అయిపోయాడు. తన ప్రాణంతో ప్రాణంగా ఉన్న ధనం పరులపాలై పోగానే, అతని హృదయం తీవ్రాఘాతానికి గురైంది. అతడిప్పుడు ఏ పనీ చేయడంలేదు. ఎవరితోనూ మనసిచ్చి మెలగడంలేదు. మనుషులకు దూరంగా, ఏకాంతంగా, నిశ్శబ్దంగా కూర్చుంటాడు. అప్పుడప్పుడూ మునసబుగారి బావిగట్టున పొదలలో చేజారిపోయిన తన నిధిని వెదకుతూ కనిపిస్తాడు. అతని నల్ల కుక్క అతనికెప్పుడూ తోడు.

ఫకీరు దిక్కులేనివాడు. వాడు కనిపించకపోతే వాణ్ణిగూర్చి ఆలోచించే నాధుడేలేడు. తమకు అందుబాటులో ఉన్నవాడు, ఆపదలు తెచ్చిపెట్టనివాడు ఫకీరొక్కడే!

ఒక అమావాస్యనాటి అర్ధరాత్రి చావడి అరుగుమీద ఒంటరిగా పడుకొని నిద్రపోతున్న ఫకీరును తట్టి లేపారు దానవయ్యలు. తమవెంట రమ్మని పిలిచారు. "ఫకీరూ! వెళ్దాం రా!"

ఫకీరు కదల్లేదు.

"ఫకీరూ! మా వెంట రా!"

ఫకీరు నవ్వుతూ అలాగే కూర్చున్నాడు.

"నీ బట్టలు నీకు వద్దూ? మాతో వస్తే చూపిస్తాం!" అంటూ సంజ్ఞల ద్వారా చెప్పారు అంతే! ఫకీరు చివాలున పైకి లేచాడు. వారిని అనుసరించాడు అరుగుమీద పడుకున్న కుక్క చెంగున క్రిందికి దూకింది. దానవయ్యలు దాన్ని అదిలించారు. అది ఆగిపోయింది.

ఫకీరును వెంటబెట్టుకుని ఎవరికీ తెలియకుండా తమ పొలాలవైపు నడిచారు. కొంత దూరం వెళ్ళాక కుక్క మళ్ళీ ప్రత్యక్షమైంది. రాళ్ళు రువ్వి దాన్ని మళ్ళీ వెనక్కు తరిమివేశారు. ముగ్గురూ రాళ్ళబావి దగ్గరికి చేరుకొన్నారు.

పెదదానవయ్య హఠాత్తుగా ఫకీరు నోరునొక్కి పట్టేశాడు. చినదానవయ్య చేతిలో కత్తి తళుక్కున మెరిసింది. ఫకీరు గుండె ఝల్లుమంది. శక్తినంతా ఉపయోగించి పట్టు వదలించుకొని, బిగ్గరగా ఆర్తనాదం చేస్తూ పది అంగల దూరం ముందుకు పరుగెత్తి బోరగిల పడిపోయాడు. కటిక గుండెతో పెద

దానవయ్య అతనిమీదికి లంఘించాడు. ఇంతలో ఫకీరు కుక్క 'భౌభౌ' అంటూ ప్రత్యక్షమైంది. అది అటూ యిటూ చకచకా తిరుగుతూ మోర పైకెత్తి బిగ్గరగా మొరగసాగింది. ఆ పరిసరాలంతా దాని అరుపులతో, ఫకీరు కేకలతో మారుమ్రోగిపోయింది. కరడుగట్టుకొన్న ఆ ఇద్దరి మొండి ధైర్యమంతా చల్లగా నీరుగారిపోయింది. నిలువెల్లా భయం ఆవహించగా, కాళ్ళు చేతులు తడబడుతుండగా, ఫకీరును విడిచిపెట్టి తలొక దిక్కుగా పారిపోయారు, ఇద్దరూ. పోతూ పోతూ విచ్చుకోపంతో తన చేతిలోని కత్తిని కుక్క మీదికి గిరవాటువేశాడు చినదానవయ్య.

తెల్లవారింది. నరహరిపేటలో ఫకీరు కనిపించలేదు. డబ్బు పోతే పోయింది; ఊపిరుంటే అటువంటి డబ్బు ఎంతయినా కళ్ళజూడవచ్చు ననుకున్నాడో ఏమో! కత్తి తగిలి, ఫకీరు కుక్క మాత్రం కుంటిదై మిగిలిపోయింది ఆ ఊళ్ళో.

* * *

ఈ నవనాగరిక యుగంలో-ఎవడు మానవుడు, ఎవడు దానవుడు అని రూప నిర్ణయం చేసి చెప్పడం అసంభవం. ఆ యా జాతిని నిర్ణయించగలది వ్యక్తి స్వభావమే!

లోకోపద్రవకరంగా ప్రవర్తించటమే రాక్షస ప్రవృత్తి అనబడుతుంది. తదుపద్రవాన్ని అడ్డుకొని, శిష్టులైన వారిని రక్షించడానికి భగవంతుడు తరచుగా అవతరిస్తుంటాడని పురాణాలు, మత గ్రంథాలూ చెబుతాయి. ఈ ప్రయోజనం కొరకు అవతరించినవారే నరహరి, శ్రీరామచంద్రుడు మొదలైనవారు. అయితే, హిరణ్యకశిపుడు, రావణాసురుడు మున్నగువారు భగవానునిమీద వైరం పూనితే, దానవయ్యలు-కడుపు నిండితే అదే కైలాసమనుకునే అల్ప జాతి ప్రాణిపట్ల పగబూనారు. వెనుకటి దానవుల చరిత్రలో ఎక్కడా కానరాని విచిత్రోదంతం ఇది. అయితే ఏ పుట్టలో ఏ పాముందో ఎవరు చూశారు? ఆ నాడు అజాండాన్నే మున్నీట ముంచివేయ నుద్యమించిన హిరణ్యాక్షుడ్ని తుద ముట్టించలేదా వరాహం? అందుకే కాబోలు భగవంతుణ్ణి 'నీ లీల పొగడ తరమా' అని స్తుతించారు భక్తాగ్రేసరులు! ఈ కుక్క వలన కాగల కార్యం ఏమున్నదో?...

"ఈనాటితో ఫకీరుకుక్క సంగతేమిటో తేల్చేయాలి!" అనుకున్నారు దానవయ్యలు. తలా నాలుగు ముంతల కల్లు త్రాగారు తలొక రోకలిబండ చేత బుచ్చుకున్నారు ఫకీరు కుక్కను వెంబడించారు. కుక్క కుంటి పరుగుతోనే ఈ వీధినుంచి ఆ వీధికి, ఆవీధి నుంచి మరొక వీధికీ పరుగులు తీసింది. సందుగొందులంతా కదం తొక్కేసింది. దానవయ్యలు మాత్రం దాన్ని విడిచి




పెట్టదలుచుకోలేదు. చెరొక వైపునుంచి దానిమీదికి దాడి ప్రారంభించారు. మృత్యువు ఈనాడు కృతనిశ్చయంతో తన వెంటబడుతూ ఉన్నదని గ్రహించింది, కుక్క. అది ఊరిబయటికి పరుగు తీసింది. ఆయాసం తీర్చుకోడానికి ఒక్కసారి నిలబడి వెనక్కు తిరిగి చూచింది. యమభటులు తరుముకొస్తూనే ఉన్నారు. కుక్క మళ్ళీ ముందుకు ఉరకలు పెట్టింది. వారికి కనిపించకుండా ఒక ముళ్ళ పొద చాటున దాక్కుంది. దానవయ్యలు పొదలను గాలించడం మొదలుపెట్టారు. రోకలి రివ్వున వచ్చి కుక్క ప్రక్కన పడింది. కుక్క చెంగున దూకి ద్విగుణీకృత వేగంతో పరుగెత్తింది. ఊరి చుట్టూ నాలుగుసార్లు ప్రదక్షిణం చేసింది. ఒకసారి సూటిగా, మరొకసారి అడ్డదిడ్డంగా, ఇంకొకసారి వంకరటింకరగా, గమ్యంలేకుండా పరుగెత్తింది. ఎంతసేపు అలా పరుగెత్తగలదు? నీడలా చావు వెన్నంటి వస్తూవుంటే, ఎక్కడికి పోగలదు?...పాపం, దాని కళ్ళనుంచి కన్నీళ్ళు జారడం మొదలు

పెట్టింది. ఇక చేయగలిగేదేమీ లేక, ఎలాగో వారి కన్నుగప్పి ఒక పొదలో ముడుచుకు కూర్చుంది.

పొద్దు వాలింది. చీకట్లు వ్యాపిస్తున్నాయి. కుక్కకోసం ప్రతి పొదా గాలిస్తూ వస్తున్నారు దానవయ్యలు. "అన్నయ్యా! నువ్వు అటునుంచిరా; నేను ఇటువేపు నుంచి వస్తాను!" అన్నాడు చినదానవయ్య. కల్లుకైపుతో వారి కళ్ళు మత్తెక్కాయి. తామున్న పరిసరాలుకూడా తెలియలేదు వారికి. వారి లక్ష్యం కుక్కను హతమార్చడమే!

"ఇదిగో తమ్ముడూ! ఇక్కడుంది! త్వరగా రా! జాగ్రత్త! కాసుకో!" అంటూ, ఉన్నట్టుండి పొలికేక పెట్టాడు పెదదానవయ్య. ఇద్దరూ కలిసి రోకటిబండలతో కుక్కమీదికి లంఘించారు. కేవలం అది కుక్కే అయినా, అది ప్రాణాపాయస్థితి!...ప్రాణాలకు తెగించి శక్తి నంతా కూడదీసుకుని అదివాళ్ళ మీదికి దూకింది. కుక్కమీద ఫెడేల్ ఫెడేల్మంటూ రెండు రోకటిపోట్లు పడ్డాయి. ఐనా అది మహారౌద్రంతో వారి నెదిరించి పోరాడసాగింది. ఛెంగు ఛెంగున వాళ్ళ మీదికి గెంతింది. ముఖాలమీద కరచింది. ఈ పెనుగులాటలో హఠాత్తుగా దానవయ్యలు వెనక్కు విరుచుకుపడిపోయారు! ... మరు క్షణం హృదయవిదారకమైన రెండు ఆర్తనాదాలు!... అవి-దానవయ్యలు తమకోసం తీసి ఉంచుకున్న రాళ్ళబావి! ... అందులో రాళ్ళ నడుమ రక్తంలో మునిగితేలుతున్న రెండు కళేబరాలు!... మృత్యువును ఓడించి, ఫకీరుకుక్క విజయగర్వంతో ఊళ్ళోకి నడిచింది.

* * *

ఒకటికి రెండు నరబలులు జరిగిపోయాయి. ఈ వ్యావహారిక దృక్పథంతోనే పెదదానవయ్య కొడుకు, చినదానవయ్య కొడుకు కలిసి, ఆ బావిని మరికొంత త్రవ్వించారు. కాని, బండపూర్తి కాలేదు; గంగాభవాని కటాక్షించలేదు.

...తమ తండ్రుల ఊహ మేరకు నరబలి యిస్తే, గంగ కటాక్షించగలదు. ఒకటికాదు, రెండు బలులు ముగిసినా గంగ ప్రసన్నురాలు కాలేదంటే-దానవయ్యలు నరులు కానట్టేగా ? వారు మానవులు కారనడానికి ఇంతకంటే దృష్టాంతం మరేం కావాలి?



# ఖైదీ

పరమహంస




చీకటి. చిమ్మచీకటి. కన్ను పొడుచుకున్నా కానరాని కటిక చీకటి. అమావాస్యేమో అంతులేని చీకటి. రెడ్డిపాలెం రైల్వేస్టేషనులో మూడు గంటలు ఆలస్యంగా దించింది ప్యాసింజరు రైలు. తనొక్కడే దిగాడక్కడ. ఆగీ ఆగక

ముందే స్టేషనుమాస్టరు పచ్చలైటు చూపించాడు. అరనిముషమే ఆగిందో, నిమిషమే ఆగిందో ఆవిర్లు ఆర్చుకొంటూ బయలుదేరింది - గమ్యం చేరాలనే ఆరాటంతో. సమాంతరంగా సాగే ఇనుప పట్టాలమీద నిరవధికంగా అపరిశ్రాంత యానం చేసే రైలుకీ, విశాల విశ్వంలో జీవితాంతం ఆశా నిరాశల, సుఖ దుఃఖాల ద్వంద్వాలతో పోరాడుతూనే గడిచిపోయే మనిషి జీవితానికి ఎంతో సామ్యమూ వుంది. ఎంతో తేడా వుంది.

రైలు స్టేషను దాటి వెళ్ళాక, బరువైన సూట్‌కేసు పట్టుకొని పట్టాలు దాటి గేటుదాకా నడిచేడు సూర్యం.

లాస్ట్‌బస్ వెళ్ళిపోయుంటుంది. లేటు కాకూడదూ? అఁ ఇంకా వుంటుందా అర్థ రాత్రి కావస్తుంటే! అయినా అశ! గేట్ మన్ మంచి నిద్రలో వున్నట్టున్నాడు. ధైర్యంచేసి లేపాడు.

"బస్సు వెళ్ళిందా" అనడిగాడు. వాడు విసుక్కొంటూ "ఇప్పుడేం బస్సయ్యా. ఎప్పుడో పోయింది. రేప్పొద్దున ఎనిమిదింటికి..." అనేసి పక్కకి తిరిగి పడుకున్నాడతను

"అబ్బో!రేప్పొద్దున ఎనిమిదింటిదాకా ఇక్కడుండాల్నా."

నోనో. ఐమస్ట్ గో నౌ. వెళ్ళాలి. ఈ రాత్రికే యింటికి చేరుకోవాలి," అనుకొన్నాడు సూర్యం.

చీకటిలో ఏమీ కనిపించటంలేదు. సూట్‌కేస్ తెరిచి టార్చిలైట్ తీశాడు. చలిగాలి వీస్తోంది. స్వెట్టరు తొడుక్కున్నాడు. చేతిలో హేండ్‌స్టిక్ వుంది. గట్టిదే. కాని అయిదు మైళ్ళు ఈ చీకట్లో ఒంటరిగా నడిచి వెళ్ళగలడా? వర్షం కూడా పడేలా వుంది ఖర్మ. ఎలా ... ఎలాగైనా వెళ్ళాలి. తప్పదు. లేచాడు. సూట్‌కేస్ ఒక చేత్తో, టార్చిలైట్ మరో చేత్తో పట్టుకొన్నాడు. హేండ్‌స్టిక్ చంకలో పెట్టుకొన్నాడు

దారి తనకు సుపరిచితమైందే. ఇరవై సంవత్సరాల క్రితం, తను చదువుకొనే రోజుల్లో ఎన్నోసార్లు నడిచాడు వూరినుండి రెడ్డిపాలెం స్టేషనుకీ, ట్రంకురోడ్డు దగ్గరికీ. బస్సు సౌకర్యం లేదప్పుడు. అయిదు మైళ్ళ నడక నీళ్ళప్రాయంలా వుండేది ... ఆరేళ్ళు దాటింది వూరికి వచ్చి. ఢిల్లీకి వెళ్ళాక రావటం పడలేదు. ఉద్యోగం అలాంటిది. ఖైదీ జీవితంలాంటిది. కావాలన్నప్పుడు శలవు దొరకదు. ఒక వారంరోజులు దొరికినా ఢిల్లీనుంచి రాకపోకల ప్రయాణమే ఆరు రోజులు తినేస్తుంది. ఇక వూళ్ళో వుండే దెప్పుడు ? బంధు మిత్రుల్ని కలుసుకొనేదెప్పుడు? పోయిన సంవత్సరం బావ తమ్ముడి పెళ్ళికి వద్దామనుకుంటే, అంతలోనే అత్యయిక పరిస్థితి ప్రకటింపబడటం, గ్రాంటు అయిన లీవుకూడా రద్దవటం జరిగింది. రాలేకపోయాడు. చెల్లెలు రాజీ, బావగారు

తన పరిస్థితి అర్థంచేసుకోరు. జైలు అధికారిగా ఉద్యోగమంటే ఆజన్మాంతర జైలు జీవితమన్న మాట !

అవసరానికి శలవు దొరకని ఆ వుద్యోగం ఎంత పెద్దదైతే మాత్రమేం- ఇళ్ళల్లో పెళ్ళిళ్ళక్కూడా రాలేక పోవటం విడ్డూరంగానే వుంది. ఉద్యోగాలు చేసేవాళ్ళంతా యిలాగే వున్నారా? తనవాళ్ళందర్నీ వొదులుకోవల్సిందేనా? అంటూ నిష్టూరంగా వుత్తరం రాసింది చెల్లెలు. బావగారికీ కోపమొచ్చినట్లుంది. సరిగా సమాధానం వ్రాసేవాడు కాదు. ఆఖరికి అమ్మ - ఆమె కూడా అలానే రాసింది. "నీ పరిస్థితులు ఎలావున్నా కనీసం పెళ్ళికి వచ్చి అందర్నీ చూచి వెళ్ళితే బావుండే" దని.

కాళ్ళు అసంకల్పిత ప్రతీకార చర్యగా ఆగాయి వున్నట్టుండి. సిక్స్త్ సెన్స్ పనిచేసింది. టార్చి వెలిగింది. రెండడుగుల దూరంలో పొడవాటి పాము కప్పని మింగుతూ కదల్లేక కదులుతోంది. గుండెలు దడదడ లాడాయి. ఒక్క-క్షణం సంబాళించుకొని బూటుతో నేల మీద శబ్దం చేశాడు. పాము పచ్చిక లోకి జరిగిపోయింది. 'హమ్మయ్య' అనుకున్నాడు. ఏదో నీటిపాము చీకట్లో తీరిగ్గా కప్పను నంజుకొంటోంది.

దాదాపు మైలు నడిచేడు పాలెందాటి. రోడ్డు అతుకులు గతుకులుగా వుంది. గులకరాళ్ళు రోడ్డుమీద చిందరవందరగా వున్నాయి. గుంటలు, మిట్టలు. అయిదు మైళ్ళ రోడ్డులో ఇరవై చప్టాలు. మూడు నాలుగు వాగులు రోడ్డుని క్రాస్ చేస్తాయి. వర్షాకాలం ప్రయాణానికి ఇబ్బంది. తన చిన్నప్పటినుంచీ యీ రోడ్డు గతి యింతే. వేలు వేలు రిపేరు కోసం శాంక్షను అయినట్లు వినబడుతుంటాయి వార్తలు. రోడ్డు మాత్రం ఎక్కడ రిపేరవుతోందో కనబడదు! చప్టాల రిపేరుకి కేటాయించిన సిమెంటు నిజంగా ఉపయోగిస్తే ఇప్పటికి రోడ్డంతా సిమెంటుతోనే తయారయ్యేది. మరి ఆ సిమెంటంతా ఎవరిల్లు కట్టడానికి వెళ్తోందో ! తనలో తనే నవ్వుకున్నాడు సూర్యం.

నడుస్తూనే వున్నాడు నెమ్మదిగా. బరువైన సూట్ కేస్ చేతిని లాగేస్తూంది. తనవి మూడు జతల బట్టలు, చెల్లికి రెండు, అమ్మకి రెండు చీరెలు, జాకెట్ పీసులు, చెల్లెలి పిల్లలకి బట్టలు, బిస్కట్లు, అవీ యివీ వున్నాయి. రెండో చేతికి మార్చుకొన్నాడు. అలవాటు తప్పిన నడక. సిటీలో నడవవలసిన పనేముంది. అసలు సరదాకైనా నడిచి వెళ్ళే తీరికెక్కడ వుంది తనకి. తనకే కాదు. సిటీల్లో ఉద్యోగాలు చేసుకొనే వాళ్ళ కెవరికైనా తిండి తీరిగ్గా తినే టైమే దొరకదు సరిగ్గా. బస్సు టైం అయిందనో, లోకల్ ట్రైన్ తప్పిపోతుందనో, ఆలస్యంగా వెళ్తే 'అమ్మో-

ఇంకేమన్నా వుందా' అనో-ఒకటేమిటి, అన్ని పనులకీ-నిద్ర లేచినప్పట్నుంచి నిద్రపోయేంతవరకూ టైం ప్రకారం టంచనుగా ఆటోమాటిక్ ఫారిన్ గడియారంలా యాంత్రికంగా జీవితం గడపాల్సిందే ! అన్నట్టు యిప్పుడెంత టైం అయిందో? వాచీ చూసాడు. రేడియం దయల్ ఆటోమాటిక్, ఫారిన్ గడియార మది. అంత చీకట్లోనూ తళుక్కున మెరుస్తున్నాయి అంకెలు. ముల్లులు.

పన్నెండు గంటలు!

అర్ధరాత్రి, అమావాస్య, ఆదివారం.. దయ్యాల రోజు.

తనలో తనే నవ్వుకున్నాడు ధాద స్త్రపు ఆలోచనకి. ఎన్ని ఆదివారాలు, అమావాస్యలు చూడలేదు. అర్ధరాత్రులు, నీరవ నిబిడాంధకారంలో జైలుగోడల మధ్య సగం చచ్చిన మనుషులు తప్పించు కోకుండా కట్టుదిట్టాలతో కాపలా కాస్తూ గడపలేదు. అది ఉద్యోగం! ఇప్పుడలా కాదే. ఎవరూ తోడు లేరు. చుట్టూ చిక్కని చీకటి. గతుకుల రోడ్డు. మొండి ధైర్యంతో నడుస్తున్నాడు ఇల్లు చేరా లనే ఆరాటంతో-విడుదలకోసం ఆశతో బ్రతికే యావజ్జీవ ఖైదీలా! తనుకూడా ఖైదీలాంటి వాడేనా? ఖైదీ పరిస్థితి వేరు. తన పరిస్థితి వేరు ఛ. ఛ. ఏమిటీ ఆలోచ నలు. తలవిదిలించుకొన్నాడు.

మూడు రోజులు ప్రయాణంచేసి, ఢిల్లీనుంచి వచ్చి, చీకటికి భయపడి, నడక్కి వెనకాడి, ఈ రాత్రికి ఇంటికి చేరకపోవటమా? నాన్సెన్స్. తల్లిని చూట్టానికి ఇంత దూరం వచ్చాక ఒక్క నిముషం ఆగే ప్రశ్నేలేదు అమ్మ ఆరోగ్యం ఎలావుందో యిప్పుడు. పదిహేను రోజులుగా విశ్వప్రయత్నం చేస్తే దొరికింది పదిరోజులు శలవు. అమ్మని ఢిల్లీకివచ్చి తనతో వుండమంటే చిరునవ్వుతో తిరస్కరిస్తుంది. "పుట్టి, మెట్టిన వూరు వదలి రాలేనురా. నువ్వూ నీ సంసారమూ సుఖంగా వుంటే నాకు చాలు," అంటుంది. నిజంలో అమ్మ తనతోనే వుండాలని హృదయపూర్వ కంగా అనుకోలేదు తను. ఆమె తనతో వుండాలంటే ఆమెకీ కష్టమే, తనకీ కష్టమే. అంటే తిండి పెట్టలేదనికాదు. అదంతే! అందుకనే, 'పల్లెటూళ్ళో తన వారందరితో కలసి బ్రతికే అనురాగ మయ జీవితం పట్టణాల్లో నీకు దొరక దమ్మా' అంటాడతను. మరోకారణం కూడా లేకపోలేదు. తన భార్య రజని. ఆమె ఉద్యోగం ఆమెకుంది. పిల్లల్ని తయారుచేసి స్కూళ్ళకి పంపటం; వంట చేయటం; తను తయారుకావటం, ఇన్స్టిట్యూట్ కి వెళ్ళటం-అంతా టైం ప్రకారం జరగాల్సిందే. అలాంటప్పుడు యింట్లో అమ్మ ఒక్కత్తె కే ఏమీ తోచదు. ఒకటి రెండుసార్లు వారం రోజులు గడపటమే గగనమైపోయిం దామెకి. ఎప్పుడెప్పుడు తిరిగి వూరికెళ్ళి




పోదామా అని ఎదురుచూసేది వచ్చి నప్పట్నుంచి. అమ్మ మడీ, జపాలూ రజనికి అట్టే రుచించవు. రజని ఫాషన్లు, షోకులు, ఉద్యోగం అమ్మకి నచ్చవు. అందుకే ఆమె దూరంగా వుంటుంది.

ఎంతో ఆరోగ్యంగావుండే అమ్మ ఉన్నట్టుండి ఎందుకు జబ్బున పడ్డట్టు? అసలేం జబ్బుచేసిందో రాయదు. ఎప్పుడూ 'క్షేమం'గానే వున్నట్టు రాసే అమ్మ 'ఇటీవల కొంచెం అనారోగ్యం చేసింది. మరేం భయం లేదనుకో - మామయ్యా, చెల్లీ వాళ్ళు చూస్తున్నారు.. వీలైతే కోడల్నీ, పిల్లల్నీ తీసుకొచ్చి ఒకసారి చూపించిపోవలసింది. మరలా చూడగలనో లేదో,' అని వ్రాసింది పదిహేనురోజుల క్రితం.

ఆ వుత్తరం తనకి భయాన్ని కలిగించింది. 'చూడగలనో లేదో' అందే-అంత అధైర్యం కలిగిందంటే - మనస్సులో తహతహ. 'తను వెళ్ళేసరికి అమ్మ వుంటుందా?' గుండెల్లో దడదడ. ఛ.ఛ. ఏమిటీ పాడు ఆలోచన - పొరపాటు చేశాడు తను. రజనిని, పిల్లల్ని తీసుకొని రావల్సింది. ఎంత చెప్పినా రజని వినలేదు.

"పోండి, మీ చాదస్తమూ మీరూనూ. మీ అమ్మగారు వందేళ్ళు బ్రతుకుతారు. ఏ జలుబో చేసుంటుంది. అంత మాత్రానికి పరీక్షల టైంలో పిల్లల్ని తీసుకెళ్ళటం ఎందుకు? మీరు ప్రమోషన్ పానల్లో వున్నారై రి. యీ టైంలో లీవు పెట్టడం బావుండదు. ఎంత డబ్బు ఖర్చు. ఎంత టీడియస్ జర్నీ" అన్నది.

ఆవిడ చెప్పిందంతా నిజమే. కాని అమ్మని చూడాలనేకోరిక ఆమె ఆరోగ్యం గురించిన ఆదుర్దా తనని నిలవనివ్వ లేదు. రజనికి ఆ మమకారాలు లేవు. "అంతగా మీ అమ్మనీ, చెల్లెల్నీ, మీ వాళ్ళందర్నీ చూడాలంటే మీరు వెళ్ళి రండి," అన్నది. ఆమె అనుజ్ఞతోనే ఈ ప్రయాణం చేసాడు.

"రజని అన్నట్టు అమ్మ కేమీ కాకూ డదు. నూరేళ్ళు బ్రతకాలి." గట్టిగా అనుకొన్నాడు.

సగం దూరానికి పైబడి నడిచాడు. రివ్వున చల్లటిగాలి వీచింది. వర్షం పడే సూచన. ఆకాశం మెరిసింది తళుక్కున కళ్ళు మిరిమిట్లు కొలిపేలా. ఆ క్షణకాలం వెలుగులో ఎదురుగా రోడ్డుమీద, అల్లంత దూరాన ఏదో తెల్లటి ఆకారం కదులుతున్న స్ఫురహ. అదే సమయంలో గుండెలదిరేలా పెద్దగా ఉరిమింది ఆకాశం. గుండెలు గుబేలు మన్నాయి. కాళ్ళు స్తంభించిపోయాయి. శరీరం జలదరించింది. వెంట్రుకలు గగుర్పొడిచాయి...మెదడు మొద్దుబారి పోయింది. ఆలోచనలు తెగిపోయాయి... తెల్లటి ఆకారం దగ్గరగా వస్తున్నట్లు, తప్పించుకు పారిపోవాలనే ఆరాటం ఎక్కడో లోలోపల ప్రారంభమైంది కాబోలు, తనకు తెలీకుండానే కాలు కది లింది, అడుగు పడింది, అంతే – ఎవరో బలంగా నెట్టినట్లైంది. కటుక్కున కాలు జారిపోయింది.ముందుకు తూలిపోయాడు విసురుగా. చేతిలో సూట్ కేస్ ఎగిరి దూరంగా పడ్డది. హేండ్ స్టిక్ ఎక్కడ పడిందో! బ్యాలెన్సు కుదరక ముందుకు పడిపోయాడు. గులకరాయి ఠక్కున కొట్టుకొంది నుదుటికి. 'అమ్మా' అని అరిచాడు. కాని పెదవులు దాటి శబ్దం రాలేదు. ఎవరో ఎక్కడికో బలవంతంగా తోసుకెళ్ళుతున్నట్టు వూహ...

రెండు చేతులకి బేడీలువేసి, మెడపై కర్రపెట్టి నెట్టుకొంటూ. మోకాళ్ళమీద కొట్టుకొంటూ, బరబరా లాక్కెళ్ళు తున్నారు పోలీసులు. ఇనుప సంకెళ్ళు 'ఖణేళ్ ఖణేళ్' మంటున్న శబ్దం. నెత్తిమీద గట్టిగా కొట్టిన చప్పుడు, చెవులు గింగుర్లెత్తుతున్నాయి. చెప్పలేని బాధ. వీపుమీద చెయ్యిపెట్టి ముందుకు తోసా రెవరో. చీకటి గొయ్యారంలా వున్న జైలు గదిలో తూలిపడ్డాడు. గది తలుపులు లాగి తాళం వేశారు. తనిప్పుడు ఖైదీ అది తన గదే. దాన్నెప్పుడు జైలు గదిగా మార్చారో తెలియటంలేదు...వొళ్ళంతా నొప్పులు. తల నొప్పి, నాలుక పిడుచకట్టుకు పోతోంది. శరీరం పచ్చి పుండులా వుంది ... తనవాళ్ళే తనను బంధించి తన గదిలోనే ఖైదు చేశారు! బాధతో 'అమ్మా' అని మూలిగాడు. అమ్మ ప్రత్యక్షమైంది. చల్లటి చేత్తో ప్రేమగా నిమిరింది. ఆమె కళ్ళనిండా నీరు.

మాట్లాడలేకపోతోంది "నీకేమైందమ్మా?" ఆమె చేతులు పట్టుకొన్నాడు పసిబిడ్డలా. చల్లగా వున్నాయి చేతులు – మంచు ముద్దల్లా. వెంటనే స్పృహ వచ్చింది.

బలవంతంగా కళ్ళు తెరిచాడు సూర్యం. చీకటి తప్ప మరేమీ కన్పించటంలేదు సన్నగా జల్లు పడుతోంది. చెయ్యి కదిల్చాడు. భారంగా వుంది. ఏదో వస్తువు తగిలింది చల్లగా. వేళ్ళతో నొక్కాడు. టార్చి వెలిగింది, చీకటి కోసుకుంటూ.

"అరె, టార్చి చేతిలోనే వుందా. థాంక్ గాడ్. జారి పడిపోలేదు ఎక్కడో... అవును నా కేమైందిప్పుడు. ఎందుకు పడిపోయాను ..." లేవబోయాడు. కుడికాలు మోకాటి దగ్గర కలుక్కుమంది. ఎడమకాలి మడిమ బెణికింది నుదుటిదగ్గర భగ్గుమన్నది.

"ఛ. ఛ. వాటీజ్ దిస్. వాట్ హాపెండ్ ?" పైకే అనేశాడు. లేచి కూర్చున్నాడు. నేలంతా చల్లగా, బురదగా వుంది...టార్చి వేసి చుట్టూ చూచాడు. కొంచెం దూరంలో సూట్ కేస్ పడివుంది. అదృష్టవశాత్తూ పగిలి చిందరవందర కాలేదు. నెమ్మదిగా లేచాడు.

"నేను భయపడ్డానా ఏమిటి?" స్వగతాన్ని ప్రకాశంగానే అనుకొన్నాడు. టార్చి వెలుగుతో 'ఆకారం' కనబడ్డ వైపుగా చూశాడు. తుమ్మచెట్టుకొమ్మ మీద చిరిగిన తెల్ల గుడ్డపీలిక దానిమీద తన హాండ్ స్టిక్ పడివుంది. ఆశ్చర్యం కలిగింది. ఇందాక దీన్నిచూచే దయ్యమని భయపడ్డాడన్నమాట. అదే సమయంలో గులకరాయి మీద పెట్టిన కాలుజారి పడిపోయాడు.

"వాటె ఫూలిష్‌నెస్!" పెద్దగా నవ్వేశాడు. గుండెల్లో గూడు కట్టుకొన్న భయం పటాపంచలైపోయింది. వొళ్ళు తేలికైనట్లు ఫీలయ్యాడు. మోకాలు నొప్పిగా వుంది. మణికట్టు, నుదురు బాధపెడుతున్నాయి. 'ఐ డోంట్ కేర్' అనుకొన్నాడు. సూట్ కేస్, హాండిస్టిక్ తీసుకొని బయలుదేరాడు. బట్టలంతా బురదయ్యాయి. క్రింది పెదవి చిట్లి రక్తంకారి గడ్డకట్టింది. టార్చితో టైం చూశాడు. వాచీ గ్లాసు ముక్కలు ముక్కలైపోయింది. కానీ వాచీ మాత్రం ఆడుతూనే వుంది. తనకా సంఘటనతో సంబంధం లేనట్లు. ఒంటిగంట కావస్తోంది. 'అంటే దాదాపు అరగంట స్పృహ కోల్పోయానా' అనుకొన్నాడు.

"దట్సాల్ రైట్."

ఉప్పుకాలవ వంతెనమీద కొచ్చాడు. హమ్మయ్య! ఇక అరమైలే వుంది. పది నిముషాలు చాలు!

ఉప్పుకాలవలో నీళ్ళు నిండుగా వున్నాయి. చిన్నప్పుడు కాలవలోనూ, సౌనల్లోనూ గాలాలు వేసి చేపలు పట్టడం సరదాగా వుండేది. గాలంతో

చేపలు పట్టడం పెద్ద ఆర్టు. టెక్నిక్ కూడా చాలా అవసరం. మనకంటే తెలివైనవి పక్కి చేపలు. ఎరని గిరుకు తింటాయిగాని ఒక పట్టాన గాలాన్ని మింగవు. మనల్ని కవ్వించి, ఏడిపించి పారిపోతాయి. కొన్ని రకాల చేపలు గాలం చూచీ చూడకముందే గుటుక్కున మింగి కూచుంటాయి పిచ్చి ముండలు. గాలపు వేటలో వుండే ఆనందం వర్ణనాతీతం!...నవ్వుకొన్నాడు.

మణికట్టు, మడిమ బాధపెడ్తున్నా, గతానుభవాల స్మృతులు మనస్సుకు కల్పించిన ఉత్తేజంతో ముందుకు సాగిపోయాడు సూర్యం.

ఊరికి దగ్గరగా వచ్చాడు. కోళ్ళ కొక్కొరోలు, కుక్కల అరుపులూ బాగా దగ్గరగా వినబడుతున్నాయి.

పంతులుగారి ఆకు తోట!

రోడ్డుకి రెండుపక్కలా మాగాణి పొలాలు!

నీళ్ళు. కీచు రాళ్ళు గోల...

అంతా తనకి పరిచయమైనదే.

మునసబుగారి అరటితోట. అక్కడ పెద్ద నేరేడు చెట్టు. నల్లగా నిగనిగలాడుతూ యింత లావున నేరేడుపళ్ళు ఎంత బావుండేవో! ఆ చెట్టు యింకా వుంది అలాగే.

ఊరిని ఆనుకొని రోడ్డుకి కుడి ప్రక్కన పెద్ద మర్రిచెట్టు. ఒకప్పుడు దాన్ని 'దెయ్యాల మర్రి' అనీ 'దొంగల మర్రి' అనీ అనేవాళ్ళు. నిజంగా ఆ చెట్టు కొమ్మల్లో ఎవరైనా దాక్కొంటే కనిపెట్టటం కష్టమే.

ఎడమచేతివైపు కరణంగారి దొరువు దాని ఒడ్డున బ్రాహ్మణ స్మశానం. అక్కడే శవాల్ని కాలుస్తారు. 'అమ్మని కూడా యిక్కడే కాల్చాలి కాబోలు!- అతని గుండె విపరీతంగా కొట్టుకో మొదలుపెట్టింది. "ఇచ్చోటనే గదా..." సత్య హరిశ్చంద్ర నాటకంలోని పద్యం.

"ఛీ. ఏమిటి ఇంత పిరికివాణ్ణై పోతున్నాను."-మనస్సుని, దృష్టిని బలవంతంగా రోడ్డుమీదికి మళ్ళించాడు.

అయిదు నిమిషాల్లో "కన్నేశ్వరాలయం" దగ్గరికొచ్చాడు.

'హమ్మయ్య, వూళ్ళోకి వచ్చేశాం' రిలాక్స్‌డ్‌గా శ్వాస వదిలాడు. పెద్ద దేవాలయం పురాతనకాలం నాటిది. గొప్ప స్థల పురాణమున్నది దానికి. ఆ చరిత్రంతా చెప్పి జీర్ణోద్ధారణ నిధికి చందాలు వసూలు చేస్తుండేవాడు సాంబయ్య పంతులు. పాపం పెద్ద వాడైపోయిం తర్వాతకూడా గుడికోసమే జీవించాడు. కొడుకులు పెద్ద ఉద్యోగాల్లో వున్నా అయన మాత్రం గుడిని కని పెట్టుకొనే వుండి చనిపోయాడట! ఇప్పు డెవరు చూస్తున్నారో గుడి వ్యవహారం?

కరెంటు లైటు! ఆహా. వూరికి కరెంటు వచ్చిందన్నమాట. సంతోషం. పోయిన ఎలక్షన్ల సమయంలో వచ్చుం




టుంది! రోడ్డు సంగతే పట్టించుకోలేదెవరూ.

ఇక్కడెవరో పెద్ద మేడ కట్టారే! లేటెస్టు డిజైన్! "విశ్వనాథ శ్రేష్ఠి." ఎవరూ విస్సిగాడే! మొన్నటిదాకా తిండి గడవక మద్రాసులో ఏదో హోల్‌సేల్ షాపులో గుమాస్తాగా వున్నాడని విన్నామే! లాటరీ తగిలిందో! స్మగ్లింగ్ బిజినెస్ చేస్తున్నాడో!

ఆత్రేయగారిల్లు శిథిలమైపోయింది. ఎంత పెద్ద పెంకుటి లోగిలి! ఎంత సంసారం. అంతా ఉద్యోగాలకి వెళ్ళిపోయుంటారు. ఈ యిల్లు పడిపోయే స్థితికొచ్చింది.

శ్రీరాములవారి ఆలయం. ఎడమవైపు తిరిగాడు. అంత దూరాన కనబడుతోంది తన యిల్లు! గుండెల్లో దడ ప్రారంభమైంది. కాళ్ళలో వణుకు పుట్టుకొస్తోంది. వడివడిగా నడిచాడు.

ఏళ్ళ తరబడి వర్షాలకి సగం కరిగిపోయిన మట్టిగోడలు కాంపౌండు. పడిపోటానికి సిద్ధంగా వున్న పాత తలుపులు గుమ్మంతో సంబంధం లేనట్లు అంటీ అంటనట్లు వున్నాయి. చేతితో తడితే విరుచుకు పడిపోతాయేమో ననిపించి తలుపుమీద వేసిన చెయ్యి వెనక్కి తీసుకున్నాడు. అమ్మ నిద్రపోతోందేమో? ఎలా? తలుపు సందులోంచి చూసాడు. ముందు వరండాలో మసి కప్పుకొన్న కిరోసిన్ దీపం గుడ్డిగా వెలుగుతోంది.

ఇంటి తలుపులు కొంచెం తెరిచినట్లుంది. లోపల్నుంచి సన్నగా దీపం

కనబడుతోంది. ఎవరో కదులుతున్నారు. ఎవరు...రాజీ! అమ్మకు సేవలు చేయ టానికి వున్న ఒక్కగానొక్క కూతురు.

'రాజీ!...రాజీ!...' పిలిచాడు.

సమాధానం లేదు. మరలా పిలిచాడు బిగ్గరగా. మరో క్షణంలో లోపల యింటి తలుపు పూర్తిగా తెరచుకొని రాజీ, బావగారు బయటికొచ్చి వరండాలో నిల బడ్డారు. ఆశ్చర్యం, అనుమానంతో ఒకరి మొహాలొకరు చూసుకొంటున్నారు.

"రాజీ! నేను అన్నయ్యని." అన్నాడు సూర్యం.

"ఎవరూ...సూర్యమా!" అన్నాడు బావగారు.

"అన్నయ్యా" అంటూ రాజీ పరి గెత్తుకొచ్చి తలుపు తీసింది. సూర్యాన్ని చూట్టంతోనే ఆమె భయంతో ఒక్కడుగు వెనక్కి వేసింది. సూర్యం గమనించ కుండా లోపలికి వచ్చేశాడు.

"ముఖమంతా అదేంటన్నయ్యా, ఆ నెత్తురేమిటీ...?"

"అదేమిటి బావా! ఏమైంది ... ఆ నెత్తురేమిటి?" బావగారి ప్రశ్న.

"ఓహ్ అదా! చీకట్లో కాలుజారి రోడ్డుమీద పడిపోయాను. బట్టలకి బుర దంటుకొన్నది..."-సూట్‌కేస్ అందు కొన్నది చెల్లెలు.

"ఇంత అర్ధరాత్రిలో వొంటరిగా నడిచొచ్చావా సూర్యం. టూ బాడ్. ముందు కాళ్ళూ మొహం కడుక్కో."

చెల్లెలు చెంబుతో నీళ్ళు తెచ్చి యిచ్చింది.

"ఆఁ, రాకుంటే రెడ్డిపాలెంలో రాత్రంతా ఎక్కడ వుండేట్లు. ఎరుగున్న రోడ్డేకదా! నెమ్మదిగా నడిచొచ్చేశాను... అన్నట్టు నువ్వెప్పుడొచ్చావ్ బావా?... రంగడు భిలాయ్‌లోనే వుంటున్నాడా? హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయించు కోవాలని ఢిల్లీ వచ్చాడు పోయిన సంవత్సరం. తర్వాత వార్తలే లేవు వాడి దగ్గర్నుంచి." కాళ్ళు కడుక్కు న్నాడు. మొహం తుడుచుకొంటూ చెల్లెల్ని అడిగాడు, "అమ్మ కెట్లావుంది రాజీ?" ఆతృత కొట్టొచ్చినట్లు కనబడు తోంది. ఆమె ముఖంలో భావాలు సరిగా కనబడ్డంలేదు. వెంటనే సమాధానం రాలేదు. ఎక్కిళ్ళు పెడుతోందామె.

గుమ్మంలో అడుగుపెట్టిన సూర్యం ఠక్కున ఆగిపోయాడు. ఎదురుగా మిణుకు మిణుకు మంటున్న ఆముదపు దీపం అతని ప్రశ్నకు సమాధానం! "ఇంకెక్కడి అమ్మ..." రాజీ బావురు మన్నది. అవతల పెట్టటానికి ఎత్తిన కాలు గుమ్మంమీద పడి జారింది. బోర్లా పడిపోయాడు. నుదురు నేలకి కొట్టుకొంది. 'అమ్మా' అన్నాడు. స్పృహ పోయింది...మైకంలో-ఏవేవో దృశ్యాలు, ఏవేవో గోలలు, ఏవేవో భావాలు-అన్నీ అస్పష్టంగా-అర్థంకాని




వేదన, అంతంలేని ఆవేదన, అవధుల్లేని ఆర్తి, ఆక్రోశము, ఏదో, ఏదో...

మరో అయిదు నిమిషాలక్కాని ఈ లోకంలోకి రాలేకపోయాడు సూర్యం. చల్లటినీళ్ళు మొహాన చల్లింది గాబోలు, చెల్లెలు గుడ్డతో తుడుస్తోంది. "అన్నయ్యా..." అంటూ పిలుస్తోంది. 'బావా...సూర్యం' అంటూ పలకరిస్తున్నాడు బావ.

"ఆఁ." అన్నాడు నీరసంగా. కళ్ళు తెరిచాడు భారంగా. 'అమ్మా' అని ఆక్రోశిస్తోంది గుండె

ఎవరో చేయిపట్టుకు లేవదీసి కూర్చో బెట్టారు. నీరసకంఠంతో విసిరాడు మామయ్య.

"బాబూ, సూర్యం..." గాద్గదిక మైన గొంతుకతో పలకరించాడు డెబ్భై ఏళ్ళ ముసలాయన.

"మీరా మామయ్యా ... ఎప్పు డొచ్చారు?" నీరసంగా ప్రశ్నించాడు సూర్యం.

"మీ తల్లి పోయేముందుగా వచ్చా నురా, ఆఖరి చూపు కోసం." నోటికడ్డం పెట్టుకొని ఏడుపు దిగమింగు తున్నాడాయన.

"నేను కన్నతల్లి ఆఖరిచూపుకూడా నోచుకోని దౌర్భాగ్యుణ్ణి మామయ్యా. నేను రాకముందరే వెళ్ళిపోయింది ... నన్ను చూట్టానికి యిష్టంలేక ..." మామయ్య వొడిలో ముఖం దాచుకొని పసిపిల్లాడిలా ఏడ్చాడు సూర్యం. రాజీ ఏడ్చింది. వాళ్ళని ఓదార్చటానికి శ్రమ పడుతున్నాడు రాజీ భర్త.

"సూర్యం, ఏమిటి మరీ పసిపిల్లా డిలా? ఇంత షాక్ తింటావనుకోలేదు. నువ్వూరుకో...లేకుంటే రాజీ చూడు మరీ యిదై పోతోంది," అన్నాడు

"ఆఖరి క్షణాల్లో దగ్గరుండి చూచు కోలేని 'కొడుకు' నయ్యా నేను. మా అమ్మకి ఏ జబ్బూ రాదని, నూరేళ్ళు నిండుగా బతుకుతుందని పిచ్చిగా నమ్మా నయ్యా నేను. ఉద్యోగం పేరుతో, కన్న తల్లికీ, పెరిగిన వూరికీ,దూరంగా–దగ్గరకు రాలేనంత దూరంగా బ్రతుకు తున్నాను. అందుకే అమ్మ నన్ను చూడ కుండా వెళ్ళిపోయింది." ఏడుపు దిగ మింగుతూ అన్నాడు.

"నో...నో...ప్లీజ్..." అంటు న్నాడు బావ.

అప్పటికే చుట్టుపక్కలవాళ్ళు కొంత మంది వచ్చారక్కడికి. తెల్లవారింది.

కర్మ క్రతువులు శాస్త్రోక్తంగా పూర్తయ్యాయి.

సర్వం పోగొట్టుకొన్నవాడిలా శూన్యంలోకి చూస్తూ మౌనంగా వుండి పోయాడు సూర్యం.

ఢిల్లీకి వెళ్ళిన సూర్యం మరో నెల రోజుల్లోనే భార్యాబిడ్డలతో సహా తిరిగి వూరికి వచ్చేశాడు. అతని ముఖం యిప్పుడెంతో ప్రశాంతంగా వుంది – జైలునుంచి విడుదలైన 'నిర్దోషి' లాగా.

తన ఉద్యోగానికి రాజీనామా చేసి వచ్చేశాడు.






"నమస్కారం మేష్టారు!" గబాల్న కారాపి ... దిగి పలకరించాడు భరత్.

చేతిలో తోటకూర కాడకి ... ఆయనకి ఏమాత్రం తేడాలేని డెబ్బై ఐదేళ్ళ ధనంజయరావు మేష్టారు గబాల్న ప్రతినమస్కారం చేసి, కళ్ళజోడు సరిచేసుకుని తేరిపారా చూసి...'ఎవరు బాబూ?' అన్నట్టు ప్రశ్నార్థకంగా ఉండి పోయారు.

"గుర్తుపట్టేరా మేష్టారూ...?"

అదే లేదన్నట్టు మరోసారి పరికించి చూస్తూ తల ఊపారు మేష్టారు.

"నేను మేష్టారూ, రాఘవరావుగారి అబ్బాయిని!"

ఆ మాట వినంగానే ఆనందంతో సంబరపడిపోయిన మేష్టారు అడిగారు 'ఎన్నోవాడివి నాయనా?' అని.

"మూడోవాడ్ని మేష్టారూ...!"

"భరతుడివా బాబూ!"

"అవును మేష్టారూ...!"

"చాలా సంతోషం నాయనా! చిన్ననాటి మేష్టార్ని మర్చిపోకుండా పలకరించావు. చాలా సంతోషం!" ధనంజయరావు మేష్టారి నయనాలు ఆనందంతో చెమర్చాయి. 'ఎన్నాళ్ళైంది బాబూ, అమెరికానుంచి వచ్చి...?' ఆప్యాయంగా అడిగా రాయన

"వారం రోజులైంది మేష్టారూ! నాన్నగారు కాలం చేశారు ఐదారేళ్ళు దూరంగా ఉండి వార్ని చూడలేకపోయాను. ఎప్పటికప్పుడు వచ్చేద్దామనుకున్నా...రిసెర్చి వర్క్ పూర్తి కాక ఉండిపోవాల్సి వచ్చేది. క్రిందటి నెలలో అదైపోయింది ఇహ అక్కడ ఉండబుద్ధేయలేదు...మేష్టారూ! అందుకే వచ్చేశాను."

"మంచిపని చేశావు నాయనా! నాన్నగారు పోయారని తెలిసి నేనూ వెళ్ళాను బాబూ మీ ఇంటికి. వెళ్ళి మాత్రం చేసేదేముంది? మీ అమ్మగారి బాధ ఇంతా అంతా కాదు. మహాతల్లికి దేవుడలా రాసిపెట్టేడు. పోనీలే బాబూ... అయిందేదో అయిపోయింది. నువ్వు మాత్రం మంచిపని చేశావు మన దేశానికి తిరిగి వచ్చేయడంలో. ఈ పరిస్థితుల్లో అమ్మగారి ఆరోగ్యం కాపాడటానికి నువ్వు దగ్గర ఉండటం ఎంతైనా అవసరం! వస్తా బాబూ, మళ్ళీ కలుస్తాను" అంటూ బయల్దేరబోయారాయన.

"రండి మేష్టారూ, కార్లో వెళ్దాం! మిమ్మల్నింటి దగ్గిర దింపి వెళ్తాను. నాకు అదే దారిగా...!"

"ఎందుకు బాబూ నీ కా శ్రమ...?"

"శ్రమేమిటి మేష్టారూ? ఫరవాలేదు, రండి...!"

* * *

"మీరా మేష్టారూ, రండి...రండి!" ధనంజయరావుగార్ని ఆహ్వానించి, 'అమ్మా! మేష్టారొచ్చారు...' అంటూ గట్టిగా కేకపెట్టాడు భరత్.

"నీతో చిన్న పనుండి వచ్చాన్నాయనా!"

"ఏమిటి మేష్టారూ ..., ఎవరైనా కుర్రాడితో కబురుచేస్తే నేనే వచ్చేవాడిని కదా! ఇంత ఎండలో వచ్చారు మీరు- వెరీ సారీ మేష్టారూ!"

"ఫరవాలేదు. ఈ ఎండలు నన్నేం చేస్తాయి...? డెబ్భైఐదు ఎండాకాలాలు

చూశాను. మరేం ఫరవాలేదు; కందిపో నయ్యా!" నవ్వుతూ అన్నారు ధనంజయరావుగారు.

"నమస్కారం మేష్టారూ ... కులాసాగా ఉన్నారా?" మజ్జిగ గ్లాసు అందిస్తూ...అంది భరత్ తల్లి పార్వతమ్మగారు.

"నమస్కారం తల్లీ...ఇదే కులాసా ఇలా ఉన్నాను" అంటూ చిరునవ్వు నవ్వారాయన.

"బాబూ చిన్న పని అన్నాను కదూ! అదే, రేపు ఆదివారం సాయంత్రం మన స్కూల్‌డే జరపా లనుకుంటున్నాము. ప్రతి యేడూ ఇదో పండుగలా చేస్తున్నాము నీలాంటి పాత విద్యార్థులంతా వస్తున్నారు కూడా! ఈ సారి కూడా అలాగే చెయ్యాలని సంకల్పం!"

"తప్పకుండా జరిపించండి మేష్టారూ! మీ చేతుల మీద ఎంతెంత మంది పైకొచ్చారో.... వాళ్ళందర్నీ సంవత్సరాని కొక్కసారైనా కల్సుకునే భాగ్యం కలిగిస్తున్నారు మీరు బాలా సంతోషం మేష్టారూ," తృప్తిగా నవ్వుతూ అన్నాడు భరత్!

"ఏ కలక్టర్నో..., పోలీసు ఆఫీసర్నో.... మరో ఎమ్మెల్యేనో పిలవడం నా కిష్టంలేదు బాబూ! వాళ్ళు నా స్టూడెంట్లే అయితే...తప్పకుండా పిలిచే వాడ్నేకో. అది వేరే విషయం!" అని గంభీరంగా అని, మళ్ళీ చిరునవ్వు నవ్వుతూ..."ఇంతకీ అసలు సంగతేం టంటే...ఆ రోజు సభకి నువ్వు అధ్యక్షత వహించాలి నాయనా!"

"నేనా మేష్టారూ...భలేవారే! అభిమానానికైనా కొంత హద్దుండాలి. నేనా స్కూల్లో చదువుకున్నవాడ్ని! ఎప్పటికీ ఆ బళ్ళో స్టూడెంటునేగానీ ... అక్కడే ఓ సభకి అధ్యక్షత వహించేంత గొప్ప వాడ్ని కాలేను మేష్టారూ!"

"ఇదమ్మా మీవాడితో చిక్కు. తనేదో తక్కువనుకుంటాడు. సరే ... అదలా వదిలెయ్యండి! పెద్ద పెద్ద చదువుల్లో నా శిష్యులే వుండగా...ఇంకా నేనే కలక్టరు కోసమో ... ఎమ్మెల్సీ కోసమో...దేవులాడటం దేనికి? నా శిష్యుడింత ఉన్నత స్థితికి రాగలిగాడంటే నా కెంత సంతోషంగా ఉంటుందో చెప్పండి! అందుకే, ఒకానొక రోజున అదే బళ్ళో...నేంమీద కూర్చుని పాఠాలు నేర్చుకున్న అతనిలాంటివాడే...ఇవాళ పంక్షనుకి అధ్యక్షత వహించడానికి అర్హుడు...!'' అంటూ పార్వతమ్మ వైపు చూసి నవ్వారాయన!

"మేష్టారు మన మేలు కోరేవారు. మనమంటే అమితమైన అభిమానం వారికి. నిజానికి వారి దయవల్లే...మీరంతా ఈనాడీ స్థితికి రాగలిగారు. ఒప్పుకో నాయనా, తప్పకుండా వెళ్ళిరా ఫంక్షనుకి." నచ్చచెప్పింది పార్వతమ్మ!

"వెళ్ళిరా, కాదమ్మా! మీరూ దయ-

చెయ్యాలి. మీటోటి వారొస్తేనే మా కెంతో నిండుగా ఉంటుంది." అర్థించారు మేష్టారు.

"అలాగే మేష్టారూ ... తప్పకుండా వస్తాను."

"చాలా సంతోషం తల్లీ! నా మాట మన్నించినందుకు నా కెంతో ఆనందంగా ఉంది. వస్తానమ్మా! వస్తా బాబూ!" అంటూ బయల్దేరిన మేష్టార్ని..."కార్లో దింపుతాను ... ఉండండి మేష్టారూ!" అని భరత్ ఆపాలని ప్రయత్నించినా... 'ఫరవాలేదయ్యా'అంటూ వెళ్ళిపోయారు.

* * *

"నిజానికి సంవత్సరానికోసారి నా పుట్టినరోజులాగానే జరుపుకుంటున్నా నీ స్కూల్ వార్షికోత్సవాన్ని! మీరంతా నా ఆహ్వానం మన్నించి వచ్చినందుకు నా కెంతో సంతోషంగా ఉంది. మన మంతా సంవత్సరానికోసారి ఇలా కల్సుకోడం నా మహద్భాగ్యం!"

మా నాన్నగారు స్థాపించిన ఈ బడిని...వారి తరువాత దాని బాగోగులు నా బాధ్యతగా స్వీకరించాను. నలభై ఏళ్ళ పాటు ఇక్కడే పాఠాలు చెప్పాను నా తరువాత మా అబ్బాయి శ్యామల రావు నడిపిస్తున్నాడు దీన్ని. మీ అందరి అభిమానంవల్లా ... ఆదరణా, ప్రోత్సాహంవల్లా ... దీనికి రికగ్నిష నొచ్చి...'ఎయిడెడ్' స్కూల్‌గా నిల బడ గలిగింది ఈనాటికీ రిటైరైనా... నాకాలక్షేపం ఈ పిల్లల్తోనే! తోచనప్పుడు వచ్చి కూర్చుంటాను. వాళ్ళానికో క్లాసైనా చెప్పకపోతే...నాకు అదోలా ఉంటుంది. అందుకనే ... ఇక్కడున్న ఐదుగురు మేష్టర్లలో ... ఎవరైనా .... ఎప్పు డైనా... సెలవు పెడితే ఎంత బాగుం టుందా అని ఎదురుచూస్తూ ఉంటాను.

"ఇవాళ నేనెంత ఆనందపడు తున్నానో ... విడిగా చెప్పలేను ఈ సభకి అధ్యక్షత వహించింది డాక్టర్ భరత్! డాక్టర్ భరత ఎవరో కాదు. పాతిక సంవత్సరాల క్రితం ... ఇదే స్కూల్లో చదువుకున్న విద్యార్థి! ఉన్నత విద్యకోసం ... పై దేశాలకి వెళ్ళి... అపరిమిత జ్ఞానాన్ని సంపా దించుకుని మాతృదేశానికి తిరిగివచ్చిన మహా మేధావి.

"చిరంజీవి భరత్‌ని డాక్టర్ చేసింది పాఠశాలే కాకపోయినా ... ఓనమాలు దిద్దించగలిగిం దీబడే! సాంప్రదాయ పరంగా వినయం, విధేయతా...కలిగి, చదువుయందు ఆసక్తి చూపిస్తూ ... 'సెహబాస్' అని చిన్ననాడు అనిపించు కున్నప్పుడే అనుకున్నాం ... మన భరత్ తప్పక ఉన్నత స్థితిని అందు కుంటాడని.

"భరత్‌ని శ్లాఘించడం నా ఉద్దేశం కాదు. అభిమతం అంతకన్నా కాదు- ఇక్కడ పిల్లలూ ... పెద్దలూ ఎంతో




మంది ఆసీనులై ఉన్నారు. అందరికీ నా మనవి ఒక్కటే...!

"జీవితంలో ఎంతో ఉన్నతమైన ఆశయాలూ, అందుకు తోడ్పడే అవకాశాలతో పాటు క్రమమైన ఉంటేనేగానీ...కోరుకున్న ఆచరణలూ స్థాయికి అందుకోడం కష్టం...!

"ఇక్కడ సమావేశమైన చిన్నపిల్లలందరికీ నా మనవి.

"బాబులూ...ఇవాళిలా కుర్చీమీద కూర్చుండి సరాసరి అమెరికా నుంచి దిగొచ్చిన దొరకాదు. మీలా ఒకప్పుడీ బళ్ళోనే చదువుకున్న విద్యార్థి! మీరు కష్టపడి చదివితే ... అలా పై దేశాలకి వెళ్ళొచ్చే అవకాశాలు తప్పకుండా వస్తాయి...! అల్లరీ, అనవసరమైన ఆటలు కట్టిపెట్టి...చదువుయందే దృష్టి పెట్టుకుంటే...అదంత కష్టమైన పని కాదు!

పెద్దలందరికీ ... నా ప్రత్యేక విన్నపం:

తల్లీ.... తండ్రీ.... గురువూ అని చెబుతారుగానీ...గురువూ...., తల్లీ.... తండ్రీ అని చెప్పరు కదా! ప్రత్యక్ష దైవాలూ...పిల్లల విషయంలో బాధ్యత వహించాల్సిన వాళ్ళు ముఖ్యంగా తల్లి తండ్రులు. ఆ తరువాతే.... పొట్ట గడవక పాఠాలు చెప్పుకునే బడి పంతుళ్ళు !

కాబట్టి...

మీ మీ పిల్లల యొక్క భవిష్యత్తు కోసం, వాళ్ళకి చక్కటి అభిలాషలూ... ఆశయాలూ ... అవకాశాలూ కలిగించ వలసిన వాళ్ళు మీరు! ఆ పనికి మీరు

నాంది పలకగలిగితే ... అది సఫలీకృతం కావడానికి శ్రమించగలడు ఉపాధ్యాయుడు.

అంటే..., ముందు శ్రద్ధ తీసుకోవాల్సిన వాళ్ళూ... బాట చూపించాల్సిన వాళ్ళూ..., ముమ్మాటికీ మీరే!

యాభై ఐదేళ్ళ ఉపాధ్యాయ వృత్తిలో నేను తెల్సుకున్న నిజం ఇది కాబట్టే... మీ అందరికీ మనవి చెయ్యాలని ఉవ్విళ్ళూరుతున్నాను. ఉదాహరణకి తీసుకుంటే...

ఇక్కడ బల్లలు మోసే బంట్రోతూ ఈ పాఠశాల విద్యార్థే.... మీరంతా వింటున్న ఈ మైకులు కట్టినవాడూ ఈ స్కూల్ విద్యార్థే..., పూలదండలు గుచ్చిన వ్యక్తి ఈ బళ్ళో చదువుకున్నవాడే.... ఇవాళిలా అధ్యక్ష స్థానంలో కూర్చున్న తనూ ఈ స్కూల్ విద్యార్థే! అయితే...తేడా ఎక్కడ చెప్పండి...? అంటే...నా ఉద్దేశంలో డాక్టర్ భరత్ గాక మిగిలిన ముగ్గురూ హీనమైన బ్రతుకులు బ్రతుకుతున్నారని కాదు. కానీ, ఒక బెంచీమీద కూర్చుని చదువుకున్న ఈ నలుగురి వ్యక్తుల జీవితాల్లో ఇంత తేడా ఎలా రాగలిగింది...?

భరత్‌గాక మిగిలిన ముగ్గురి జీవితాలూ వాళ్ళతోనే సరికాదుకదా! వాళ్ళూ వాళ్ళ వాళ్ళ పిల్లల కో దారి చూపించుకోగలగాలి. ఉన్నతవిద్య నివ్వగల సామాజిక, ఆర్థిక స్థోమత వాళ్ళకుండాలి. మరది సాధ్యపడుతోందా...? ఇదంతా ఎందుకిలా జరిగిందీ అంటే వారి చిన్ననాటి పరిస్థితులే కారణం అని విడిగా చెప్పక్కర్లేదు కదా! ఇదిలా చర్చించుకుంటూ వెళ్తే...అంతం కనపడే విషయంకాదని నాకు తెలుసు. కానీ నా బాధ ఒక్కటే...! పిల్లల్ని సక్రమంగా పెంచాలి. వారిలో ఉన్నతమైన భావాలూ ... ఆశయాలూ కలిగించాలి. కాలం ... ధనం యొక్క విలువల్ని తెలియజెప్పాలి...!

ఈ పని ముందుగా ప్రతి తల్లీ... తండ్రీ చెయ్యగలిగితే, దానివల్ల కలిగే ఆనందానుభూతుల్ని వారితోపాటు ఉపాధ్యాయుడుకూడా కలకాలం పంచుకోగలడు... !

కేవలం డబ్బు సంపాదించడం... హోదాల్లో నిలబడటం.... అది కాదు మనిషికి ముఖ్యం. మనిషి జన్మనెత్తిన తరువాత దాన్ని సార్థకం చేసుకోవాలి. 'లౌ దై నైబర్' అని బైబిల్లో చెప్పినట్టు పొరుగువార్ని ప్రేమించగలగాలి. చేతనైనంత సహాయం .... సేవా చెయ్యాలి. దేశమును ప్రేమించుమన్న అన్న మహాకవి సూక్తులు ఊరికే చెప్పబడినవి కాదని నిరూపించాలి. నా శిష్యులు వేలకి వేలున్నారు. దేశం నలుమూలలా ఉన్నారు. విదేశాలకు వెళ్ళినవారూ ఉన్నారు. అందరిలో నే నాశించేది ఒక్కటే! చేతనైనంత మాతృదేశ సేవ–

వేలకివేలు వచ్చే ఉద్యోగాన్ని




నెల వచ్చింది. పదిహేనో తారీఖు రాబోతోంది-అదీ పని!"

"ఓస్ అదా ..., వస్తానయ్యా! స్కూల్‌డే కదూ!"

"ఊరికే రావటం కాదు బాబూ, నీతో పనొచ్చిం దీసారి!"

"ఏవిఁటో...!"

"ఏముందీ..., టార్పాలిన్సులూ,

మామూలు జంపకానాలూ కావాలి. కుర్చీలు, కుర్చీలు ఎన్ని వేసినా చాలడం లేదు. అవి నాలుగూ కాస్త కన్సెషన్లో ఇచ్చావంటే...జాగ్రత్తగా వాడి, పనై పోగానే తెచ్చిస్తాను...!"

"అది సరేగానీ, అడిగానని అను కోకు. ప్రతీ ఏడూ ఈ జాతరిలా జరగా ల్సిందేనా శ్యామలరావూ?"

"ఆ మాట నువ్వు నన్నడగటం కాదయ్యా..., నన్ను నేనే ప్రశ్నించు కుంటూ ఉంటాను. చెబితే వినడు మా నాన్న. ఎలిమెంట్రీ స్కూల్‌కి స్కూల్‌దే ఏవిఁటో మా స్కూల్లో తప్పించి దేశంలో మరెక్కడా కనీ వినీ ఎరుగను. పెన్షన్‌డబ్బులూ...పొలంమీదొచ్చే కాస్త హైవేజూ...ఆయాసపడుతూ చెప్పుకునే చిన్న చిన్న ప్రైవేట్ల మీదొచ్చే సంపా దనా ... అంతా, పైసాకి పైసా కూడ బెట్టి...సంవత్సరానికోసారిలా తద్దినం లా తగలేస్తాడు మా నాన్న! మా తాత అలా చేసేవాడుట. ఈయన హయాం లోనూ అలాగే జరగాలిట. చస్తున్నాం అంటే నమ్ము! ఊళ్ళో అందర్నీ పిలిచే స్తాడు. వచ్చిన వాళ్ళందరికీ కాక పోయినా...ఓ వందమందికైనా కాఫీలూ వగైరా ఖర్చొకటీ!

ఆయనకి నాటకాలంటే పిచ్చని... ఏ హరిశ్చంద్రలాంటి నాటకమో పెట్టి స్తాడు కాబట్టి, ఊరు ఊరంతా విరగబడి వస్తారు. వచ్చినవాళ్ళని నిలబెట్ట లేము కదా...! అందుకనే నా కీ పాట్లు! వస్తా, జగన్నాథరావ్, నాకు వేరే పనుంది. చిన్ననాటి స్నేహితుడివీ ... క్లాస్‌మేట్‌వీ అని నిన్ను ఇబ్బంది పెట్టేం చాల్సొస్తోం ది. మ రో లా అనుకోకు."

"ఏం అనుకోనులేవయ్యా! నువ్వడి గింది జంపకానాలూ...టార్పాలిన్సులూ మాత్రమే కదా! తీసికెళ్ళు. కానీ శ్యామలరావూ ... నువ్వు నాకో చిన్న సాయం చేసిపెట్టగలవా?"

"నేనా...?"

"అవునయ్యా..., నువ్వే! వెధవ టార్పాలిన్సు లేవిఁటిగానీ ... కుర్చీలే పంపిస్తాను...దర్జాగా! మీ వంశనుకి కొంత ఖర్చు...ఛఛ, కొంతేవిఁటి...! పూర్తిగా నేనే పెట్టుకుంటాను గానీ..., బాగా జనాలు వస్తారంటున్నావు కాబట్టి, నాకో చిన్న సహాయం చేసిపెట్టగలవా?"

"అలా సస్పెన్సులో పెట్టి చంపక... అదేవిఁటో చెప్పు జగన్నాథరావ్, నా వల్లైతే చేస్తాను...!"

జగన్నాథరావు చెప్పాడు.

"ఓస్ ఇదా..., బిజినెస్ కోసం అంత పాట్లు పడుతున్నా వన్నమాట. అలాగే..., కానీ ఈ విషయం మా నాన్న దగ్గర ఎత్తక. ఘనంగా చెయ్యాలి కాబట్టి...ఖర్చుకో వంద కూడా పడేసి నీ కేం తెలియనట్టుండి...నేను చెప్పినట్టు చెయ్యి—"

తృజించి ... కేవలం 'ఉన్నత విద్య నభ్యసించడం వరకే నా కిక్కడ పని!..." అదైపోయింది. వెళ్ళిపోతు న్నాను-' అని పై దేశంలో నొక్కి జెప్పి.... మన దేశానికి తిరిగివచ్చి..., ఇక్కడే నలుగురికీ సేవ చెయ్యబోతు న్నాడు చిరంజీవి భరత్ అని నే నెంతో ఆనందిస్తున్నాను.

తను నేర్చుకున్న విద్యనీ ... ఆపా దించుకున్న జ్ఞానాన్నీ ... మేళ వించి బాధపడే, పీడింపబడే రోగులకి సేవ చెయ్యడానికి మించిన పరమావధి మరొ కటి లేదని కంకణం కట్టుకుని, మన ఊళ్ళోనే స్పెషలిస్టుగా పెద్ద ఆసుపత్రి పెట్టబోతున్నందుకు అభినందిస్తున్నాను అంతటి వ్యక్తికి చిన్ననాటి ఓనమాలు దిద్దించగలిగిన అదృష్టం ... నాకు దక్కిందని సంబరపడుతున్నాను-గర్వ పడుతున్నాను" అంటూ ముగించారు తన స్వాగతోన్యాసం ధనంజయరావు మేష్టారు.

కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి!

తరువాత డాక్టర్ భరత్ మాట్లాడాడు...!

సత్యహరిశ్చంద్ర నాటక ప్రదర్శ నతో ఆ నాటి సభ దివ్యంగా ముగిసింది-

* * *

చదువైపోయింది. ప్రాక్టీసు పెట్టేవు ఇంకా ఎన్నాళ్ళు బాబూ, ఆ మూడు ముళ్ళూ...?" అంటూ రోజుకి పది సార్లైనా తల్లి తొందరచెయ్యడంతో ఒప్పుకోక తప్పలేదు భరత్‌కి.

డాక్టర్ సుజాతతో ఘనంగా జరిగి పోయింది పెళ్ళి!

"మీ రిద్దరూ డాక్టర్లు కావటం ఓ అపూర్వ కలయిక. మంచి మనసుతో మీరు మాట్లాడితేనే చాలు ... బాధలు మర్చిపోతారు జనాలు. మీరు అదృష్ట వంతులు బాబూ!" మనసారా దీవించాడు ధనంజయరావు మేష్టారు.

తృప్తిగా నవ్వారు ... భరత్, సుజాతా!

"ఈసారి స్కూల్ డేకి అధ్యక్షు రాలు దొరికేసిందయ్యా!" అంటూ సుజాత వైపు చూసి నవ్వి వెళ్ళిపోయారు మేష్టారు.

"మేష్టారికి నేనంటే వెర్రిఅభిమానం సుజాత!"

"అవును" అన్నట్టు సునిశితంగా నవ్వింది సుజాత!

* * *

"డాక్టర్‌గార్ని కల్సుకోవాలంటే... ఇక్కడ నిల్చోడంకాదు; అక్కడ దబ్బిచ్చి టోకెన్ తీసుకోవాలి. వరసలో పిలుస్తారు. అర్జంటైతే పదిచ్చి పచ్చ టోకెన్ తీసుకుంటే ముందు చూస్తారు-" యంత్రంలా మాట్లాడేసి క్షణం తీరిక లేనట్టు ఎటో వెళ్ళిపోయాడు వార్డ్‌బాయ్!

చుట్టూ కలియజూస్తున్నా డా తలపాగా ఆసామి!

జనం కిటకిటలాడుతున్నారు. నూతి

మీద వేలుపెట్టుకున్న నర్సుబొమ్మ క్రింద 'నిశబ్దం ప్లీజ్...!' అని రాసుంది–

"వాలకం చూస్తుంటే పచ్చ టోకెన్ కాదు కదా...మామూలు టోకెన్‌కూడా కొనేట్టులేదు నువ్వు! నీలాంటోళ్ళని డాక్టరుగారు చూడరు."

దీనంగా చూశాడు తలపాగా ఆసామి!

"నీకేం పోయిందయ్యా..., అలాగే చూస్తావు! మా పీక పట్టుకుట్టుంది టోకెన్ లేకుండా లోపలికి పంపిస్తే! అమ్మగారు మా డొక్క చింపేస్తారు. డాక్టరుబాబు మా జీతంలో కోసేస్తారు. వెళ్ళు.... వెళ్ళు.... నాకు టైం లేదు–" విసురుగా వెళ్ళిపోయాడు వార్డ్‌బాయ్!

"చిన్ననాటి స్నేహితు డొచ్చాడని చెప్పు బాబూ ..., నే నొచ్చానంటే ఆయన తప్పకుండా రమ్మంటారు" అని చెప్పకోడానికి నాలాటి కుచేలుడికి నోరైనా ఉంది–

బహుశా అదిలేకే...అలా నిల్చుండి పోయాడేమో ఆ తలపాగా వ్యక్తి!

"పక్కల్లో ధర్మాసుపత్రికి వెళ్ళ వయ్యా! నోరు పడిపోయిన వాళ్ళ నక్కడ 'ఫ్రీగా చూస్తారు–' మళ్ళీ వచ్చిన వార్డ్‌బోయ్ అసహనంగా అరిచి వెళ్ళిపోయాడు!

జీవితంలో మొదటిసారిగా తలపాగా తియ్యాలొచ్చి.... గబాల్న వెనుదిరిగి వరండాలోకి వస్తూంటే...'డాక్టర్‌గారి హస్తవాసి చాలా మంచిది బావా! ఏ మాత్రం ఆశలేని కేసుక్కూడా ఊపిరి పోశాడు–' అంటూ ఆనందంగా ... తృప్తిగా నినాదాలు చేసుకుంటూ వెళ్తున్న ఇద్దరి వ్యక్తుల మాటలు చెవిన పడగానే.... మళ్ళీ గబాల్న వెనక్కి తిరిగి డాక్టర్ బోర్డ్ వైపుచూసి, తృప్తిగా నిట్టూర్చి...తన్మయంగా నవ్వుకుంటూ గంభీరంగా మీసాలు దువ్వుకుంటూ, మొహాన పట్టిన చమటనితుడిచేసుకుని... భుజంమీద తుండుగుడ్డని మళ్ళీ తల పాగా చుట్టుకుని వెళ్ళిపోయారు ధనం జయరావు మేష్టారు!

* * *

"...ఎవరూ ... హెడ్‌మాష్టారు శ్యామలరావుగారా, రండి ... రండి! ఊరకరారు మహాత్ములు" జగన్నాథ రావు ఆహ్వానించిన తీరులో కనపడు తోంది హాస్యాస్పదం...!

"మమ్మల్నవనసరంగా ములగచెట్టె క్కించకుగానీ...చిన్న పనుండి వచ్చా నయ్యా నీతో!" కూర్చుంటూ అన్నాడు శ్యామలరావు.

"అదేనయ్యా నే ననేది. పనుంటే గాని రారు మహాత్ములని...!"

"బ్రతకలేక బడిపంతుల్ని. నా కెక్కడ తీరికుంటుంది చెప్పు! నీలా కంట్రాక్టర్ని ... వ్యా పా ర స్తు డ్ని అయితే...నీకన్నా గొప్పగా చెప్పే వాడ్ని కబుర్లు–అది సరేగానీ, 'మే'

"అలాగే, చెప్పు శ్యామలరావు తొందరగా..."

"..............."

* * *

"...చేసిన నిర్వాకం చాలుగానీ... నేను చెప్పినట్టు విను. నువ్వు ఫారిన్ వెళ్ళొస్తే...ఏదో ఊడబొడిచేస్తావనీ..., ఏదో నిర్వాకం వెలగబెట్టేస్తావనీ... మావయ్య నీ కట్నం క్రింద ఇచ్చిన లక్షకీ అప్పు తీసుకున్నట్టు నా దగ్గర నోటుకూడా తీసుకున్నాడు. ఏదో యాభై వేలు మాత్రమే కదా ... నేను బిజినెస్‌లో వాడుకుంది ఫారిన్ వెళ్ళి... వాళ్ళచేత 'డిగ్రీలేదూ ... ఏం లేదు, వెళ్ళిపో బాబూ అర్జెంటుగా ఇక్కడ్నుంచి అని అనిపించుకోడం కాకుండా ... యాభై వేలు తగలబెట్టేశావు నువ్వు. పరిస్థితి ఇదైతే ... 'దాంతో నాకు సంబంధం లేదు, ముందు పెళ్ళి చెయ్యి' అంటూ పోరేస్తున్నాడు మావయ్య నన్ను!

ఈపరిస్థితుల్లో మనకి మిగిలిందొక్కటే నువ్వుఅర్జెంటుగామార్గం! ప్రాక్టీసుపెట్టడం సంపాదించడం! నీ సంసారాన్ని పోషించు కోడం...నన్నే ఇబ్బందికి గురికాకుండా చూడటం...! అయితే ఓవర్‌నైటు ప్రాక్టీసు పెట్టేస్తే...నీ మొహం చూసే వడూ రాడు! కొంత పబ్లిసిటీ స్టంటూ... కొన్ని కొన్ని రికమండేషన్లూ కావాలి! అందుకో పథకం ఆలోచించాను. ఆ విధంగా చెయ్యి!

ముందుగా ధనంజయరావు మేష్టార్ని కల్సుకో!"

"ధనంజయరావా ? ఆయనెవరు?"

"ఆయనేరా బాబూ...మనందరిచేతా చిన్నప్పుడు 'ఓనమాలు' దిద్దించిన మేష్టారు!"

"ఏమో ... అలాంటి మనిషెవడూ జ్ఞాపకంలేదు నాకు. అయినా ఎవరైతే నేం...ఇంగ్లీషు చెప్పడం మానేసి... డర్టీ తెలుగే చెప్పి ... చిన్నప్పటినుంచీ నన్నన్నివిధాలాలో అన్యాయం చేసిన డర్టీ టీచర్ని నేను ససేమిరా కల్సుకో నన్నయ్యా! అయినా ఓల్డ్ బగ్... ఆయనేం చేస్తాడు, నీ పిచ్చిగానీ...!"

"అలా అనేయకురా సన్యాసీ...! వెళ్ళి దణ్ణం పెట్టేయ్ ఐసైపోతాడు. ఇక ఆ ఐస్‌లో ఆయన తల్చుకుంటే జరగనిది లేదు. బలరాముడిలాంటి వాడురా...శిష్యుడంటే పడి చస్తాడు... వచ్చే పదిహేనురోజుల్లో జరుగబోయే ఆయన స్కూల్‌డేలో గానీ...నీ సంగతి ప్రస్తావించాడంటే చాలు. ఆయనమాట మీదున్న గౌరవంకొద్దీ వందలు వందలు వచ్చేస్తాయి మన క్లినిక్కి. ఇప్పుడు క్లిక్కైంది...అదీ సంగతి!"

"నన్ను మరీ ఇబ్బందిలో పెట్టేస్తు న్నావన్నయ్యా!"

"ఇబ్బందీ లేదు ... నీ మొహం లేదు! సాయంత్రంపూట కూరల మార్కెట్టు దగ్గర తగుల్తాడు ధనంజయ

రావు మేష్టరు.... చిన్న సంచీ పుచ్చుకుని తొందరగా తయారవు వెళ్దాం! దూరం నుంచి చూపిస్తాను..., ఇక నువ్వా యన్ని తగులుకుందువుగానీ! నే నలా వెళ్ళి అరగంటలో వచ్చేస్తా! రూపాయికి ఐదు రూపాయల యాక్షన్‌చేసి ... ఆయన మెప్పు పొందుగానీ ... 'సంగతిదీ' అంటూ నీ అంతర్యం చెప్పావా... దెబ్బ తినేయగలవు సుమా! అంటూ తమ్ముడికి గంభీరమైన ఉపన్యాసం ఇచ్చి నిష్క్రమించాడు కంట్రాక్టర్ జగన్నాథరావు.

"అలాగే అన్నయ్యా..." అంటూ వెళ్ళిపోతున్న అన్నగారివైపు చూస్తూ, ఆడబోయే రసవత్తరమైన నాటకానికి రిహార్సిల్సు వేసుకోడంలో మునిగిపోయాడు డాక్టర్ భరత్!

చెప్పడం మర్చిపోయాను. సారీ, ఇదీ కథారంభం...!

ఇహ చదవండి!

* * *

"ఎందుకమ్మా...ఆ కన్నీళ్ళు? ఏం జరిగిపోయిందనీ బాధ? ఊరుకోమ్మా!"

"ఇంకేం చెప్పకు భరత్! నువ్వు చాలా పొరపాటు చేశావు. తెలిసి చేసినా తెలియకజేసినా ... మీ చేష్టలే అప్పుడప్పుడు నన్నిలా అశాంతికీ ... బాధకీ గురిచేస్తాయి!

దైవ స్వరూపులూ ... నీ కింత అన్నం పెట్టినవారు అయిన ధనంజయ రావు మేష్టార్నే కాదనే స్థితికి వచ్చావంటే...బాధపడనా ... ఏడవనా ఏం చెయ్యను భరత్?

"నువ్వలా మాట్లాడేయకమ్మా! 'ఫీ' అంటూ మొదలెడితే ఆ 'క్యూ' పెరిగిపోతుంది. చివరికి మనకి చిప్పే...!" పెద్ద కొడుకు జగన్నాథ రావు కల్పించుకున్నాడు మధ్యలో తమ్ముడ్ని సమర్థిస్తూ!

ఆ మాటకి ఆవిడ నేత్రాలు మరో సారి వర్షించాయి...!

"ఇంత అప్రయోజకులు పుట్టారా నా కడుపున! మళ్ళీ వేదికెక్కి చెప్పక పోయినా...నలుగురు కలిసినచోట... మేష్టారు ఒక్క మాట చెప్పినా ... మన వరండాలో 'క్యూ'లో నిల్చొని టోకెన్లు కొనేవాళ్ళంతా ... ప్రక్క ఊరి ధర్మాసుపత్రివైపు పరిగెడతారని కూడా భయంలేదా...మీకు?

ధనుంజయరావుగార్ని పిల్చి ... కూర్చోపెట్టి ..., చల్లని మంచి నీళ్ళిచ్చి... అవే కాసిని ఇంజక్షన్లా ఇచ్చేస్తే...చూసేవాడెవడూ? తెల్సుకో గలిగే వాడెవడూ...? ఛ...! నా కడుపున చెడబుట్టారు మీరు...!"

ఆమె కళ్ళలో నీళ్ళలా ధారలా కారి పోతూంటే ... 'ఆ ఆలోచన మాకు రాలేదమ్మా!' అన్నట్టు చూస్తూ నిల్చుండిపోయారు...డాక్టర్ భరత్... జగన్నాథరావులు!!!

---




జీవితం అన్న తర్వాత ప్రతి మనిషికీ ఎప్పుడో ఒకప్పుడు ఎగుడు దిగుళ్ళు ఎదురవక మానవు. కానీ కొంతమంది వ్యక్తుల జీవితాల్లో అనుకోని అఘాతాలు ఎదురయి, వాటిలో దిగజారిపోతే, యిక కాంపురుషుడు దయతలచి చేయూత యిచ్చి, పైకి లేవదీస్తే తప్ప, యిక ఆ మనిషికి ఆ మనుగడే అసాధ్యం అనిపిస్తుంది. ఆ అఘాతంలో పడి పోయిన మనిషి ఒంటరివాడయి, దిక్కుతోచనట్టుగా ప్రవర్తించటం కద్దు! ప్రస్తుతం నా పరిస్థితి ఆలాగే అయింది.

రెండు నెలలు పిచ్చాసుపత్రిలో వుండటంతో, నా మానసిక ప్రవృత్తే మారిపోయింది. మొదట్లో అక్కడ ఉండటానికే నేను తిరగబడ్డాను. ఆవేశంగా నా దగ్గరికి వచ్చిన వాళ్ళమీద విరుచుకుపడ్డాను. అదొక బంధిఖానా; నేను ఒక పక్షిలా అయిపోయాను; ఊచలు విరవలేని పిట్ట, రెక్కలు ఊగిసలాడిస్తూ, పంజరం అంతా ఎగిరినట్టుగా, నేను ఆ గదిలో ఖైదీగా తిరిగాను; చిట్టచివరకి నా అశక్తత నాకు తెలిసివచ్చింది; నన్ను దయతలిచి నా వాళ్ళెవరైనా వచ్చి స్వయంగా తీసుకు

వెళితే తప్ప, నాకు యిక్కడనుంచి విముక్తి లేదు; పిచ్చిలేని మనిషి పిచ్చి వాళ్ళ మధ్యవుంటే ఎలాటి నరకయాతన స్వయంగా అనుభవించిన వాళ్ళకిగాని తెలియదు! నా అశక్తతకి నాకు ఏడుపు వచ్చేసింది. నాకు పట్టుమని పాతిక ఏళ్ళుకూడా లేవు, నా కిదేం ఖర్మ! నేనేం పాపం చేశాను. నాలో నేనే కుమిలి ఏడవసాగాను! నా అంతర్యం పది సంవత్సరాల బాలుడిలా అయి పోయింది. నాకు చచ్చిపోవాలని ఎంత గానో అన్పిస్తోంది; కానీ నా ప్రయత్నం హాస్పిటల్ అధికారులు పడనీయలేదు.

అక్కయ్య. నన్ను చూడటానికి వచ్చింది. నేను అక్కయ్య ముందు పసి పిల్లాడిలా ఏడ్చేశాను.

"అక్కయ్యా! నీకు పుణ్యం వుంటుంది; నన్ను యీ నరకంలోనుంచి తప్పించు. ఇంటికి తీసుకెళ్ళిపో."

అక్కయ్య కళ్ళనీళ్ళతో అంది: "ప్రసాదూ! ఆవేశపడకు. నీ ఆరోగ్యం కోసం యిలా చేసాం."

"నా ఆరోగ్యం బాగానే వుంది."

"అని నువ్వు అనుకుంటున్నావు." నా తలమీద చేయివేసి నిమరబోయింది. నేను ఆ చేయి విసురుగా తోసేసాను. "నేను బాగానే వున్నాను. నన్ను యిక్కడ నుంచి తీసుకెళ్ళటం యిష్టం లేకపోతే యింత విషం యివ్వు."

"అదుగో, ఆ ఆవేశమే వద్దంటున్నాను. నువ్వు మనసును కుదుట పర్చుకో! నువ్వు ఆరోగ్యంగా వున్నావని డాక్టర్లు అనగానే, నువ్వు అడక్కుండానే నేను తీసుకు వెళ్తాను." అక్కయ్య వెళ్ళిపోయింది.

నన్ను కాపలాదారుడు లోపలికి వెళ్ళమని సైగచేశాడు. నే నింకా అలాగే నిలబడి వెళ్ళిపోతున్న అక్కయ్యవైపు చూస్తున్నాను. నాలో ప్రాణం ఏదో అక్కయ్యతో వెళ్ళిపోతున్నట్టుగా, నా శరీరం మాత్రమే యిక్కడ మిగిలి నట్టుగా నాకు అనిపించింది ఆ శరీరం యాంత్రికంగా కాపలాదారుని అదిలింపుకు లోబడి లోపలవున్న నరకం లోకి నడిచింది. అక్కడ మంచంమీద కూర్చుని చాలాసేపు ఏడ్చాను. ఇంతలో నలుగురు వచ్చి నా చుట్టూ మూగారు.

"అయ్యో! పాపం! పాపాయి ఏడుస్తోంది. రండర్రా రండి" అని కేకలు పెట్టి నలుగురినీ పోగుచేశారు.

"ఏడవకమ్మా బుజ్జీ! నేనున్నానుగా. పాలు కావాలా?" ఒకడు వచ్చి నా తల దగ్గర కూర్చుని పాలు యివ్వబోయాడు. నేను వాళ్ళని తోసేయబోయాను. నా బలం చాలలేదు. నన్ను అమాంతంగా ఎత్తారు. 'దేవుడమ్మ దేవుడు,' అని వూరేగించసాగారు.

ఇంతలో డాక్టరు వచ్చి గద్దించడంతో ధఢాల్న నన్ను క్రింద పడేసి పారిపోయారు.




నా నడుం పట్టేసింది. డాక్టర్ చేయి చేసుకోవడం నీ తప్పు. ప్రతి మనిషి ఆసరా యిచ్చి నన్ను లేపి మంచం చేసిన తప్పకి శిక్ష అనుభవించాలి!

ఎదురు తిరగలేక, పారిపోలేని నేను, చివరికి ఆ వాతావరణానికి లొంగి పోయాను! ఆ పిచ్చివాళ్ళని అసహ్యించు కోవటం మానేశాను. ఆ భయంకర జాడ్యం నాకు అంటుతుందేమోనని భయపడడం తగ్గించుకున్నాను. వాళ్ళని చూస్తుంటే ఏవగించుకోకుండా, వాళ్ళు నాలాటి దురదృష్టవంతులే అనే జాలి కలగసాగింది. నేను సాటివారితో మాట్లాడటం మానేసాను. మౌనాన్ని ఆశ్రయించాను. డాక్టర్లకి ఎదురు తిరగటం మానేశాను. ఈ శరీరం నాది కాదు. నాకేమీ యిక్కడలేదు. ఇదొక పీడ కల. మెలకువ రావటానికి యింకా కొంత టైమ్ పడుతుంది అనుకున్నాను.

ఆ సమయంలో నామనసుకి నేర్పుకున్న నిగ్రహం అపురూపమైంది. నాకు నేనే గురువుని, నాకు నేనే తోడుని. నాకు నేనే స్నేహితుడ్ని! నా ఒంటరితనం వల్ల దిగులు, బాధ క్రమంగా అంతరించి పోసాగాయి.

ఉగాది పచ్చడిలో చేదుకూడా ఒక రుచే అనుకున్న మనిషి దాన్ని సునా యాసంగా తినగలడు. అలాగే,జీవితంలో కష్టాలు కూడా సుఖాలతో కలిసిన అనుభవాలే అనుకునే ఆత్మస్థైర్యం వుంటే, మనిషి మహోన్నతుడవు తాడు. స్త్రీ పురుషులెవరైనా, పెళ్ళి జీవితంలో ఒక భాగం మాత్రమే! యుక్తవయస్సులో లోకం అంటే ఏమిటో తెలియని తొలి యవ్వనపు పొంగులో పెళ్ళే సర్వస్వం అని మనసు నమ్ముతుంది. అందుకే కాబోలు ఎంతో ఉత్సాహంగా వుండే భార్యాభర్తలు ఒకరు పోతే, మరొకరు వెంటనే మళ్ళీ పెళ్ళి చేసుకుంటారు.

జీవితం అంటేనే దాహం!

ఈ దాహం ఎప్పుడూ ఏదో రకంగా తీరుతూ వుండాలి. అవి తీరే పద్ధతులు అనేకం!

నాకు హఠాత్తుగా అనిపించసాగింది.

ఆఫ్టరాల్!జయతో జరిగిన పెళ్ళి పెళ్లె కాదు. అది నేను బ్రతికిన జీవితం కానే కాదు!నాజీవితం ముందు నాకెంతో వుంది!

నాకు చాలా ధైర్యం రాసాగింది. ఈ పిచ్చాసుపత్రిలో, ఆలోచనా ప్రవాహంలో అనుదినం స్నానం చేయటంతో, నా మనసు ప్రక్షాళితం అయింది. సగానికి తెగినట్టుగా, కూలి పోయిన నా జీవనవృక్షం, తిరిగి, లేలేత చిగుళ్ళు తొడగ నారంభించింది.

రెండు నెలల అనంతరం,నాకు వ్యాధి నయం అయింది అని, పిచ్చాసుపత్రి డాక్టర్ల సిఫార్సుతో, నేను ఆరోగ్య వంతుడిని అయాను అనే ముద్రతో, తిరిగి, నేను యీ లోకంలోకి అడుగు పెట్టాను. (సశేషం)




అనగనగా ఒకప్పుడు - అంటే చాలా రోజులకు పూర్వం-యింకా చెప్పాలంటే మోటారుకార్లు, రైలుబళ్ళు, విమానాలు-వీటిని గురించి కనీసం ఎవరూ ఊహించికూడా వుండని కాలంలో ఒక రాజుగారి గొప్పతనం చెప్పాలంటే, ఆ రాజ్యంలో జనాభా, కోట గోడకు అమర్చిన ఫిరంగులు - రాణివాసంలో వుండే రాణుల సంఖ్య గజశాలలో వుండే ఏనుగులు లెక్కకు తీసుకునేవాళ్ళు ...

పైన చెప్పిన అన్ని విషయాలూ లెక్కకు తీసుకుంటే గల్‌గల్‌పూర్ నవాబు శ్రీమంతు రాజా సూర్యకుమార్, చంద్రకుమార్, విజయసింగ్ షంషేర్ జంగ్ బహద్దరు వారిది చాల చిన్న సంస్థానం. ఎందుచేతనంటే కోటగోడకు రెండే రెండు ఫిరంగులున్నాయి. ఆనాటిలో వున్న సాహెబాల సంఖ్య ఏడు మాత్రమే...ఇక గజశాలలో ఒకే ఒక ఏనుగు వుంది. అందుచేత గల్‌గల్‌పూర్ నవాబువారిని చిన్న జమిందారు అనేందుకు కూడా వీల్లేదు. కాని యీ సంస్థానానికి మంచి ప్రతిష్ఠ వుండేది. తెల్లదొరల ప్రభుత్వంవారు యీ సంస్థానం అంటే ఎక్కువ మక్కువతో వుండేవాళ్ళు. దానికి కూడా కారణం లేకపోలేదు. ప్రస్తుతపు నవాబ్ సాహెబ్ గారికి సాక్షాత్తు తాతగారు శ్రీమంతు రాజా నర్సింగరామ భీమసింగ్ అర్జున సింగ్ నవాబువారు అప్పటి వైస్రాయి లార్డ్ కానింగ్ దొరతో సంధిపత్రంపై స్వయంగా నిశానీచేశారు.

చారిత్రకాధారాలనిబట్టి చూస్తే గల్‌గల్‌పూర్ సంస్థానం ఒకప్పుడు మంచి ఉచ్చస్థితిలోనే వుండేది. ప్రక్కనే వున్న ఓరుగల్లుకోట కూడా ఒకనాడు యీ రాజుల ఆధిపత్యంలోనే వుండేదట రాజ్యాలు సాధారణంగా నాశనమైపోవటానికి కారణమైన మదిరా – మదవతీ యీ రాజ్య విచ్ఛిత్తికి కూడా కారణమైనాయి. గల్‌గల్‌పూర్ సంస్థానాధీశులు మంచి భోగలాలసులు. మద్యపానంతో నిత్యం మత్తెక్కి వుండేవారు. దర్బారు హాల్లో నిత్యం నాట్యకత్తెల అందెల చప్పుడు వినవస్తూనే వుండేది. 'గల్ గల్' మనే కాలిగజ్జెం చప్పుడు ఆధారంగానే ఆ సంస్థానానికి గల్‌గల్‌పూర్ అనే పేరు వచ్చిందని కూడా ఒక వాడుక!...ఈ విధంగా సంస్థానాధీశులు ఖుషీలో మునిగి తేలుతున్న సమయం యిరుగుపొరుగు రాజులకు మంచి అవకాశంగా కనిపించింది. చుట్టుప్రక్కల పరగణాలు ఎవరికి తోచినంత వారు రాజ్యాలలో కలిపేసుకున్నారు. పోగా మిగిలిన రాజ్యంలో సగభాగం తెల్లదొరలకు ధారాదత్తంచేసి, ఆత్మరక్షణ కోసం వైస్రాయి దొరవారితో సంధి పత్రంపై నిశానీ చేశారు శ్రీ అర్జున సింగ్ నవాబువారు.

ఈ విధంగా నశించి నశించి చివరకు 1945 వ సంవత్సరానికి గల్‌గల్‌పూర్ సంస్థానాధీశునికి రెండు ఫిరంగులు, ఒక ఏనుగు, ఏడుగురు రాణులు మిగిలారు. రాజ్యం ఆర్థిక పరిస్థితి మాత్రం కనీసం యీ దర్జా అయినా నిలుపుకోలేనంతగా వుంది. పైపెచ్చు ప్రజానీకం ఒత్తిడి వల్ల కలుగుతున్న ఖర్చుల్ని భరించటం కోసం దొరప్రభుత్వంవారు సంస్థానానికి యిచ్చే భరణంకూడా తగ్గించేశారు.

అందుచేత రాజావారి కోటలో పొదుపు ఉద్యమం తప్పనిసరి అయింది ఏడుగురు రాణులకోసు ఆరుగురికి అంత రంగిక ఖర్చులు సగానికి సగం కోత కోశారు. కానీ యీ చిన్న మార్పువల్ల పెద్ద మొత్తాలేవీ మిగల్లేదు. ఏ రోజు కా రోజు అప్పులు పెరిగినకొద్దీ మహా రాజా సాహెబ్ తలలో ఆలోచనలు కూడా పెరుగుతున్నాయి. 'ఊళ్ళో దొంగల భయం ఎక్కువగా వుంది. ఏకంగా ఒకరోజు కోటమీదకే రావచ్చు. అందుచేత ముందుగానే జాగ్రత్త పడటం మంచిది' అని ఒక చిన్న ఎత్తు వేసి రాణివాసంలో వున్న బంగారు నగలన్నీ భద్రం చేయించే మిషతో బొంబాయిలో ఒక మార్వాడీ వర్తకుడికి పంపించివేశారు. రెండు నెలలు తిరిగిన తరువాత రోల్డుగోల్డు నగలు రాణుల్ని అలంకరించాయి. మన వస్తువులు తిరిగి వచ్చాయన్న సంతోషం తప్ప, ఎలా తిరిగి వచ్చాయన్న విషయం ఆలో చించినవాళ్ళు ఒక్కళ్ళు లేరు. ఈ ఉపాయంవల్ల దాదాపు ఒక సంవత్సరం వరకూ రాజావారి విందులు, వినోదాలు బాగానే సాగిపోయాయి. ఒక రోజు కోశాగారంలో ఒక వెయ్యి రూపాయలు మాత్రమే కనిపించేసరికి మహారాజుకు మతిపోయి నట్లనిపించింది. ఆ రోజునుంచీ పొదుపు ఉద్యమం మరింత తీవ్రతరమయింది. విందులు వినోదాలు దాదాపు లేవనే చెప్పవచ్చు. నౌకర్లు నామకః మాత్రమే మిగిలారు. పెద్దరాణీగారు ఆవిడ గది స్వయంగా ఊడ్చుకోవటం కూడా ఎవరో చూశా రుట!

చివరికి రాజాగారి దృష్టి గజశాలపై పడింది. పన్నెండు ఏనుగులు స్వేచ్ఛగా ఆడుకోటానికి సరిపోయే ఆ శాలలో ఒకే ఒక్క ఏనుగు "లక్ష్మణస్వామి" మాత్రమే మిగిలింది. దాన్ని కూడా వదిలించుకుంటే మంచిదనిపించింది. వెంటనే దివాన్‌గారిని పిలిచి జమా ఖర్చులు లెక్కలు చూశారు. ఏనుగు దానాకు, మావటివాడి జీతానికి కలిపి నెలకు మూడువందల ఏభై అవుతోంది! అందుచేత రాజావారు లక్ష్మణస్వామికి కూడా కోటనుంచి ఉద్వాసన చెప్పాలన్న నిశ్చయానికి వచ్చేశారు. కానీ ఇది తేలిక పనికాదు...రాజుగారు ఏనుగును పోషించలేక తరిమివేశారంటే అవమా నంగా వుంటుంది. ఇక అమ్మటం సంగతి సరేసరి! అయినా రాజావారికి లక్ష్మణస్వామిని అమ్మి డబ్బు సంపా దించాలని లేదు. ఎలాగో ఒకలా ఆ ఏనుగును వదిలించుకుంటే చాలు...

రాజా సాహెబ్‌వారు యీ విష యాన్ని గురించి అంతరంగికంగా ఆలోచిస్తున్న సమయంలో దర్వాన్ వచ్చి సర్ జాన్ రోలింగ్‌స్టోన్ దొరవారు ప్రవేశం కోరుతున్నారని తెలియజేశాడు.

అంగీకార సూచకంగా రాజావారు తల ఆడించారు—ఇక్కడ సర్ జాన్ రోలింగ్ స్టోన్ దొరవారిని గురించికూడా కొంచెం చెప్పాలి ... దొరవారు గల్ గల్‌పూర్ సంస్థాన విషయాలు అజ మాయిషీ చేసేందుకు తెల్లప్రభుత్వం వారిచే నియమించబడ్డ అధికారి. ఒక పెద్ద బండరాయి దొర్లించినట్లుంటుంది, ఆయన నడుస్తూవుంటే ... అందుచేత 'రోలింగ్‌స్టోన్' అనే పేరు ఆయనకు తూచినట్లు సరిపోయింది అంటుండే వాళ్ళు గిట్టనివాళ్ళు, కిట్టినవాళ్ళు కూడాను. మాంచెస్టర్ నగరంలో ఒక టైలరుకు ఒక్కగానొక్క సంతానం ఆయన. స్కాలర్‌షిప్పుల మీద కాలేజీ చదువు పూర్తి చేసి, లాటిన్ భాషను బట్టీపట్టి, చరిత్ర పుస్తకాలతో కుస్తీపట్టి ఎలాగో ఒకలా పేరు చివర 'ఐ.సి.యస్.' అన్న మూడు అక్ష రాలు తగిలించుకున్నారు. దాదాపు యిరవై సంవత్సరాలు అక్కడా, యిక్కడా చెదతిరిగిన తరువాత ఆయన్ని గల్‌గల్‌పూర్ సంస్థానానికి రాజ ప్రతినిధిగా నియమించింది దొరల ప్రభుత్వం. పూటకు తికాణాలేని పేద కుటుంబంలో పుట్టడంవల్లనైతేనేమి, హిందూదేశంలోని రాజుల వైభోగాలను గురించి చరిత్ర పుస్తకాలలో చదువు కోవటం వల్లనైతేనేమి, రోలింగ్‌స్టోన్ దొరవారికి భారతదేశం అంటే కొంచెం అభిమానం. తన తక్కువతనాన్ని బహిరంగంగా ఒప్పుకోలేక "రాజ మర్యాదలన్నా యీదేశంలోసంప్రదాయా లన్నా నాకు మోజు" అని చెప్పుకు తిరుగు తుంటారు.

సరే! ఈ దొరవారు ఏదో రాచ కార్యంమీద రాజావారి దగ్గరకు విచ్చే శారు. తలవనితలంపుగా రాజుగారి చింత తీరిపోయింది. రాజప్రతినిధి పట్ల శ్రీవారికి గల గౌరవసూచకంగా గజశాలలో మిగిలిన ఒకే ఒక పట్టపు ఏనుగు 'లక్ష్మణస్వామి'ని బహుమతిగా యిచ్చేశారు. తెల్లదొరగారి సంతోషం పట్టశక్యంగాదు. అందులో పట్టాభిషేక మహోత్సవం జరిగేటప్పుడు రాజులు యీ ఏనుగుపైనే కూర్చుని ఊరేగుతా రని చెప్పినప్పుడు ఆయన ఎగిరి గంతులు వేశారు! అప్పుడే ఆ ఏనుగునెక్కి యింగ్లండులో తన స్వంత పల్లెటూళ్ళో షికారు వెళ్తున్నట్టు, పిల్లలంతా వెనక చేరి గోల చేస్తున్నట్లు "ఎక్కడి దీ ఏనుగు?" అని అందరూ అడుగుతూ వుంటే "ఆఁ! హిందూదేశంలో ఒక మహారాజు నాకు కానుకగా యిచ్చాడు" అని చెప్పేసుకుంటున్నట్లు ఊహించు కుంటున్నాడు.

ఎలాగయితేనేం బహుమతి ప్రధా నోత్సవం జరిగిపోయింది. ఉత్సవానికి నాలుగు, ఐదువందలదాకా ఖర్చయినా యిక ముందు యీ దుబారా వుండదు




కనుక రాజాసాహెబ్‌గారు విచారించ లేదు.

'లక్ష్మణస్వామి' రోలింగ్‌స్టోన్ దొరవారి బంగళా తోటలో మకాం పెట్టింది. దొరగారి సంతోషం నాలుగైదు రోజులదాకా తగ్గలేదు. ఐదో రోజున ఎందుకో లెక్క చూస్తే - యీ ఐదు రోజులకు ఏనుగు దాణాకి ఏభై రూపాయలు ఖర్చయింది. మావటీవాణ్ణి పిలిచి అడిగారు ఖర్చు తగ్గించకూడదా అని.

"రాజుగారి ఏనుగు రాజాతిండి కాక పోతే కనీసం వాసనైనా చూడదండీ!" అన్నాడు మావటీవాడు. కొత్త మోజు పూర్తిగా తీరక మునుపే దొరగారికి దిగులు పట్టుకుంది. ఈ లెక్కన అయితే ఆయన నెల జీతం ఒక్క ఏనుగు దాణాకే చాలదు. ఏం చెయ్యాలో తోచ లేదు. మహా ఘనత వహించిన వైస్రాయి దొరవారు కనికరించకపోరనే ఆశతో ఏనుగు బహుమతి చరిత్ర అంతా వ్రాసి దాని పోషణకోసం ప్రత్యేకం 'అలవెన్సు' యిప్పించవలసిందిగా అర్జీ దాఖలు చేశారు నాలుగు రోజుల్లో తిరిగివచ్చిన సమాధానం చూసి సర్ రోలింగ్‌స్టోన్ దొరవారు గుండెలు బాదుకున్నారు. 'వైస్రాయివారి అనుమతి లేకుండా ఒక సంస్థానంనుంచి బహుమతి రూపంలో ఏనుగును లంచంగా పుచ్చుకొన్నందుకు క్రమశిక్షణ చర్య ఎందుకు జరపకూడదు?' అని సంజాయిషీ అడిగారు. ఏనుగు కోసం 'అలవెన్సు' మాట ఎలావున్నా యీ సంజాయిషీ తప్పించుకునేసరికి దొరవారి తల ప్రాణం తోకకు వచ్చింది. అంతేకాదు ఏనుగుకోసం స్వంత ఖర్చులతో

'పొదుపు' తప్పనిసరి అయింది విస్కీలకు, సోడాలకు చెల్లించే స్తోమత లేక 'క్లబ్బు' సభ్యత్వానికి కూడా రాజీనామా యిచ్చారు.

ఇంతలో రోలింగ్‌స్టోన్ దొరవారి పదవీ విరమణ కాలం వచ్చింది. దీనితో తప్పుకోలేని సంకటావస్థ మరొకటి ఎదురైంది. 'లక్ష్మణస్వామి'ని తనతో పాటు యింగ్లాండు తీసుకు వెళ్ళటానికి ఎంత ఖర్చు అవుతుందో వివరాలు సేకరించి చూశారు. ఆ అంకె చూసేసరికి ఆయనకు స్పృహ తప్పింది. ఇన్నాళ్ళుగా కష్టపడి కూడబెట్టుకున్న ప్రావిడెంటుఫండు ఆ ఏనుగు రవాణా ఖర్చులకే సరిపోయేటట్లు లేదు. దర్జా మాట అలా వుంచి యీ డబ్బు లేకపోతే యింగ్లాండు వెళ్ళిన తర్వాత పూట గడవదు. ఈ పరిస్థితులకు తట్టుకోలేక తప్పనిసరై ఎలాగో ఒకలా 'లక్ష్మణస్వామి'ని వదిలించుకోవాలనే నిశ్చయానికి వచ్చారు దొరవారు. పది సంవత్సరాలుగా లక్ష్మణస్వామిని కనిపెట్టుకు వుంటున్న మావటీవాడు గంగారాం బహుమతికి అర్హుడనిపించింది. ఓ శుభ ముహూర్తాన అతన్ని పిలిచి తన నిర్ణయం తెలియచేశారు దొరవారు.

లేను కౌలుకు చేస్తున్న రైతుకు ఆ పొలం పట్టారాసి యిచ్చినంత సంతోషం కలిగింది గంగారాంకు. రాజలాంఛనాల ప్రకారం ఏడు సలాములు, ఒక సాష్టాంగ దండప్రణామం చేసి తన కృతజ్ఞత తెలుపుకున్నాడు. దొరవారు వెళ్ళిపోయారు. అడిగే దిక్కు లేరు గనుక ఆ బంగళాలోనే వుంటున్నాడు గంగారాం.

కాని 1947 ఆగష్టు 15వ తేదీన గంగారాం అదృష్టం వక్రించింది ... దొరల ప్రభుత్వంవారు ఎందుచేతనైనా గానీ, భారతదేశానికి స్వాతంత్ర్యం యిచ్చేశారు. తెల్లదొరల స్థానంలో నల్ల దొరల ప్రభుత్వం వచ్చింది. దీనితో అనుకోని మార్పులు ఎన్నో వచ్చాయి. కొత్త ప్రభుత్వం రాజప్రతినిధి రోలింగ్‌స్టోన్ దొర బంగళాను ఒక స్కూలుగా మార్చదలుచుకున్నారు. అందుచేత గంగారాం ఆ బంగళానుంచి వెళ్ళిపోక తప్పని పరిస్థితి వచ్చింది. తాలూకా ఆఫీసు దగ్గర కలం సిరాబుడ్డి పుచ్చుకు కూర్చునే బుడేదాదా దగ్గరకు వెళ్ళి రెండురూపాయలు ముట్టచెప్పి ఒక పిటీషను వ్రాయించాడు. అది పుచ్చుకొని కాళ్ళరిగేటట్లు గవర్నరుగారి దగ్గరనుంచి పంచాయితీ ప్రెసిడెంటు వరకు తిరిగినా కానీ ఫలితం లేకపోయింది. ఈ క్రొత్త ప్రభుత్వానికి దయ, జాలీ అనేవి ఏ కోశానా లేవనుకున్నాడు గంగారాం.

చేసేదిలేక, బంగళా ఖాళీచేసి, నమ్మినబంటు లక్ష్మణస్వామి మూపురం మీద కూర్చుని స్వంత గ్రామంవైపు




సాగిపోయాడు గంగారాం. అతని భార్య పేరమ్మ అసలే గయ్యాళి...ఈ ఏనుగును భరించటం కష్టం అని ముందే తెలుసుకుంది. అయినా ఒక నెలరోజులు ఎలాగో ఓపిక పట్టింది. ఈ ఏనుగు దాణాకోసం ఏనాడో నవాబువారు యీనాంగా యిచ్చిన రెండెకరాల సుక్షేత్రమైన మాగాణీ అమ్మవలసిన స్థితి వచ్చింది. పేరమ్మ యిక వూరుకోలేక మొగుణ్ణి తల వాచేటట్లు చివాట్లు పెట్టింది. గంగారాంకు కూడా ఏమీ తోచలేదు. తనబోటివాడు ముందూ వెనకా చూడకుండా యిటువంటి బహుమతిని తీసుకోవటం తప్పు...ఇప్పుడు దీన్ని వదిలించుకోవటం ఎలాగా అని ఆలోచిస్తూ గ్రామ మునసబు కోటయ్య దగ్గరకు వెళ్ళాడు సలహాకోసం.

"దిక్కులేని వాళ్ళందరికీ దేముడే దిక్కు. మనవూరి ఆలయంలో వేంచేసిన చెన్నకేశ్వర స్వామికి యీ ఏనుగు కానుకగా యిచ్చెయ్యి...కళ్యాణ మహోత్సవమైనా ఘనంగా సాగుతుంది" అన్నాడాయన ఇదే మంచిపని అనుకున్నాడు గంగారాం.

ఓ శుభముహూర్తాన తప్పెట్లు తాళాలతో లక్ష్మణస్వామిని దేవాలయం దగ్గరకు తీసుకువెళ్ళారు. ఒక్కముక్క కూడా ఎదుటివాడికి తెలియకుండా చదువుకుపోతున్న మంత్రాల మధ్య లక్ష్మణస్వామి దేవాలయంలోని చెన్నకేశ్వరస్వామికి అంకితమైపోయింది.

పూజారుల సంతోషం అంతా యింతా కాదు. "ఈ మాత్రమైనా దైవభక్తి, పాపభీతి వుండబట్టే ఈ భూమి యిలా నిలిచివుంది" అన్నారట పెద్ద పూజారి శివయ్యగారు ఎవరితోనో. ఆ రోజు లక్ష్మణస్వామి మూపురంపై పెద్ద అంబారీ కట్టి, అన్ని అలంకరణలు చేసి

స్వామివారి ఉత్సవ విగ్రహాన్ని ఊరేగించారు.

ఆ ఒక్క రోజు గడిచిన తర్వాత లక్ష్మణస్వామికి మళ్ళీ పని లేదు. హాయిగా దేవాలయంలో గడిచిపోతుంది.

కాలక్రమాన దేవాలయం పూజారులు కళ్ళు తెరిచారు స్వామివారి ఈనాముల మీద వచ్చే ఆదాయంతో ముప్పాతిక మూడు వంతులు ఏనుగు దాణాకే ఖర్చవుతోంది. ఈ స్వతంత్ర ప్రభుత్వం వచ్చిన తర్వాత ప్రజల్లో దైవభక్తి నశించింది కనుక ఏ రోజు కా రోజు వచ్చే కానుకలు కూడా తగ్గిపోతున్నాయి. ఏనుగును మేపి ఇంట్లో పెళ్ళాం పిల్లల్ని పస్తులు పడుకోబెట్టవలసిన పరిస్థితి వచ్చింది పూజార్లకు.

"దీన్నిలా మేపుతూ కూర్చుంటే మధ్య మనం మాడి చచ్చేట్లున్నాం. రేపటినుంచి ఈ ఏనుగుకు గడ్డిపరక కూడా పెట్టడానికి వీల్లేదు. దాన్నే మాడి చావనియ్యండి" అని అరిచా డొక కుర్ర పూజారి.

పెద్ద పూజారి శివయ్యగారి కిదేమీ నచ్చలేదు "అలా అనకూడదు నాయనా. ఏనుగంటే సాక్షాత్తు విఘ్నేశ్వరులవారి అంశ. దాని కడుపు మాడ్చితే మనకు తప్పకుండా అరిష్టం చుట్టుకుంటుంది. ఇంతకింటే నాకో ఉపాయం తోస్తోంది. దీన్ని మన ప్రజాప్రభుత్వానికి దానం చేసేద్దాం. నలుగురుకీ ప్రయోజనం వుండే పని చేస్తూ, నలుగురూ పెట్టిన తిండి తింటూ వుంటుంది అన్నారు."

ఈ సూచన అందరికీ నచ్చింది. ఆ మరుసటిరోజే లక్ష్మణస్వామిని జిల్లాపరిషత్తు ఆఫీసు దగ్గరికి తీసుకు వెళ్ళారు. ప్రజల తరపున పరిషత్ అధ్యక్షులు లక్ష్మణస్వామిని కానుకగా గ్రహించారు.

ఇప్పుడు 'లక్ష్మణస్వామి' నాగార్జున సాగర్ ప్రాజెక్ట్ దగ్గర వుంటోందిట. ప్రాజక్టువల్ల మునిగిపోయే ప్రాంతాలలోని ప్రజలకు ప్రక్కనేవున్న అడివి కొట్టి పునరావాస సౌకర్యాలు చేస్తున్నారు రోజుకు వందచెట్లకు పైగా అవలీలగా పీకి అవతల పారేస్తోందిట లక్ష్మణస్వామి.

ఈ మధ్య ఒకరోజు హైదరాబాదులో పి డబ్ల్యు డి ఆఫీసునుంచి బయటకు వస్తుంటే గంగారాం కనిపించాడు. కొడుకుని కాలేజీలో చేర్పించటానికి వచ్చాట్ట.

"ఎక్కడ వుంటున్నావయ్యా ?" అన్నాను.

"ఇప్పటికీ స్వామికి నేనేనండి మావటీని" అన్నాడు గంగారాం.

"అన్నట్లు స్వామి ఎలా వుంటోంది?" అన్నాను నేను కుతూహలం ఆపుకోలేక.

"ఏదోనండి. లచ్చనసామి ముకంలో యింత కళ ఎన్నడూలేదు" అన్నాడు గంగారాం.

అనువాదం: 'శారదాశర్మ'

---

# మాకు పెళ్ళయ్యింది

పాటిబండ్ల విజయలక్ష్మి



మంగళ వాయిద్యాలు మధురతరంగా మ్రోగుతున్నాయి.

అమాయకత్వం, అందం మేళవించి రూపు దిద్దుకున్న పదహారేళ్ళ పడుచు పిల్లలు చిరునవ్వులు చిలుకుతూ పందిట్లో హడావుడిగా తిరుగుతున్నారు. పరపరా శబ్దం చేస్తున్న పట్టుపావడాల వింత శబ్దంతో, కిలకిలా నవ్వులు విరజిల్లుతున్న కన్నెపడుచులతో, కన్నుల పండువుగా వుంది పెళ్ళిపందిరి.

అక్కడక్కడ పట్టుచీరెలూ, పట్టు పంచలూ కనిపిస్తున్నా ముఖ్యంగా పల్లవి పెళ్ళి పెద్దరికం చేస్తున్నది మాత్రం ఎక్కువభాగం యువతీ

యువకులే. వాళ్ళలో పరువాల కన్యలే ఎక్కువభాగం వున్నారు.

"భజంత్రీలు గట్టిగా వాయించం డయ్యా!" హెచ్చరించా డొక పెద్దమనిషి.

"పెళ్ళికుమార్తెను తీసుకురండి త్వరగా." కేక వేశాడు పురోహితుడు.

పురోహితుడు చెబుతున్న మంత్రాలు తిరిగి చెబుతున్నా, రాజశేఖర్ కళ్ళు పీటలమీదకు రాబోయే పుత్తడిబొమ్మ కోసం ఆరాటంగా ఎదురుచూస్తున్నాయి.

రాజశేఖర్ నిరీక్షణ ఫలించి సరసోక్తులు విసురుతున్న స్నేహితురాండ్ర మధ్య బందీ అయి, తల వంచుకొని ముసిగా నవ్వుతూ మెల్లిగా నడుస్తూ వచ్చి పీటమీద కూర్చుంది పల్లవి. ఒక్కసారి కళ్ళు పైకి ఎత్తి చూసి వెంటనే తల వంచేసుకుంది. సన్నటి పెదాలపై విరిసీ విరియని నవ్వు తళుక్కుమంది.

ఆ ఒక్క చూపుకే పరవశించి పోయాడు రాజశేఖర్

* * *

పల్లవి కళ్ళు, ఆ కళ్ళలో కదలాడే కొంటెతనం, చిలిపిదనం చూసే నేను పెళ్ళంటూ చేసుకుంటే ఈ అమ్మాయినే చేసుకుంటానని శపథం చేశాడు ఆ రోజు స్నేహితుల మధ్య.

ఓసారి తన స్నేహితుడు ప్రసాద్ పెళ్ళికి మిగతా మిత్రబృందంతో కలిసి ఆ వూరొచ్చాడు. స్నేహితులంతా పందిట్లో తిరుగుతున్న పల్లెపడుచులను చూసి ఏవేవో కామెంట్స్ విసురుతుంటే ఖంగారుపడుతూ వాళ్ళను వారించాడు ప్రసాద్. "ఒరే! క్షేమంగా మీరు హైద్రాబాద్ చేరాలంటే నోళ్ళు కాస్త కంట్రోల్‌లో పెట్టుకోవడం ఎందుకైనా మంచిది. పెద్దవాళ్ళెవరైనా విన్నారంటే వీపులు సాపుచేయగలరు జాగ్రత్త," అంటూ హెచ్చరించాడు.

ఇంతలో మెరుపుతీగలా అటు వచ్చిన పల్లవిని చూసి అందరి కళ్ళూ ఓ క్షణం రెప్పవేయడం మరచి పోయాయి బిగుసుకుపోయిన వాళ్ళ వైపు చూసి, ప్రసాద్‌ను చూసి చిన్నగా నవ్వుతూ,

"కాఫీలు పంపించమంటావా అన్నయ్యా!" అంది పల్లవి

"అవునమ్మా. వూరికే కూర్చుంటే విసుగ్గా వుందట. మర్చిపోయాను, వీళ్ళకు కాఫీకంటే టీ యిష్టం. నా గదిలో లమ్‌సా టీ వుంటుంది. అది కలిపి తెస్తే మరీ మంచిది. టీ మట్టుకు ఎన్నిసార్లు యిచ్చినా వద్దనరు వీళ్ళు," అన్నాడు ప్రసాద్ చిన్నగా నవ్వుతూ, వాళ్ళ కామెంట్స్ పల్లవి ఏమైనా విందేమోనని నర్వస్‌గా ఫీలవుతూ.

"అయితే అన్నయ్యా! టీతో పాటు ఓ అరడజను నిమ్మకాయలు కూడా పంపిస్తాను," అంది పల్లవి

క్రింది పెదవి పై పంటితో నొక్కిపడ్తూ ఓరగా రాజశేఖర్ బృందాన్ని చూస్తూ.

"నిమ్మకాయలా ? అవెందుకూ" అంటున్న రాజశేఖర్ వైపు చూసి కొంటెగా నవ్వి, మళ్ళీ ప్రసాద్ వైపు తిరిగి,

"పైత్యం తగ్గటానికి" అని తక్కున సమాధానం చెప్పి తుర్రుమంది లోపలికి.

నవ్వులతో ప్రతిధ్వనించిందా ప్రదేశం.

ముగ్ధమోహనంగా, అమాయకంగా కనిపించిన పల్లవి చిలిపి సమాధానం విన్న రాజశేఖర్ పల్లవి వెళ్ళినవైపే చూస్తూ.

"అరేయ్ ప్రసాద్ ! ఈ గడుసు పడుచు నీ చెల్లెలని అర్థమైంది. అందరి తరపునా వకాల్తా పుచ్చుకొని మా పైత్యం వదిలించడానికి వచ్చిన నీ చెల్లెల్ని చూడగానే నా కేమనిపించిందో ఫ్రాంక్‌గా చెబుతున్నాను. ఏమీ అనుకోకు. నేను పెళ్ళంటూ చేసుకుంటే యీ అమ్మాయినే చేసుకుంటాను," అని తన నిర్ణయం స్నేహితులందరి సమక్షంలో ప్రసాద్‌కు చెప్పేశాడు.

"ఒరే రాజూ ! నీ నిర్ణయం నాకు సంతోషకరమైందే కానీ మా శంకరయ్య బాబాయి దగ్గర ఆస్థిపాస్థులేమీ లేవు. నువ్వు పెళ్ళిచేసుకుంటే...కట్నంగా మా పల్లవిని తప్ప మరేమి యివ్వలేదు. మరి మీ నాన్నగారు నీకు లక్ష రూపాయలు రేటు కట్టారని విన్నాను," అంటున్న ప్రసాద్‌ను మధ్యలోనే ఆపి.

"ఒరేయ్ ప్రసాద్ ! నేను చేసింది 'రాజశేఖర శపథం' అంటే చాణక్య శపథానికి ఏమీ తీసిపోదు. పెళ్ళి చేసుకునేది నేను. నా యిష్టానికి వ్యతిరేకంగా యింతవరకూ ఏదీ మా యింట్లో జరగ లేదు. ఇంక ఆస్థిపాస్థుల మాటకొస్తే మేం తినగా పది కుటుంబాలను అవలీలగా పోషించగలం. కట్నం మాట కట్టిపెట్టి మీ బాబాయితో సంప్రదించి, ఒప్పించి నాకు లెటర్ వ్రాయవలసిన బాధ్యత నీది నాన్నగారినీ, అమ్మగారినీ తీసుకొని మరోసారి లాంఛనప్రాయంగా పెళ్ళిచూపుల కొస్తాను," అన్నాడు ప్రసాద్ వీపున చరుస్తూ.

"అంత హడావుడేమిటిరా ! వెనకా ముందూ ఆలోచనలేకుండా" అంటున్న ప్రసాద్ వైపు సీరియస్‌గా చూస్తూ,

"ముందు నీకే యిష్టంలేనట్లుందేంరా" అన్నాడు రాజశేఖర్.

"ఛ! ఛ! అదికాదురా ఫూల్ ! అన్నింటికీ తొందరెక్కువే. నువ్వు కోరి చేసుకుంటానంటున్నావంటే నిజంగా మా పల్లవి అదృష్టవంతురాలు పెద్దగా చదువు సంధ్యలులేని పల్లవి, పల్లెటూరిలో పుట్టి పెరిగిన పల్లవితో నువ్వు ఎడ్జెస్టు కాగలవా అని ఆలోచించానంతే" అంటూ నవ్వేశాడు ప్రసాద్.

"ఏమో ! నా అలవాట్లను ఆసరాగా

తీసుకొని నువ్వు సందేహిస్తున్నావేమో ననే ధర్మసందేహం వచ్చింది నాకు. ఏదో ఈ మధ్య పార్టీలలో కొద్దిగా డ్రింకుతీసుకుంటున్నానని నీతో చెప్పాను గదాని, నన్నొక డ్రంకర్డ్‌గా జమ కట్టేసి భయపడ్డావేమోనని అనుమానం. మా ఫరమ్‌కు అనేకమంది ఫారినర్స్ వస్తుంటారు. వాళ్ళకు మర్యాదగా అప్పుడప్పుడూ వెట్ పార్టీ ఇస్తుండటం జరుగుతుంది. ఫర్ కంపెనీ సేక్, వాళ్ళతో తప్పనిసరయితే, ఎప్పుడైనా తీసుకుంటానని నీతో అన్నమాట యిలా మీ చెల్లెల్నివ్వడానికి అడ్డమొస్తుందేమో నని తెలిస్తే, అసలు అని వుండేవాడిని కాదు," అన్నాడు చిన్నగా నవ్వుతూ రాజశేఖర్.

వాళ్ళలా నవ్వుతూ వుండగానే టీ పట్టుకొచ్చింది పల్లవి సిన్సియర్‌గా.

"ఏవండీ మరి నిమ్మకాయ లేదీ" అన్నాడు రాజశేఖర్ చిన్నగా నవ్వుతూ.

"టీలోకి నిమ్మకాయ లెందుకురా అబ్బాయ్" అంది అప్పుడే అటుగా వచ్చిన హనుమాయమ్మ.

అపరిచితురాలైన ఆవిడ సంబో ధనతో షాక్ తిన్న రాజశేఖర్ ఒక్క మండి,

"పైత్యం తగ్గటానికి అమ్మమ్మ గారూ!" అన్నాడు.

ఆ మాటతో హనుమాయమ్మకూ తల తిరిగింది.

"నీకు నేను అమ్మమ్మలా కన్పిస్తు న్నానట్రా! నిజంగానే వీడికి నిమ్మ కాయలు అవసరమే పల్లవీ" అంటూ వెనుదిరిగింది.

కిసుక్కున నవ్వింది పల్లవి.

కోపంగా చూశాడు హనుమాయమ్మ వైపు రాజశేఖర్. అప్పటికే వెనుదిరిగిన హనుమాయమ్మ అతని చూపులు గమనించలేదు. మా సేవాళ్ళందరికీ ఆ పరిస్థితి నవ్వుతెప్పిస్తున్నా ఆపుకుంటు న్నారు బలవంతంగా.

ఇంతలో ఎదురుగా కనిపించిన సుందరయ్యను చూసి నవ్వుతూ "ఏవిటి బావా అంత హడావుడి. కొడుకు పెళ్ళికే ఇంత హడావుడైతే మరి కూతురి పెళ్ళికెంత హడావుడి పడాలో. కాస్త ఆ పరుగులు తగ్గించు. పడిపొయ్యావంటే లేవదియ్యలేక నేను చావాలి" అంటూ నవ్వుకుంటూ ముందుకు అడుగువేసిన హనుమాయమ్మ ఎదురుగా వస్తున్న కిష్టయ్యగారిని ఢీ కొట్టింది.

"ఛీ! ఛీ! బుద్ధిలేదూ! కాస్త చూసుకొని రాలేవూ" అన్నారు కిష్టయ్యగారు కోపంగా.

"అదేవిటి మావా! నాకు బుద్ధిలేదు సరే మరి. నీ బుద్ధెక్కడికి పోయింది? మీ గూట్లో పెట్టొచ్చావా? నీ చూపు మీ రత్తి దగ్గర వదిలొచ్చావా" అంటూ పకపకా నవ్వుతుంటే,



భయంగా చుట్టూ చూస్తూ, కోపంగా హనుమాయమ్మను చూసి "నీ దుంప తెగ. నిన్ను మాట్లాడించడం పాపమే. అయినా యిక్కడేం చేస్తున్నావు ? అలా గాడిపొయ్యిదగ్గర తగలడక" అంటూ విసుక్కుంటున్న కిష్టయ్యగారిని యింకొంచెం ఏడిపిస్తూ,

"గాడిపొయ్యిలో తగలెయ్యడానికి కట్టెలు చాలడంలేదని చెబుదామనే నేను వచ్చాను ఆ దరిద్రులు పొయ్యిదగ్గర వున్న పుల్లలన్నీ తీసుకెళ్ళి పొగాకు బేరన్ పొయ్యిలో వేసుకుంటున్నారు కొట్లో వేరే వున్నయి తెచ్చుకోండిరా అంటే నా మాట వినడంలేదు. నాదేం పోయింది. వచ్చి చెబితే చెప్ప. లేకపోతే ఆ వండేదో మీరే తంటాలు పడండి. చేతినిండా పుల్లలు లేకపోతే నేను చెయ్యలే నా గాడిపొయ్యి దగ్గర వంటలన్నీ. అక్కయ్యతో చెప్పి రత్తిని పిలిపించుకో." అంటూ వెనక్కుతిరిగిన హనుమాయమ్మ చెయ్యిపట్టుకొని,

"మా తల్లిగా, నువ్వు ముందు పొయ్యి దగ్గరకు పదవే నేనొచ్చి చెబుతాను వాళ్ళతో. మా ఖర్మకాలి పెళ్ళి యిక్కడే ఏర్పాటు చేస్తామని చెప్పాము పెళ్ళివారితో. పద తప్పుతుందా!" అంటూ ముందుకు నడుస్తున్న కిష్టయ్యగారిని చూస్తూ ముసిముసిగా నవ్వుతూ ఠీవిగా లోపలి కెళ్ళింది హనుమాయమ్మ.

సినిమా రీలులా అప్పటి వరకూ జరుగుతున్న ఆ సీన్ చూసి నవ్వు నాపుకోలేక ప్రసాద్ సైగతో నోళ్ళు బిగపెట్టి వుంచిన వాళ్ళంతా ఒక్కసారే పగలబడి నవ్వారు. వాళ్ళతోపాటే వినోదం చూస్తూ నుంచున్న పల్లవి కూడా నవ్వింది.

"ఇంతకీ ఎవర్రా ఆవిడ ?" అంటూ ప్రశ్నించాడు రాజశేఖర్.

"మీ అమ్మమ్మగారు" అంటూ నవ్వుతూ పరుగెత్తింది పల్లవి.

పకపకా నవ్వుతూ పరుగెడుతున్న పల్లవిని చూస్తూ చిన్నగా నవ్వి, మళ్ళీ సమాధానంకోసం ప్రసాద్ వైపు చూశాడు రాజశేఖర్. అందరూ ఆసక్తిగా వినడానికి ముందుకు జరిగారు.

"ఎవరంటే ఏం చెప్పనురా! ఈ వూరంతటికీ కావల్సిన మనిషి. మకుటం లేని మహారాణి. అలా అని ఆవిడ రాజభోగాలు అనుభవించడంలేదు నాకు వూహ తెలిసినప్పటినుంచీ ఆమెను చూస్తున్నాను. ఆవిడ కెవ్వరూ లేరు. అయినా అందరూ తనవాళ్ళే అనుకుం టుంది. ఎవరింట్లో ఏ శుభకార్యం జరిగినా ఆవిడ లేకుండా జరగదు. అందరికీ ఆవిడ కావాలి. అందరూ ఆవిడకు కావాలి. అందరినీ ఏదో వరసతో తప్ప పిలవదు. సరదాగా అందరితో సరసాలాడుతూ తను నవ్వుతూ అందర్నీ నవ్విస్తూ కాలం గడుపుతుంది. ఎంత వంటైనా నిముషాల మీద రుచిగా చేసిపెట్టగలదు. ఎవ రే పని చెప్పినా కాదనదు.

అందుకే అందరికీ ఆమె అవసరం వుంటుంది. పైసా డబ్బు ఆశించే మనిషి కాదు ఎవరిదగ్గరా. ఆప్యాయంగా ఎవ రేదడిగినా చేసిపెడుతుంది. ఎవరైనా విసుక్కుంటే వెళ్ళిపోతానని బెదిరిస్తుంది. ఇంక వాళ్ళు చచ్చినట్లు బ్రతిమాలి ఆపక తప్పదు. ఆవిడలోవున్న గొప్పతనం ఏమిటంటే, ఎంతకోపం వచ్చినా ఒక్క క్షణమే వెంటనే కరిగిపోతుంది బ్రతి మాలితే. తనకంటే బాగా చిన్న వయసులో వున్నవాళ్ళను పెద్దవాళ్ళుగా మన్నించదు. ఆప్యాయంగా పలక రిస్తుంది. తనకు ఈడూజోడూగా వున్న మగవాళ్ళను బావలు, మావలుగా పిలుస్తూ వాళ్ళతో సరసాలాడుతూ ఓ రకమైన ఆనందాన్ని అనుభవిస్తుంది.

అది చూసేవాళ్ళకూ వినోదంగా వుండటంతో అందరూ హనుమాయమ్మ అంటే యిష్టపడతారు. ఆడవాళ్ళతో కూడా అలాగే చనువుగా ప్రవర్తి స్తుండటంవల్ల ఆవిడ నెవరూ అపార్థం చేసుకోరు. అంతా యిష్టంగా వుంటారు."

"ఆమెతో మాట్లాడినాయన ఎవర్రా ?" కిషోర్ ధర్మ సందేహం.

"ఆయన మా పెదనాన్న కిష్టయ్య గారు." ప్రసాద్ సమాధానం.

"మరి రత్తి ? అ దే కిష్టయ్యగారి రత్తి?" కృష్ణ చిలిపి ప్రశ్న.

"ష్! అది రహస్యం. మా పెద్దమ్మ విన్నదంటే నా వీపు సాపుచేస్తుంది," అంటూ నవ్వుతున్న ప్రసాద్‌ను చూసి,

"హనుమాయమ్మ ది గ్రేట్. వాట్ ఎ వండర్‌ఫుల్ క్యారెక్టర్ ?" అంటూ విచిత్రంగా చూస్తున్న ఫ్రెండ్స్‌వైపు చూసి నవ్వుతూ,

"ఒరేయ్ ప్రసాద్ ! నన్ను 'రా' అందని కోపం వచ్చి పాపం నే నామెను 'అమ్మమ్మా' అన్నాన్రా, పాపం ఆవిడ బాధపడినట్లున్నారు" అన్నాడు రాజశేఖర్.

"అబ్బబ్బే! అదేం లేదురా ! కోపం వచ్చినా ఒక్క నిముషమే అని చెప్పానుగా. మళ్ళీ మంచి చేసుకోవాలనుంటే నెమ్మదిగా వెనక గాడిపొయ్యి దగ్గర కెళ్ళి 'పిన్నీ భలే ఆకలిగా వుంది, నాకేమైనా పెట్టవా తినడానికి' అని అడుగు.

'అలాగా నాయనా ! ఇక్కడే వుండరా. యిప్పుడే వస్తాను,' అని గదిలోకెళ్ళి ఓ అరడజను లడ్డూలూ, బూందీ తన కొంగులో పట్టుకొచ్చి మరీ నీ కిస్తుంది. కావాలంటే ట్రై చెయ్యి" అన్నాడు ప్రసాద్.

ప్రసాద్ ద్విపాత్రాభినయం చేస్తూ, అభినయిస్తూ ఆ మాటలు చెబుతున్న తీరుచూసి, ఫ్రెండ్సందరికీ నవ్వాగ లేదు.

అలా ప్రసాద్ పెళ్ళికి చేబ్రోలులో నున్న నాలుగురోజులూ సరదాగా సంతోషంగా గడిచిపోయాయి.

ప్రసాద్‌ను పల్లవి తండ్రి శంకరయ్యగారితో మాట్లాడి వెంటనే లెటర్ వ్రాయమని చెప్పి ఫ్రెండ్సంతా వెళ్ళిన రెండోరోజు తప్పనిసరిగా హైద్రాబాద్ బయలుదేరాడు రాజశేఖర్. ఆ నాలుగు రోజుల్లో పల్లవి తటస్థపడ్డ సందర్భాలు చాలా వున్నాయి. అయినా కనిపించడం వరకే పరిమితమైంది. మిలమిలా మెరిసే ఆ కళ్ళలోకి అలా కొంతసేపైనా చూడాలని అతని హృదయం తహతహలాడుతున్నా అలా చూ డ గ లి గే అవకాశం మళ్ళీ బయలుదేరేవరకు రాలేదు.

అతని అవస్థ గమనించిన ప్రసాద్ ఆరోజు పల్లవిని పిలిచి దగ్గిర కూర్చోబెట్టుకొని మాటల్లో పెట్టాడు.

వాళ్ళిద్దరూ మాట్లాడుతున్నంతసేపూ రెప్పవాల్చకుండా పల్లవినే చూశాడు రాజశేఖర్.

మధ్య మధ్య అతనివైపు చూసిన పల్లవి గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. "అబ్బ! అలా చూస్తాడేం తినేసేలా" అనుకున్నా ఆ చూపుల్లో కనిపించే వింత ఆకర్షణకు లొంగిపోయి, చూడకుండా వుండలేకపోయింది పల్లవి.

"అన్నట్లు పల్లవీ! స్కూల్ ఫైనల్‌తో ఆపేశావేమే. గుంటూరు దగ్గరేకదా,

కాలేజీలో చేరివుండాల్సింది" అంటున్న ప్రసాద్‌తో,

"అన్నయ్యా! అన్నీ తెలిసి నువ్విలా అడుగుతావేం. నాన్న ఆరోగ్యం ఈ మధ్య ఏంబావుండటంలేదాయె. ఒక్కరూ వుంటే తన సంగతి తను ఏమీ పట్టించుకోరు. భోజనం చేయమని నేను గుర్తు చేస్తేతప్ప గుర్తు రాదాయనకు," అంటున్న పల్లవివైపు ఆసక్తిగాచూస్తూ-

"మీ అమ్మగారు"...... అంటూ అర్థోక్తిలో ఆగిపోయిన రాజశేఖర్‌వైపు చూసిన పల్లవి కళ్ళు నిండుగా నీళ్ళు నింపుకొని దీనంగా చూశాయి.

"ఓ! ఆయామ్ సారీ! క్షమించండి" అంటూ నొచ్చుకున్నాడు రాజశేఖర్.

"ఇంక నే వెళ్ళొస్తా నన్నయ్యా!" అంటూ లేచిన పల్లవివైపు చూస్తూ "ఈరోజు నే వెళ్ళిపోతున్నాను పల్లవీ!" అన్నాడు రాజశేఖర్.

ఓ క్షణం అతని ముఖంలోకి చూసిన పల్లవి కళ్ళు వర్ణించ వీలుకాని వింత అనుభూతితో మెరిశాయి. మొట్టమొదటి సారిగా రాజశేఖర్ నోట తనపేరు యెంతో బావున్నట్లనిపించింది.

"మంచిది వెళ్ళిరండి" అంటూ ముందుకు వెళ్ళిన పల్లవి ఏమనుకుందో వెంటనే వెనక్కు తిరిగి-

"అన్నయ్యా! ఇన్ని రోజుల్నుంచీ చూస్తున్నా వారెవరో నాకు పరిచయం చేయలేదు" అంది చిన్నగా నవ్వుతూ ప్రసాద్‌వైపు చూస్తూ.

"అరే! నిజమే! నా కా ఆలోచనే రాలేదు సుమా! మీ యిద్దరూ ఒకళ్ళకొకళ్ళు ముందే తెలుసన్నట్లు అనుకున్నాను," అని నవ్వుతూ వీడు నా కాలేజీ ఫ్రెండ్సందరిలోకి డియరెస్ట్ అండ్ నియరెస్ట్ ఫ్రెండ్ రాజశేఖర్, ది గ్రేట్. మేమంతా వీడిని ముద్దుగా 'రాజా' అని పిలుస్తాం. ప్రస్తుతం చదువు మానేసి బిజినెస్ చూసుకుంటున్నాడు." అని అతనివైపు తిరిగి -

"ఇంక యిది మా అల్లరి అనుంగు చెల్లెలు పల్లవి. మా నాలుగు కుటుంబాలకూ కలిపి ఒక్కతే చెల్లెలు. మా కుటుంబాలకున్న ఏకైక ఆడపడుచు. మా బాబాయి శంకరయ్యగారి ఏకైక పుత్రిక," అంటూ పల్లవి నెత్తిన మొట్టి, అంతలోనే తల నవరిస్తున్న ప్రసాద్‌వైపు నవ్వుతూ చూసి,

'ఊ! ఆపావేం దండకం. పరిచయం చేయాలనే ప్రాథమిక మర్యాదనే మరచిపోయిన శ్రీ శ్రీ ప్రసాద్‌గారి గారాల చెల్లెలు" అంటున్న పల్లవి చెవి మెలేస్తూ నవ్వుతున్న ప్రసాద్ నవ్వుతో శృతి కలుపుతూ,

"మీ వదినవైపు చూస్తూ మనల్ని మరిచిపోయుంటారు. పోనీ ఈసారికి క్షమించేద్దాం లెండి" అంటున్న




రాజశేఖర్ మాటలకు సిగ్గుగా తల వంచుకుంటున్న ప్రసాద్‌ను చూసి పల్లవీ, రాజశేఖర్ ఒకేసారి నవ్వేశారు.

చిరుకోపంగా చూసిన ప్రసాద్ "ఒరే రాజూ! మీరిద్దరూ ఒకటయ్యారా నవ్వడానికి ? సరే కానీండి ఏంచేద్దాం ఎంతైనా..." అంటూ నవ్వుని ఆపుకొనే ప్రయత్నంచేసి విఫలుడై తనూ నవ్వేశాడు.

బస్సుకు టైమవుతోందని లేచి బస్ స్టాండ్ వైపు అడుగులేస్తూ "బై, పల్లవీ. మళ్ళీ కలుసుకుందాం త్వరలో" అంటూ నవ్వుతూ చెయ్యి వూపి ముందుకు నడిచాడు రాజశేఖర్.

అప్రయత్నంగానే నవ్వుతూ చెయ్యి వూపి, "మళ్ళీ త్వరలో కలుసుకుందాం" అన్న రాజశేఖర్ మాటలను మననం చేసుకుంటూ తమ యింటివైపు వెళ్ళిపోయింది పల్లవి.

ఆ తర్వాత వారం పదిరోజులకే ప్రసాద్ లెటర్ అందుకున్న రాజశేఖర్ ఆనందంగా గంతులేసినంతపనిచేసి, నెమ్మదిగా నాన్నగారి దగ్గరచేరి, విషయం వివరించాడు. వినగానే మొదట ఆయన పెట్టిన నాలుగు చివాట్లూ తిని, చివరకు తల్లితో మాట్లాడకుండా, రెండురోజులు నిరహారదీక్ష పూని, వాళ్ళిద్దరినీ ఆ సంబంధానికి సుముఖులుగా చేసుకున్నాడు రాజశేఖర్.

ఓ శుభముహూర్తాన బయలుదేరి వస్తున్నట్లుగా ప్రసాద్‌కు లెటర్ వ్రాశాడు.

పెళ్ళిచూపులకు వచ్చిన రాజశేఖర్ తలిదండ్రులకు పల్లవి ఎంతగా నచ్చిందో

ఆ పరిస్థితులూ పరిసరాలూ అంతగా నచ్చలేదు. అయినా కొడుకు పట్టుదల తెలిసినవాళ్ళవడంవల్ల పైసా కట్నం లేకుండానే పల్లవిని తమ కోడలుగా చేసుకోడానికి అంగీకరించారు. అయితే పెళ్ళి ఏర్పాట్లు మాత్రం గ్రాండ్‌గా వుండాలని ప్రసాద్‌తో చెప్పారు. మాకున్నంతలో వున్న ఒక్క చెల్లెలికి ఏమీ లోటుచేయమని ప్రసాద్ హామీ యిచ్చాడు.

పెళ్ళికి లగ్నాలు పెట్టుకున్న దగ్గర నుంచీ రాజశేఖర్ మనసు మనసులో లేదు. అనుక్షణం పల్లవి కళ్ళముందే కదలాడుతున్నట్లనుభూతి చెందేవాడు. పల్లవితో పంచుకోబోయే తన జీవితాన్ని గురించి రంగురంగుల కలలు కంటూ ఓ రకమైన వున్మాదావస్థలో వుండే వాడు. తిండీ నిద్రా లెక్కచేయకుండా తీయటి స్వప్నాల్లో తేలిపోతూ వూహల నందనవనంలో విహరించేవాడు.

పెళ్ళిరోజు ప్రొద్దుట తలనొప్పి విపరీతంగా వచ్చింది. అయినా ఎవరితోనూ చెప్పలేదు. ఊహా ప్రపంచంలో మునిగిపోతూ తలనొప్పిని లెక్కచేయాలనిపించలేదు. ఆ శుభ ఘడియ లెప్పుడొస్తాయా, పల్లవిని ఎప్పుడు చూస్తానా, అన్న ఆలోచనలతోనే సాయంత్రమైపోయింది

కమ్మని ఊ హ ల తో మనస్సు మనస్సులో లేదు. ఏదో ఆత్రత ఆరాటం ఓ రకమైన ఉద్వేగం, హృదయం నిండుగా మూడు నెలల క్రితం చూసి వెళ్ళిన పల్లవి రూపం అనుక్షణం కళ్ళముందు కదలాడుతోంది. సిగ్గుగా పలచటి చిరునవ్వుతో నెమ్మదిగా వచ్చి తమ ఎదురుగా కూర్చుంటున్న పల్లవి మూర్తీభవించిన అజంతా శిల్పంలా కనిపించింది. అప్పుడూ అలాగే తను చూపుల్ని తిప్పేసుకోలేకపోయాడు తన చూపుల్ని గమనించి తల్లి ప్రసాద్‌తో చెప్పింది, 'యింక అమ్మాయిని లోపలికి తీసుకెళ్ళండి బాబూ!' అని. అప్పుడు తల్లిమీద మొట్టమొదటిసారిగా కోపం వచ్చింది. తన చూపులు తల్లికళ్ళతో కలిసేసరికి ఆప్యాయంగా నవ్వుతున్న ఆ కళ్ళను చూసి సిగ్గుగా కళ్ళు దించేశాడు. తనకు ఎదురుగా తండ్రీ తల్లీ మిగతా పెద్దలంతా వున్నారనే స్పృహే లేకుండాపోయింది.

అలా తనని సమ్మోహితుడిని చేసి దాసుడిగా చేసుకున్న పల్లవి, మరో కొన్ని నిముషాల్లో తన బెటర్ హాఫ్ కాబోతున్న పల్లవిని గురించి ఆలోచనల్లో మునిగి ముసిగా తనలో తానే నవ్వుకుంటున్న రాజశేఖర్ ప్రసాద్ ఏర్పాటు చేసిన జీపులో విడిదింటి నుంచి పెళ్ళి వారింటికి చేరి, స్వాగతం పలుకుతున్న ప్రసాద్ వెంట మండపంవైపు వెళ్ళాడు.

* * *

అందరూ తమనే గమనిస్తున్నారనే

ధ్యాసైనా లేకుండా అలాగే రెప్పవాల్చకుండా పల్లవినే చూస్తున్నాడు రాజశేఖర్.

పల్లవి అదృష్టానికి పొంగిపోతూ అంత మంచి సంబంధం కుదిర్చినందుకు ప్రసాద్‌ను వూపిరాడకుండా పొగడేస్తున్నారు ఆ వూరి పెద్దలు.

తాము పుస్తకాల్లో చదివే హీరోలా చక్కటి పర్సనాలిటీతో 'హీమాన్' ధర్మేంద్రలా కనిపిస్తున్న రాజశేఖర్‌ను ఆసక్తిగా ఆనందంగా చూస్తూ తమ భవిష్యత్ గురించి తమకు రాబోయే వరుడు కూడా అలా వుంటే ఎంత బావుంటుంది ? అని ఓ క్షణం ఆలోచించి అంతలో ఆ ఆలోచనలతో గులాబీల్లా ఎరుపెక్కిన చెక్కిళ్ళను అరచేత రాసుకొంటూ సిగ్గుగా తమలో తామే నవ్వుకుంటూ ఆ కళ్యాణ వైభవాన్ని చూస్తున్నారు ఇంకా పెళ్ళికాని పల్లవి స్నేహితులు.

పరిసరాల్ని మరచి, ఏదో తన్మయావస్థలో వున్న రాజశేఖర్ మధ్య మధ్య పురోహితుడి హెచ్చరింపుతో యీ లోకంలోకి వస్తూ అతను చెప్పినట్లు చేస్తున్నాడు.

మాంగల్యం తీసి చేతుల కిచ్చాడు పురోహితుడు. ప్రసాద్ భార్య అరుణ ముందుకు వచ్చి పల్లవి జడ పైకి ఎత్తి పట్టుకుంది. చిరునవ్వుతో ఓ అడుగు ముందుకు వేసి పల్లవివైపు చూస్తూ మాంగల్యం ముడివేయడానికి ప్రయత్నించిన రాజశేఖర్ వేళ్ళు వణికాయి. మంగళసూత్రం జారి పల్లవి ఒడిలో పడిపోయింది. ఖంగారుగా తలెత్తింది పల్లవి.

అందరికీ అదేదో అశుభంగా తోచింది. అరుణ ముందుకు వంగి మాంగల్యం తీసి వరుని చేతికిచ్చింది. మంత్రాలు ఆపేసిన పురోహితుడు,

"కాస్త గట్టిగా పట్టుకో బాబూ!" అన్నాడు.

"ఒరే రాజూ ! ముడులు గట్టిగా వేయరా. అమ్మాయిని తర్వాత చూద్దువు గాని. అదేదో కట్టేస్తే ఆ తర్వాత నీ యిష్టం ఎంతసేపు చూసుకున్నా మా కభ్యంతరం లేదు" అని అరిచాడొక ఫ్రెండ్. ఆ మాటతో అంతా నవ్వేశారు. మళ్ళీ వాతావరణం తేలిగ్గా మారిపోయింది. మాంగల్యాన్ని గట్టిగా పట్టుకొని ముడివేయబోయిన రాజశేఖర్ చేతులు మళ్ళీ వణికాయి. ముడివేయాలని ప్రయత్నించి వేయలేకపోతున్నాడు. అంతా విచిత్రంగా భయంగా చూశారు.

ఎంతసేపటికీ ఒక్కముడీ వెయ్యలేకపోతున్న అతని వేళ్ళ కదలిక చూసి అరుణకు అనుమాన మొచ్చి భయంగా ప్రసాద్‌వైపు చూసింది. ప్రసాద్ కూడా ఆశ్చర్యంగా అతనివైపే చూస్తున్నాడు.

ఇంతలో రాజశేఖర్ తల్లి కూడా ప్రసాద్‌దగ్గరగా వచ్చి "వాడికి వంట్లో బావున్నట్లు లేదు" అని ఆందోళనగా అంటుండగానే, అప్పటికే ముఖమంతా చిరుచెమటలు పట్టిన రాజశేఖర్ మరోసారి ముడి వేయాలని, విశ్వ ప్రయత్నంచేసి విఫలుడై మాంగల్యంతో పాటు తనూ క్రిందకు జారి, పల్లవి మీదకు ఒరిగిపోయాడు. కాస్సేపట్లో పందిరంతా గందరగోళంగా మారి పోయింది. ఎవరిష్టమొచ్చినట్లు వాళ్ళు వ్యాఖ్యానిస్తున్నారు.

"తల్లిలేని పిల్లకు ఇంత అన్యాయం చేస్తారా ?"

"ఆస్తి వుందికదాని "రోగిష్టివాడి కంటగడతారా ?" ఇలా రకరకాల మాటలతో ఎవరికితోచినట్లు వాళ్ళు కామెంట్స్ చేస్తున్నారు.

అప్పటివాకా నువ్వు యింద్రుడివి, చంద్రుడివి అని మెచ్చుకున్న ప్రెసిడెంట్‌గారు,

"అదేమిటోయ్ ప్రసాద్! నీ ఫ్రెండ్ అని చెప్పావు. ఆతనికి జబ్బున్నట్లు నీకు తెలీకుండా ఎలా వుంది ? పాపం ! పల్లవికి ఎంతో గొప్ప సంబంధం తెచ్చావని మీ బాబాయి నేలమీద నిలవ లేదు. ఇదేనా నువ్వు తెచ్చిన మంచి సంబంధం ?" అంటున్న ఆయనకు సమాధానం చెప్పకుండా ముందుకు అడుగేసిన ప్రసాద్ కళ్ళనిండా నీళ్ళతో తనమీదకు వొరిగిపోయిన రాజశేఖర్‌ని రెండుచేతులతో పైకి లేపిన పల్లవివైపు చూశాడు ఆర్ద్రంగా. రాజుని మోకాళ్ళ మీద ఒంగి కూర్చున్న ప్రసాద్ చేతుల్లోకి వాల్చి రెండుచేతులతో ముఖం కప్పేసుకుంది పల్లవి. ప్రసాద్ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"ఆపెయ్యండి పెళ్ళి! మా అదృష్టంబాగుండి ఆ జబ్బేదో యిక్కడే బయటపడింది. సూత్రధారణ జరిగిన తర్వాతైతే యింకెంత బాధపడాల్సి వచ్చేదో" అంటూ విసురుగా ముందు కొచ్చిన శంకరయ్యగారు పల్లవి చెయ్యి పట్టుకొని వణుకుతున్న గొంతుతో "లేమ్మా! యింకా యిక్కడెందుకు ?" అంటుంటే ఆదురుతున్న పెదాల్ని నొక్కిపట్టి వుంచి,

"ఎక్కడకు రాను నాన్నా ? మాకు పెళ్ళైంది. నాతలపై ఆయన జీలకర్రా, బెల్లం వుంచినప్పుడే నేను ఆయన భార్యనయ్యాను. మా కింకా పెళ్ళి కాలేదనే భ్రమలో వున్నారా ? మంగళ సూత్రం కట్టనంత మాత్రాన మాకు పెళ్ళికానట్లవుతుందా ? పవిత్రమైన పసుపుతాడు నా మెడచుట్టూ కట్టాలాయన. ముడులువేసినా వెయ్యక పోయినా ఆ పసుపుతాడు పవిత్రత తగ్గిపోదు నాన్నా ! ఈ క్షణంనుంచీ మంచీ చెడూ, కష్ట సుఖం అన్నీ ఆయనతోనే" అంటూ స్పృహలేకుండా

పడివున్న రాజశేఖర్ వైపు ఆవేదనగా చూస్తూ కూర్చుంది పల్లవి.

కళ్ళవెంట ముత్యాలసరాల్లా తెగి పడుతున్నాయి కన్నీళ్ళు. ఈ పిల్ల మన పల్లవేనా? యిన్ని ధర్మసూత్రాలు ఎప్పుడు నేర్చుకుంది? మనందరికీ అందనంత ఎత్తుకు ఎప్పుడు ఎదిగి పోయింది? "మాకు పెళ్ళైంది నాన్నా!" అని ఎంత స్పష్టంగా, సరళంగా చెప్పేసింది. ఆశ్చర్యంగా ఆవేదనగా చూస్తున్న శంకరయ్యగారు కన్నీటితో మసకబారుతున్న కళ్ళను పైపంచతో అద్దుకుంటూ నీరసంగా రాజశేఖర్ ప్రక్కనే కూలబడ్డారు.

ఇంతలో రాజూ నాన్నగారు పెళ్ళికి వచ్చిన తమ ఫామిలీ డాక్టర్‌ను కొడుకు దగ్గరకు తీసుకొచ్చారు. ఎప్పుడూ ఎరగని ఈ జబ్బేవిటో తెలీక రాజు తల్లి వరలక్ష్మిగారు కొడుకు తలను ఒళ్ళోకి తీసుకొని.

"రాజు! నాయనా! ఏవిటిరా యీ ఖర్మ! మేం వద్దన్నా కావాలని ఈ పెళ్ళికి ఒప్పించావు. తీరా తాళి కట్ట బోయే సమయానికి యిలా అయి పోయిందేంరా బాబూ!" అంటూ విలపిస్తుంటే భర్త వచ్చి కసురుకున్నారు, 'కాసేపు నోరుమూసుకో డాక్టరుగారు పరీక్ష చేస్తా'రంటూ.

డాక్టర్ అందరినీ ప్రక్కకు తప్పుకోమని రాజశేఖర్‌ని పరీక్షచేశాడు.

"మరేంలేదు మీవాడు పూరికే అందరినీ భయపెట్టేశాడు. ఓవర్‌గా ఎగ్జైట్ అయ్యాడు. అంతకంటే మరేం లేదు. ఓ యింజక్షన్ ఇస్తే రెండు నిముషాల్లో లేచి కూర్చుంటాడు," అంటూ సిరంజిలోకి మందెక్కిస్తుండ కానే గబుక్కున లేచి ముందుకురక బోతున్న రాజశేఖర్‌ని వెంటనే పట్టుకుంది భయంగా పడిపోతాడేమోనని పల్లవి. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. కృతజ్ఞతగా చూసిన రాజశేఖర్ చూపుకు తలదించుకొని చిన్నగా నవ్వి చెయ్యి వదిలేసింది.

"వాటీజ్ దిస్ మై డియర్ బోయ్! గొప్ప సీన్ క్రియేట్ చేశావు. అంత ఎగ్జైట్ అయితే ఎలా చెప్పు? పాపం మీ మమ్మీ ఎంత భయపడిపోయారో తెలుసా? వీళ్ళంతా నీ కేదో జబ్బుందని యీ పెళ్ళి ఆపుచేద్దామని చూశారు. సమయానికి చిన్నదైనా పల్లవి అందరికీ సరైన సమాధానం చెప్పింది" అంటున్న డాక్టర్ వేణుగోపాల్ వైపు చూసి నవ్వుతూ,

"సారీ అంకుల్. ఇంకాసేపు అలాగే వుండేవాడినే మీరు ఇంజక్షన్ తీయక పోతే. నాకు ఆ పేరు చెప్పి భయ పెట్టారుగానీ, లేకపోతే భలే తమాషాగా వుంది, ఒక్కొక్కళ్ళ రియాక్షన్స్ వింటుంటే. కాస్త ఎగ్జైట్ అయిన మాట నిజమేగానీ జరిగిందంతా పూర్తిగా నిజం

కాదు. నేను స్పృహతప్పిపోలేదు. మీరంతా అనవసరంగా ఖంగారు పడ్డారు; జస్టేమినిట్ అంకుల్ ! మీ మీ సీట్లలో కూర్చోండి మిగతా కథ తర్వాత చెబుతాను" అని కొంటెగా నవ్వుతూ.

"ఆఁ ! శాస్త్రిగారూ! మీ పని కానివ్వండి" అఁటూ మంగళసూత్రం చేతిలోకి తీసుకున్నాడు. నోరు తెరుచు కొని అందరితోపాటు విచిత్రంగా చూస్తున్న పురోహితుడు, గబుక్కున కీ యిచ్చినట్లే మంత్రాలు ప్రారంభించాడు.

"మాంగల్యం తంతునామే మామ దీవన హేతునాం" అంటూ ప్రారంభిం చడంతో భజంత్రీలు ఉత్సాహంగా మ్రోగించారు.

మళ్ళీ చిరునవ్వులు విరిశాయి పందిట్లో. ఒక్కసారి గుండెలమీద నుంచి చేతులు తీసేసి హాయిగా గాలి పీల్చుకొని,

'ఈ రాజశేఖర్ నిజంగా హీరోలా వున్నాడే' అనుకొని మళ్ళీ జరుగుతున్న కార్యక్రమం చూడ్డంలో మనస్సులు లగ్నం చేశారు కన్నెపడుచులు. జరిగిన దేవిటో తెలీకపోయినా వరుడు మామూలుగా కనిపించడంతో తృప్తి పడ్డారు పెద్దలంతా.

హాయిగా నవ్వుతూ పల్లవి మెడపై గిలిగింతలు పెడుతున్న వేళ్ళతో ముచ్చటగా మూడుముళ్ళు వేసి,

"ముడి గట్టిగా వుందో లేదో చూసుకో. లేకపోతే నన్ను నీ కొంగున ముడివేసుకో పల్లవీ" అని గుసగుసగా చెబుతూ ప్రక్కన కూర్చున్న రాజు వైపు వోరగా చూసి పెదాలు బిగించి నవ్వు నాపుకుంది పల్లవి.

పెళ్ళితంతు ముగియగానే

"నిన్ను తన్నాలిరా" అంటూ వచ్చిన ప్రసాద్‌ను చూసి,

"ఇంకాసేపు నే నలాగే పడుకు నుంటే నిన్ను తన్నివుండేవాళ్ళు" అంటూ నవ్వుతున్న రాజశేఖర్‌ని చూసి,

"అఘోరించావ్‌లేగానీ, యింతకీ ఈ నాటక మేవిటి ? మేమంతా ఎంత భయపడ్డామో తెలుసా ? ఎందుకురా అలా ఏడిపించావ్ అందరినీ శుభ సమయంలో" అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తున్న ఫ్రెండ్సందరినీ చుట్టూ కూర్చోబెట్టుకొని,

"మరేంలేదురా, ఓ చిన్న ఎడ్వంచర్ చేయాలనిపించింది. సంతోషంగా నవ్వుతూవుంటే అన్ని శుభకార్యాల్లాగే మా పెళ్ళి. కానీ ఓ క్రొత్త తరహాగా చేస్తే ఎలా వుంటుంది ? అని ఆలోచిం చాను. నిజానికి పల్లవిని చూసి కాస్త ఎగ్జైట్ అయ్యాను. మాంగల్యం కట్ట బోతుంటే మృదువుగా తగిలిన స్పర్శకు వేళ్ళు కొద్దిగా కంపించాయి.

అంతలో పల్లవితో హనీమూన్ ఎక్కడికి వెళ్ళాలనే ఆలోచన వచ్చింది.




ఆ ఆలోచనల్లో మునిగి, ముడివేయడం మరిచిపోయేసరికి పల్లవి తలపైకెత్తింది. దానితో యీ లోకంలోకి వచ్చిన నేను వులిక్కిపడటంతో మాంగల్యం జారి పల్లవి వొళ్ళో పడిపోయింది. అది ఒళ్ళో పడగానే పల్లవి నావైపు చూసింది. ఆ కళ్ళలో కించిత్ ఆవేదన, ఆందోళన స్పష్టంగా కనిపించాయి. శాస్త్రిగారు మంత్రాలు చదవడం ఆపేసి నావైపు చూస్తున్నారు దాంతో మౌనంగా నన్నే చూస్తున్న అందర్నీ చూసి నాకు ఓరుచెమటలు పట్టాయి.

ఈసారి గట్టిగా ముడివేద్దామనుకొని మంగళసూత్రం పట్టుకున్న నాకు, అవును ఈ ఎడ్వెంచర్ ఎందుకు చెయ్యకూడదు?యిలా చేస్తే ఏమౌతుంది? ఇప్పుడు న్యాయంగా పెళ్ళి అయీ కానట్టు లెఖ్ఖ. దీన్ని ఎవ రే రకంగా తీసుకుంటారు ? ముఖ్యంగా పల్లవి పెళ్లైనట్లు అంగీకరిస్తుందా లేదా ? దాన్నిబట్టి తనకు నామీద ఎంత అనురాగం వుందీ అర్థమౌతుంది. యిప్పుడు యీ సూత్రం కట్టకుండా వుండటం ఎలా అని ఆలోచిస్తున్నాను.

"వాడి వంట్లో బావున్నట్లు లేదు" అంటున్న మమ్మీ మాటలు వినిపించాయి. అంతే, అదే సాకుగా తీసుకో వచ్చని మాంగల్యాన్ని జార్చి అలాగే క్రిందకు జారిపోయాను. అప్పుడు పల్లవి రెండుచేతులూ నన్ను పట్టకొని ఆపాయి. ఆ క్షణంలో ఏమనిపించిందో తెలుసా?

'జీవితాంతం నిన్నేపరిస్థితుల్లోనూ పడిపోనివ్వను రాజూ!' అంటున్నట్లున్న ఆ స్పర్శ నాకు వింత అనుభూతిని ప్రసాదిస్తుంటే అలాగే కళ్ళుమూసుకున్నాను.

"వా! వా! వాట్ ఎ రొమాంటిక్ అయిడియా!" కళ్ళు చికిలించాడు కిషోర్.

మళ్ళీ మాట్లాడకుండా కిషోర్ నోరు మూశాడు శ్యాం.

నవ్వుతూ, సాగించాడు రాజు. "ఈ లోపు మీరంతా కలసి కావాలసినంత హంగామా చేశారు. ఏది ఏమైనా ఈ ఎడ్వెంచర్ అందరికీ గుర్తుంటుందికదా! దానితోపాటు మా పెళ్ళి గుర్తుంటుంది. 'మాకు పెళ్ళైపోయింది' అన్న పల్లవి డైలాగూ గుర్తుంటుంది. ఇక పల్లవి అనురాగమెంతహూనైనదోనాకే కాకుండా పెళ్ళికొచ్చిన వాళ్ళందరికీ తెల్సిపోయింది."

"దానితోపాటు నీకు యింజక్షనంటే భయమని తెల్సిపోయింది" అన్నాడు శ్యాం చెయ్యి లాగేస్తూ కిషోర్.

అంతా పగలబడి నవ్వుతుంటే,

"అరేయ్! అలాంటి అనుభూతి కోసం మళ్ళీ ఓసారి అలా యాక్ట్ చేయాలని వుందిరా" అన్నాడు రాజశేఖర్ కలల్లో తేలిపోతూ.

"అలాగే, మళ్ళీ ఆ సందర్భం రావాలంటే నీ షష్టిపూర్తికి ఆ కోరిక తీర్చుకుందువుగానిలే, మళ్ళీ పెళ్ళి చేసుకుని మరోసారి మా పల్లవి చేతుల్లో పడిపోకుండా కాపాడబడి" అంటున్న ప్రసాద్ మాటలకు గది నవ్వులతో మారుమ్రోగింది.

"అన్నట్లు, ఇప్పటివిషయం తెలిశాక యింకా పల్లవి పట్టుకుంటుందన్న ఆశ వదులుకో" మంటున్న ప్రసాద్‌ను రాజశేఖర్ వీపున చరిచాడు.

తలుపు చాటున వుండి రాజు చెప్పిన కథంతా ఆసాంతం విన్న పల్లవి స్నేహితులు వైర్‌లెస్ కంటే వేగంగా వార్తను అందజేశారు పల్లవికి.

పల్లవి హనుమాయమ్మను పిలిచి "అత్తయ్యా! ఓ గ్లాసునిండా నిమ్మరసం పట్టుకెళ్ళిపెళ్ళికొడుక్కివ్వమనిచెప్పింది. ఆ మాట వినటమే ఆలస్యం ఆఘమేఘాల మీద వంటశాలలోకి పరుగెట్టి, ఓ పెద్ద గ్లాసునిండా నిమ్మరసం తీసి ఓ రెండు చెంచాల వుప్పు పల్లవి చెప్పినట్లే వేసి రాజూవాళ్ళుకూర్చున్నగదిలోకివచ్చింది.

"నాయనా రాజూ! ఈ నిమ్మరసం త్రాగరా, పైత్యం తగ్గుతుంది. పైత్యం ప్రకోపించి వుంటుంది. నా కా ఆలోచన రాలేదుసుమా. పల్లవి ఎంతైనాతెలివైంది. వూ! తాగు త్వరగా. నా కవతల పనుంది" అంటూ గ్లాసు చేతిలో పెట్టడంతో గ్లాసు ప్రక్కనపెట్టి విరగబడి నవ్వాడు రాజశేఖర్ పల్లవి చేసిన కొంటె పనికి.

"చెల్లాయిని అభినందించి వస్తా" నంటూ పరుగెట్టాడు ప్రసాద్.

"నా తరపునకూడా!" మనసారా నవ్వుతూ కేకేశాడు రాజశేఖర్. అతనితో మొదటి పరిచయంలోనే పల్లవి అన్న నిమ్మకాయలు మాట జ్ఞాపకం వచ్చి

కిషోర్, శ్యాం, అంతా తలుచుకొని తలుచుకొని నవ్వుతుంటే చిరాకేసిన హనుమాయమ్మ-

"చూడబోతే మీ అందరికీ పైత్యం చేసినట్లుంది లేకపోతే ఏవిట్రా ఆ నవ్వులూ" అంది

కూర్చున్న చోటునుంచి లేచిన రాజశేఖర్. హనుమాయమ్మ భుజంచుట్టూ చెయ్యివేసి నవ్వుతూ దూరంగా తీసుకెళ్ళి అతిప్రయత్నంమీద నవ్వును ఆపుకుంటూ సిన్సియర్‌గా "పిన్నీ భలే ఆకలిగా వుంది తినడానికేమైనా తెచ్చిపెట్టవూ" అనగానే

"మా నాయనే! మరి చెప్పవేంరా! అసలు నీరసమొచ్చే అలా పడిపోయ్యుంటావ్! యిప్పుడే తీసుకొస్తాను..." అంటూ సంతోషంగా లోపలికెళ్ళిపోయింది. ఆమె వెళ్ళినవైపే చూస్తున్న రాజశేఖర్ పొట్ట పట్టుకొని నవ్వుతూ నుంచున్నాడు. ప్రక్కగది కిటికీమీద అప్రయత్నంగా పడ్డ రాజు కళ్ళకు కొంటెగా నవ్వుతున్న పల్లవి కళ్ళు కనిపించాయి. గబగబా తను కూర్చున్నచోటికెళ్ళి నిమ్మరసం గ్లాసు తీసుకొని నవ్వుతూ పల్లవి వైపు చూశాడ . నోటిదగ్గర పెట్టుకుంటూ. కిటికీ దగ్గరనుంచి లోపలికి పారిపోయింది చిన్నగా నవ్వుతూ. అప్పుడే గదిలో చేరిన పల్లవి స్నేహితురాళ్ళు ఆత్రంగా రాజశేఖర్‌ను చూడాలని వచ్చి అతను కిటికీ వైపే చూస్తుండటంతో సిగ్గుపడి తుర్రుమన్నారు.

హాయిగా నవ్వుతూ కబుర్లలో పడ్డారు స్నేహితులంతా. రాజశేఖర్, ప్రసాద్ వాళ్ళతో కలిశారు

రాజు హృదయాన ఆనందం విరిసింది.

అనురాగం కురిసింది.

పల్లవినోట పెళ్ళిపీటలపై వినిపించిన మాటలు-

హృదయ ఫలకంమీద ముద్రవేసుకున్న అనురాగపు శాసనాలు. కమనీయ కన్నె హృదయపు కరగిపోని ప్రేమకు చిహ్నాలు. పరస్పరం కళ్ళతో మాట్లాడుకున్న భాషకందని భావాలకు మూగ భాషకు, మూగ ప్రేమకు, భాష్యం చెప్పిన మధుర ఘడియలవి

పెన్ను చేతిలోకి తీసుకున్న రాజు జేబులో నుంచి చిన్న డైరీ తీసి యిలా వ్రాశాడు.

"మాకు పెళ్ళైంది" పలికింది పల్లవి. అని వ్రాసి అండర్‌లైను చేశాడు.

"అనుపల్లవి మా పూల పల్లకిలో సాగింది."

అని ఆ తర్వాత వ్రాసుకున్నాడు.

ది గ్రేట్ ఎడ్వెంచరస్ హీరో రాజశేఖర్.

— — —

## రవీందర్ ఒక స్వంత ఇంటిని కట్టుకోవడం తన జీవితాశయంగా పెట్టుకున్నాడు.





## ఆంధ్రా బ్యాంక్ గృహకల్ప పథకంలో అతడు పొదుపుచేసిన ధనానికి సమానమైన మొత్తం ఋణ రూపంలో లభించింది. ఆ ధనంతో ఒక చక్కటి ఇంటికి యజమాని అయ్యాడు రవీందర్.

ఇల్లు కట్టాలి — రవీందర్ ఆశయం ఒక పెద్ద పథకం. ఆ పెద్ద పథకాన్ని చిన్న మొత్తాలతో నెరవేర్చేదే ఆంధ్రా బ్యాంక్ 'గృహకల్ప'. ఈ పథకంలో మీరు పొదుపుచేసే ధనంతో పాటు అంతే విలువగల మొత్తం ఋణంగా మీకు లభిస్తుంది. ఆ ఋణాన్ని మీరు సులభ వాయిదాలలో తీర్చవచ్చు. దూరదృష్టితో ఆంధ్రా బ్యాంక్ 'గృహకల్ప' పథకంలో చేరిన అనేకమందిలో రవీందర్ ఒకరు. అవసరాలకు ఆదుకునే ఆంధ్రా బ్యాంక్‌వారి అనేక పథకాలలో గృహకల్ప ఒకటి.

దాదాపు 56 సంవత్సరాల అపారమైన అనుభవం గడించి, 600 కు పైగా శాఖలతో, దేశమంతటా విస్తరించిన ఆంధ్రా బ్యాంక్ అనేక ఇతర పథకాలను కూడా ప్రవేశ పెట్టింది. [illegible], [illegible] బ్యాంక్, [illegible], పంక్షేమ జనసహాయి, [illegible] సహాయి, కల్పతరువు మరియు మహిళా సంక్షేమ పథకాలు. ప్రతి పథకం ప్రత్యేకమైనదే. ఒక్కొక్క సమస్య తీర్చడానికి ఒక్కొక్క పథకం. అంతేగాదు [illegible], బలహీనవర్గాలకు కూడా

ఆంధ్రా బ్యాంక్ ఆర్థిక సహాయం చేస్తోంది

ప్రజావసరాలకై పాటుపడేది - ఆంధ్రాబ్యాంక్

**దీ ఆంధ్రా బ్యాంక్ లి.**

కేంద్ర కార్యాలయం, సుల్తాన్ బజార్,
హైదరాబాద్-500 001

ఒ. స్వామినాథరెడ్డి . చైర్మన్

KIRON/AB/78 14 TEL

# వడిగాడు వాన సిరా



## చెళ్లూరి సీతా రాజేశ్వరరావు

పతంజలికి ఎంతకీ నిద్ర పట్టలేదు.

గంటకి పైగా మంచంమీద దొర్లడం వల్ల విసుగ్గా వుంది. సగం లేచి గడియారంకేసి చూశాడు. రెండయింది.

శాలువా వంటినిండా కప్పుకుని వరండాలోకి వచ్చాడు. చలిగాలి వీస్తోంది.

ఆకాశం మబ్బుపట్టి వుంది. ప్రకృతి నిస్తేజంగా వుంది. వాతావరణం భారంగా వుంది. వర్షం ఏ క్షణమయినా పడవచ్చు.

పతంజలి దృష్టి గ్యారేజీవైపు పడింది. తలుపులు తీసివున్నాయి. కారు లేదు. ఎదురగా స్కూటర్ పార్క్ చేసి వుంది.

ఎవరు వచ్చారు ? ఎవరయినా వస్తే పోలయ్య చెప్పడా ?

పతంజలి మేడ దిగి వచ్చాడు. హాలు నిశ్శబ్దంగా వుంది. వంటషెడ్డు వరండాలో సుబ్బమ్మ కునికిపాట్లు

## ఇది కోయును...



## ఇది కాల్చును...



## ఇది మాన్పును.

-శమనమిచ్చు
మానేలా చేసే తెల్లని క్రీము

Dettol
REGD
ANTISEPTIC CREAM

# క్రొత్త డెట్టాల్ ఏంటిసెప్టిక్ క్రీమ్

**క్షేమనమిచ్చును మరియు మాన్పును తెగినా మరియు కాలినా**

డెట్టాల్ ఏంటీసెప్టిక్ క్రీమ్ మాత్రమే,
ప్రపంచ మంతటా నమ్మబడిన,
శక్తివంతమైనదిగా రుజువై, క్రీమ్ రూపంలో
త్వరితంగా, నికరంగా మానేలా చేసే,
ఏంటీసెప్టిక్ గుణం కలిగియున్నది. క్రొత్త
డెట్టాల్ ఏంటీసెప్టిక్ క్రీమ్ తెగినా, కాలినా,
స్తనాల పైభాగం పగుళ్ళకు, పగిలిన పెదిమలకు
మరియు ఒరిసిన చేతులకు శమనమిచ్చి మానేలా
చేయును. ఇంకా ఏమంటే ఇది తెల్లని క్రీమ్, మరకలు
పడనీయదు! నేడే ఒక ట్యూబ్ కొనండి.

**మరకలు పడనివ్వదు**



డెట్టాల్ — డాక్టర్లచే నమ్మబడిన పేరు

రెక్కిట్ & కోల్‌మన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్
ఫార్మస్యూటికల్ డివిజన్
41 చౌరంగీ రోడ్, కలకత్తా 700 071

LINTAS-DAC-5C-1710 TL

పడుతోంది. పతంజలిని చూసి భయంగా లేచి కూర్చుంది.

"పోలయ్యా!" పతంజలి పిలిచాడు.

"ఇంటి కెళ్ళాడేమోనండి" సుబ్బమ్మ సమాధానం చెప్పింది.

విద్య తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. పతంజలి తలుపులు త్రోశాడు. తోటలోకి వేళ్ళే తలుపులు బార్లా తీసివున్నాయి వరండాలోకి రాగానే మాటలు వినిపిస్తున్నాయి.

పతంజలి ప్రక్కగా ఆగిపోయాడు. తోట అంతా స్పష్టంగా కనిపిస్తోంది. విద్య సిమెంటు బెంచీమీద కూర్చుని వుంది అశోక్ సిగరెట్ కాలుస్తూ ఆమెముందు నించున్నాడు. విద్య ధరించిన గులాబీరంగు డిసి యం చీర గాలికి ఎగురుతోంది

వాళ్ళిని చూడగానే పతంజలి హృదయం భగ్గుమంది.

పెళ్ళయింది. అయినా విద్యకి బుద్ధి రాలేదు. పాతస్నేహితుడ్ని మరచిపోలేక పోతున్నది. తోటలో కూర్చుని నలుగురూ చూస్తారని కూడ లేకుండా కబుర్లు చెపుతుందా ?

"విద్యా .." పిలుద్దామని తమాయించుకున్నాడు.

తోటలోని సంభాషణం వినిపిస్తోంది స్పష్టంగా. పతంజలి ఆవేశాన్ని స్వాధీనం చేసుకుంటూ ఆగిపోయాడు.

"నీ దగ్గర్నుంచి కబురు రాగానే ఎగిరి గంతేశాను. నువ్వేమో చలిగాలిలో కూర్చో పెట్టి మాట్లాడుతున్నావు. గదిలోకి పోదాం పద." అశోక్ భుజాల మీద తట్టి అన్నాడు ప్రక్కన కూర్చుంటూ.

విద్య దూరంగా జరిగింది.

"నీకోసం తక్కిన పనులన్నీ మానేసి వచ్చాను...... వెచ్చగా నీ కౌగిలిలో ఈ చలికాచుకుందామని" అశోక్ కళ్ళల్లో కాంక్ష కనిపిస్తోంది.

"నువ్వు వస్తావనే అనుకున్నాను."

"మునపటికంటె అందంగా వున్నావ్ విద్యా."

అశోక్ ఆమె బుగ్గలు అందుకోబోయాడు. విద్య దూరంగా జరిగింది. అశోక్ ఆమె తొడలమీద చేయి వేశాడు. ఆమెని అందుకోడానికి ముందుకు వంగాడు.

"మిస్టర్ అశోక్" గంభీరంగా అంది విద్య. "దయచేసి నువ్వు బుద్ధిగా కూర్చోవాలి ఇట్స్ మై రిక్వెస్ట్."

అశోక్ నిరాశగా కూర్చున్నాడు.

"గతాన్ని మనం మరచిపోవాలి. అనివార్య కారణాలచేత మన పెళ్ళి కాలేదు. మన దారులు విడిపోయాయి. అందుకు తగ్గట్టే మనం ప్రవర్తించాలి. నేను రాసిన ఉత్తరాలు నీ దగ్గర ఉన్నాయి. అవి నాకు అందచెయ్యి అశోక్."

"భయపడుతున్నావా విద్యా?"

"నా జ్ఞాపకార్థంకోసం," విద్య తలవంచుకుంది.

"నన్ను అంత దుర్మార్గుడిగా జమ కట్టకు విద్యా. వాటితో నీ కాపురాన్ని చెడగొట్టను. నన్ను నమ్ము. వాటిని మన పరిచయానికి గుర్తుగా దాచుకుంటాను."

భౌతికంగా యింకా గుర్తులు ఉంచుకోవడం అవసరమంటావా? కాలం ఎటువంటి చిక్కులు తెస్తుందో!" విద్య భయపడింది.

అశోక్ మాట్లాడలేదు.

"కొత్త ప్రపంచంలో ఇప్పుడే అడుగులు వేస్తున్నాను అశోక్! గతానికి సమాధిచేస్తేకాని నాకు భవిష్యత్తు లేదు." బేలగా అంది.

అశోక్ లేచాడు.

"ఆల్‌రైట్ విద్యా .... సాయంత్రం పంపిస్తాను నువ్వు భయపడేటప్పుడు అవి నా కెందుకు!"

"పీటికోసమే అన్నయ్యని చూద్దామన్న వంకతో వచ్చాను "

"మరి వస్తా...విద్యా."

"మరచిపోకు," హెచ్చరించింది.

అశోక్ స్కూటర్ కనిపించేదాకా అక్కడే వున్నది విద్య. ఇప్పుడు ఆమె మనస్సు ప్రశాంతంగా వుంది.

అర్ధరాత్రి కోనేరులా నిర్మలంగా వుంది.

మెల్లగా లోపలికి నడిచింది.

# బ్రిటానియా పాల బిస్కట్



## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!




**రుచికరమైన,**
**పుష్టికరమైన**
**బ్రిటానియా**
**గ్లాక్సో మిల్క్ బికీస్**

లింటాస్-BBC.GLXMB.2-172 Te

గుమ్మంలో సీరియస్‌గా తండ్రి నిలబడివున్నాడు.

విద్య తడబడింది. ప్రక్కనుంచి వెళ్ళిపోదానికి ప్రయత్నించింది పతంజలి "ఆగు" అన్నాడు గర్జిస్తూ.

"ఎవరు వస్త !"

విద్య మాట్లాడలేదు. దోషిగా పట్టుబడిపోవటం ఆమెకి చాల బాధగా వుంది. తండ్రి నిద్రపోయే టైం కదాని అశోక్‌ని పిలిపించింది. అశోక్ రావడం ఆయన చూశాడా ?

"అశోక్ కదూ ?" పతంజలి రెట్టించాడు

విద్య తలూపింది.

"పాతకథతిరిగినట్ల స్తూందన్నమాట."

"అదికాదు నాన్నా......" విద్యకి కంగారువల్ల మాటలు గుర్తురాలేదు.

పతంజలి అసహ్యంగా చూశాడు : "ఈనాడు నువ్వు నా కూతురివి కాదు. మరోవ్యక్తి భార్యవి. నీపై వచ్చే కళంకానికి మేం సంజాయిషీ ఇచ్చుకోవాలి అవమానం భరించాలి. ఆ పరిస్థితి రాకుండా చెయ్యటం నీ చేతుల్లో వుంది "

విద్య తలూపింది

ఆ విషయంమీద కూతురితో ఇంకా చర్చించడం పతంజలికి యిష్టంలేదు. హాల్లోకి వచ్చేశాడు. మనస్సంతా అశాంతిగా వుంది.

ప్రొద్దుట ఉత్తరం జ్ఞప్తికి వచ్చింది.

విద్యని క్షమించాడు కూతురు కనుక. కాని తా నా ఉత్తరం రాయొచ్చా ? అది సమంజసమా ? ఒక చోట ఒక న్యాయమూ, ఇంకొక చోట మరో న్యాయమూ ఉంటుందా ?

పతంజలి గొడుగు తీసుకుని బయలుదేరాడు. పలుచగా చినుకులు పడుతున్నాయి. రోడ్డంతా గొడుగులతో నిండిపోయింది.

మూడుగంటలకి టపా బయలుదేరుతుంది. ఏమైనా ఆ ఉత్తరం వెళ్ళకూడదు. పతంజలి వేగంగా నడిచి పోస్టాఫీసు చేరుకున్నాడు.

పోస్టుమాన్ బాక్సు తీసి ఉత్తరాల మీద ముద్రలు కొడుతున్నాడు. పతంజలిని చూసి "నమస్కారం సార్" అన్నాడు.

పతంజలి చెప్పగానే కవరు తీసి యిచ్చాడు.

"దీనికోసం మీరు రావాలా సార్!" పోస్టుమేన్ అన్నాడు.

"పోలయ్య ఎక్కడికో వెళ్ళాడు."

ఉత్తరం అందుకోగానే పతంజలికి బలం వచ్చింది. కవరు జేబులో పెట్టుకుని ఇంటికి బయలుదేరాడు.

తను నిద్రపోయివుంటే ఉత్తరం ప్రయాణం చేసివుండేది. సంసారంలో కలతలు విజృంభించేవి. అశాంతి రాజ్యమేలేది.

ఇది అందగానే శ్రీపతి గుండెలు

పగిలేవి. తిరిగి వాడి ఆరోగ్యం ఖరాబయ్యేది. వాడిమీద ఆశలు పెట్టుకున్న తాము ఏమయ్యేవారు ?

ఇంటికి రాగానే వర్షం ఉధృతమైంది.

వీధి వరండాలోని పెద్ద కుర్చీలో కాళ్ళు కడుక్కుని కూర్చున్నాడు. సుబ్బమ్మ వేడి వేడి టీ తీసుకువచ్చింది.

"అమ్మాయిగారు వెళ్ళిపోతానంటున్నారు బాబూ."

"వానలో ఎక్కడికి వెళుతుంది ! కారు లేదుగా."

సుబ్బమ్మ ఏం మాట్లాడలేదు

"ప్రొద్దుటే వెళ్ళవచ్చని చెప్పు."

సుబ్బమ్మ చెప్పక్కర్లేదు. విద్య తలుపుచాటున నిలబడివుంది. తన రహస్యం తండ్రికి తెల్సిపోయాక అక్కడ ఉండబుద్ధికాలేదు ఆమెకి.

తండ్రి సీరియస్‌గా కూర్చోవడంతో, ఆయన తనను గురించే ఆలోచిస్తున్నాడని అభిప్రాయపడింది.

పతంజలి కవరు చింపి ఉత్తరాన్ని తీశాడు.

రెండుపేజీల ఉత్తరం. రగిలే గుండెలతో రాసిన ఉత్తరం. తనే న్యాయాధిపతయితే ఆ విషయాన్ని అక్కడే తేల్చేసేవాడు. కాని తన కా అధికారం లేదు.

తను కేవలం సాక్షి.

జరిగిన యదార్థాన్ని ఉత్తరంగా రాశాడు.

## గమనిక

రచయిత(త్రు)లు తమ తమ రచనలు పంపేటప్పుడు కొత్త పోస్టల్ రేట్లు జూన్ 1 నుంచి అమలులోకి వచ్చినవి గుర్తుంచుకొని తగినన్ని తపాలా బిళ్లలు వేసి పంపవలసిందిగా కోరుచున్నాము.

ఎడిటర్, యువ





# నోటి దుర్వాసనను ఆపండి...
# కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
# దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యాగల నురుగు బాగా లోతుకు చేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్నా ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు!




**ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్నా మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.**

అది శ్రీపతికి తెలియాలి.

వాడు బాధపడ్డా తప్పదు. తెలుసుకోవాలి విషయం. ఏంచెయ్యాలో వాడే నిర్ణయించుకోవాలని ఉత్తరం రాశాడు.

వానజోరు ఎక్కువయింది. పోకచెట్లు నగ్ననృత్యం చేస్తున్నాయి. గాలికి రెండుమూడు చెట్లు గుమ్మాలకడ్డంగా పడిపోయాయి.

కారు వచ్చి ఆగింది. జయ దిగింది.

పతంజలిని చూసి పెద్దగా అడుగు లేసుకుంటూ లోపలి కెళ్ళిపోయింది.

జయ ఎక్కడికి కెళ్ళింది? కేకేసి అడుగుదామనుకుని విరమించుకున్నాడు. ఉత్తరం తీసి చదివాడు.

గతం గుర్తుకు వస్తోంది.

* * *

పతంజలి క్లబ్‌నుంచి ఇంటికి వచ్చేసరికి వాసుదేవరావు వరండాలో పచార్లు చేస్తున్నాడు. పతంజలి కారు బయటే ఆపి హడావిడిగా లోపలికి వెళ్ళాడు.

"క్రిమినల్ లాయరుగారు యింటికి రాగానే స్వాగతం చెబుతున్నారే."

"కేసుకి కాదులే'' వాసుదేవరావు నవ్వి ఇన్విటేషన్ తీసి ఇచ్చాడు.

పతంజలి ఇన్విటేషన్ తిరగేసి "కొడుక్కి ప్రాక్టీసు అప్పగిస్తున్నా వన్నమాట, లక్కీ ఫెలో" అన్నాడు.

"అరవై దాటాక యింకా తాపత్రయం దేనికి పతంజలి. ఇది విశ్రాంతి తీసుకునే వయస్సు. ఇంకా బాధ్యతలు పెంచుకుని కష్టపడటం నా కిష్టంలేదు. అందుకే ప్రాక్టీసు మావాడికి ట్రాన్స్‌ఫర్ చేసేస్తున్నాను."

"నీ అదృష్టం అందరికీ వస్తుందా వాసూ" పతంజలి గొంతు జీరబోయింది.

వాసుదేవరావు నవ్వి కారు దగ్గరికెళ్ళాడు. "తప్పకుండా రావాలి నువ్వు"

"ష్యూర్... డ్రింక్ తాగి వెళుదువు గాని."

"నో. థాంక్స్... ఇప్పుడేం వద్దు." వాసుదేవరావు కారు స్టార్టుచేశాడు.

నాగరికత వెనుక, సంస్కారం లోపల మనిషి తన హావభావాల్ని దాచేసుకున్నా ఏకాంతంగా వున్నప్పుడు అంతరాత్మ ముందు యదాతథంగా నిలబడక తప్పదు.

వాసుదేవరావూ, తానూ వృత్తిరీత్యా స్నేహితులు. లీడింగ్ లాయర్లుగా బార్‌లో పేరుంది. వాసుదేవరావు నేడు తనకి అందని సుఖానికి వారసుడవడం ఈర్ష్యగా వుంది.

ప్రాక్టీసు కొడుక్కి అప్పగిస్తున్నాడు. మరి తను ?!

(ముగింపు వచ్చే సంచికలో)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor. A SUDHAKARA RAO




## బహుమతి : రూ. 116

ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాం. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తిచేయాలి. మిగతా అయిదింటికి పాఠకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి.

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1. సమాధానాలు "యువ" కూపనుమీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరుమీద "క్విజ్" అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపన్ తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దుబాట్లు ఉండరాదు. కూపన్లను పోస్టులోనే పంపాలి స్వయంగా వచ్చి ఇచ్చేవాటిని స్వీకరింపబడవు.
2. ఒకరికంటే ఎక్కువమంది ఆల్‌కరెక్ట్ సమాధానాల్ని పంపితే, వారికి బహుమతి సొమ్ము పంచడం జరుగుతుంది. సంఖ్య మరీ ఎక్కువైతే లాటరీ పద్ధతి అమలుపరుస్తాం.
3. సమాధానాలు సీలువేసిన కీ సొల్యూషన్‌తో సరిపోవాలి.
4. దీనికి సంబంధించిన విషయాలలో "యువ" సంపాదకునిదే తుది నిర్ణయం. క్విజ్ సమాధానాలను సెప్టెంబరు సంచికలో ప్రకటిస్తాము. ఈ విషయమై ఎట్లాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.
5. మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ జూలై 29. ఆపై వచ్చినవాటిని పరిశీలించడం జరగదు.

## ఆగస్టు నెల క్విజ్

1. అశోకన్ (Ashokan) రిజర్వాయర్ కింది సిటీలో ఉంది.

ఎ) న్యూయార్క్ బి) లండన్ సి) పారిస్ డి) ఢిల్లీ

2. ప్రాచీన గణితశాస్త్రానికి సంబంధించిన 'సిద్ధాంత శిరోమణి' గ్రంథకర్త.

ఎ) మహావీర బి) భాస్కర - II సి) భాస్కర - I డి) గంగాధర

3. ఎదిగిన మనిషి శరీరంలో —— ఎముక లుంటాయి.

ఎ) 570 బి) 470 సి) 370 డి) 270

4. 1977 సంవత్సరపు 'దాదా సాహెబ్ ఫాల్కే' అవార్డు గ్రహీత

ఎ) అశోక్ కుమార్ బి) నితిన్ బోస్ సి) దేవానంద్ డి) శాంతారాం

5. సుర్‌జిత్ సింగ్ కింది ఆటలో నిపుణుడు

ఎ) టెన్నిస్ బి) క్రికెట్ సి) వాలీబాల్ డి) హాకీ

6. సుడిగాలుల రాకను ముందుగా హెచ్చరించడానికి అమెరికాలో కొత్తగా కనుక్కొన్న సాధనం ————

7. భారతదేశ చరిత్రలో పరిపాలన జరిపిన తొలి మహిళ ————

8. భూమి సూర్యుని చుట్టూ ప్రదక్షిణం చేయడాన్ని ఒక ——— పరిగణిస్తారు.

9. తంజావూరులో బృహదీశ్వరాలయాన్ని నిర్మించినది ————

10. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీని ———— తేదీన రాష్ట్ర ప్రభుత్వం స్థాపించింది.

---

**యువ**

**క్విజ్ కూపన్ - ఆగస్టు '78**

**సమాధానాలు**

1- ☐ 2- ☐ 3- ☐ 4- ☐ 5- ☐

6 .................. 7 .................. 8 ..................

9 .................. 10 ..................

పేరు : ____________________

అడ్రసు: ____________________

____________________

____________________

